Being encouraged by the success of their brethren in South-Western Andhra, the brave people of coastal Andhra revolted against the Sultan's deputies at Rajahmundry. [1]Musunuri Prolaya Nayaka organised resistance from Rekapalli in the Bhadrachalam region. Muslims were driven away by him from the coastal districts. He was assisted in this movement by Prolaya Vema Reddi, who started the line of Reddi Kings at Addanki. The Andhras of Warangal too rose from the stupor of their defeat very soon. Kapaya Nayaka, nephew of Prolaya Nayaka encouraged the liberation movement in Telangana. The Sultan's governor at Warangal was defeated and expelled. Kapaya assumed the title "Andhra Suratrana". The Velāma rulers of Rachakonda in Telangana took part in this patriotic activity and carved for themselves a principality. Thus the Sultan lost the whole of Andhra.

There was danger of his losing even the recently conquered Kampili. Therefore it is said that he released the brothers Hari Hara and Bukka from captivity, invested them with authority and sent them to rule in that Kingdom as his subordinates. This must be the meaning of the statement of the chronicles that the Sultan made treaty with Narapathi Raya. Even this did not avail the Sultan to retain his dominions in the Deccan. Harihara and Bukka strengthened their position gradually and declared independence in 1336. The morning sun of Vizianagar empire rose on the horizon and dispelled all hopes of Muslim hegemony south of Tungabhadra for nearly 250 years.

In these vigorous and vitalising movements we lose sight of Virabhadra, the son of Pratapa Rudra. The chronicles state that the Sultan's deputies destroyed temples and plundered the people mercilessly. Virabhadra was not able to bear the sight. Nor had he the strength to save the people from such extortions. The only remedy for misrule is revolt. The people of Warangal rose in rebellion under Virabhadra, killed the Sultan's representatives. The exasperated people left the City and migrated to Kondavidu and joined the Raya. It may mean that Virabhadra left for the Reddy Kingdom. Thus ends the glorious line of Kakatiya emperors after a long, benevolent rule of three and a half centuries or more.

---

1. For details see "A Forgotten Chapter of Andhra History" by M. Somasekhara Sarma.

The manuscript of Siddheswara Charitra breaks off here. The Pratapa Charitra ends in a brief resume of events. It states "This contains 225 stories. This history of Kakatiyas starts one thousand years ago. It begins with the reign of Somadeva Raya, ruling at [1]Ampa Kandaramu, tells of Madhava Varma who was graced by Goddess Padmakshi. His descendants, the Kakatiyas, built Ekasila-nagara and ruled for one thousand years. God Siva blesses the readers of the story of Prataparudra, with children and eternal prosperity."

---

1. Whether Kandarapura has the name Ampa Kandaramu is not known.

# కాసె సర్వప్ప కవిత్వము

కాకతి రాజన్యుల కీర్తి ప్రాభవములను ప్రకటింప దలచినవాడై కాసె సర్వప్ప సిద్ధేశ్వర చరిత్రమును రచించెను. ఈతని గ్రంథమునకు మూలమైన ఏకామ్రనాథుని ప్రతాపచరిత్రము వచనమునందే యున్నది. గద్యముకన్న పద్యము ప్రశస్తమను భావముగలవా డగుటచే కాబోలు, సర్వప్ప పద్యకావ్యముగ దీనిని వెలయించెను. చరిత్ర, విజ్ఞానశాస్త్రము-వంటి విషయప్రధానములైన గ్రంథములు గద్యరూపమున నున్నప్పుడే యెక్కువ ప్రయోజనకారు లగునని ఈనాడు మనము భావించుచున్నాము. పూర్వు లట్లుగాక, విషయప్రధానములు, వాచ్యార్థ పర్యవసాన ములగు రచనములను గూడ పద్యరూపముననే కావించుట మన మెఱింగిన యంశము. గద్యముకన్న పద్యము ముఖస్థము చేయుట కెక్కుడు అనువుగా నుండుటయే దీనికి హేతువు కావచ్చును. ఎట్లైనను కాసె సర్వప్పకు కవి యను కీర్తి సంపాదించుటయందు తావన్మాత్రమైన లోభముండుట విదితము.

ఆతడు సమర్థుడైన కవి యనిపించుకొనుటకు చేయవలసిన కృషి చేసినట్లు కాన్పించదు, కృత్యారంభమునం దాతడు వ్రాసిన కొన్ని పంక్తులు వినయోక్తులుగా మనము గ్రహించినను, యథార్థవాక్యములని కూడ పరిగణింపవచ్చును.

> శబ్ద సంగతులను శాస్త్రాది విమల
> శబ్ద లక్షణములు చర్చించి యెఱుఁగ
> నాటకాలంకార నవ్య రీతులను
> కూటువ లంకువల్ గుణదోష ఛంద
> వాటంబు లేమియు వరుసతో నెఱుఁగ
>
> ... ... ...
>
> లబ్ధప్రసాదుండ సిద్ధేశుకరుణ.

ఉత్తమకవికి గావలసిన వ్యుత్పత్త్యభ్యాసములు సర్వప్పకు లభింపలే దనవచ్చును. కవితాబీజమైన ప్రతిభ యాతనియందు సముచితముగా లేకపోలేదు. దీనికి తార్కాణము సిద్ధేశ్వర చరిత్రయందలి ప్రథమాశ్వాసము. శివపార్వతులు కైలాసము నుండి దిగివచ్చి లోకానుగ్రహార్థమై హనుమాద్రిపై వెలయుట యిందలి విషయము. ఈ భాగము ఏకామ్రనాథుని ప్రతాపచరిత్రములో లేదు. అం దిట్లు గ్రంథారంభము చేయనైనది. "అట్టి పుణ్యాశ్రమంబునకు, ఈశాన్య భాగంబునందు హనుమద్గిరి

యను నొక ధరణీధరంబు విలసిల్లు. అప్పర్వత మధ్యభాగంబున ప్రమథ గణంబు లును, సకల మునిజన సేవితుండగు సిద్ధేశ్వరుండును, పశ్చిమ భాగంబునఁ బద్మాక్షిదేవియు గలరు." సిద్ధేశరావిర్భావమును గూర్చి యందేమియు లేదు. ఈ ఈ కథనంతను కాసె సర్వప్పయే ప్రవేశపెట్టి తనకుగల కవితాశక్తిని ప్రదర్శించి సార్థకము చేసికొనెను. కాళిదాసు కుమారసంభవమునందును ఇతర శివపురాణము లందును గల పార్వతీ పరమేశ్వర వివాహవృత్తాంతము నిందు తెచ్చిపెట్టి చరిత్ర గ్రంథమునందు గూడ మంచి రచనావకాశము నీతడు కల్పించుకొనెను.

పార్వతీకల్యాణకథ నీతడు ముద్దుముద్దుగ వ్రాసెనని చెప్పవచ్చును. వివాహ మునం దానాడును, ఈనాడును గూడ కన్పించు మనోజ్ఞ వాతావరణమును సర్వప్ప చక్కగా చిత్రించెను. హిమవంతుడు శంకరునకు కన్య నీయదలచి, తన బంధు వర్గమగు గోత్రాచలములతో సంప్రతించుట, పెండ్లికొడుకుతో సంబంధ నిశ్చయ మునకై మహర్షులు పోవుట, పెండ్లికొమరితను చూచుటకై మఱికొందఱు వృద్ధ మును లేతెంచుట, నిశ్చితార్థముగా ముద్రారోహణము చేయుట, పెండ్లి సంరం భము, ముత్తైదువుల పాటలు, హిమవంతుడు కూతునకు బుద్ధులు గరపుట- మున్నగు హృద్యమైన విషయముల నన్నిటిని కాసె సర్వప్ప చక్కగా వర్ణించెను. దీనినిబట్టి వస్తుసేకరణమునందును, వస్తు విన్యాసమునందును ఈ కవికి ప్రావీ ణ్యము కలదని నొక్కి వక్కాణింపవచ్చును.

కవితాశక్తి యెట్లున్నను సర్వప్పను ప్రేరేపించిన కవిత్వధ్యేయము మిక్కలి ప్రశంసనీయమై యున్నది. ఇతడు బమ్మెర పోతనాదుల కోవకుచెందిన కడగొట్టు తమ్ముడు. కవిత్యము పవిత్ర సాధనమనియు, దానిని పొట్టకూటికి గాక మహద్వి షయములను ప్రతిపాదించుటకై వినియోగింపవలెననియు నీతని మతము. తా నట్లే చేసి, తన గ్రంథమును శ్రీ సిద్ధేశ్వర మహాదేవునకే సమర్పించిన శుభశీలుడు. ఈ యంశముపై నాతడు వ్రాసిన పంక్తులు ఉల్లేఖింప దగియున్నవి.

నుత పురాతన నీతి కతలకు మీఱి

... ... ...

మతికెక్కు నూతన కతలను గొన్ని
బ్రతుకుకై బ్రతిమాలి నుతులిచ్చి కవిత
మతములఁ జెఱచెడి మతకలు కతలు?
మతికెక్కలే రెట్టి మతులైనఁ గావి

... ... ...

చెప్పితి రాజుల చరితలు పూర్వ
మొప్పుగ రాజ్యముల్ మొగిచేసి చనిన
చొప్పు చెప్పెద.

ఇట్టి యుత్తమలక్ష్యముతో తనకు గల కవితాపాటవమును వినియోగించిన సర్వప్ప కవీంద్రుడు కవిసమాజమునందు గణనీయు డనుటకు సందేహములేదు. ఆతనిని కడపంక్తినే కూర్చుండబెట్టుదమందురా, కానిండు.

సిద్ధేశ్వర చరిత్రమునందు గ్రంథపాతము, లేఖక దోషములు చాల గలవు. లక్షణ విరుద్ధ ప్రయోగములలో కొన్ని స్వయముగ కవి చేసినవే యని మనము చెప్పక తప్పదు. ఇట్లు చేయుట కవికి వ్యుత్పత్తి లేకపోవుటచేతనా? లేక అంగీక రింపబడిన లక్షణ సంప్రదాయమునకు భిన్నమైన సంప్రదాయము నీత డవలంబిం చుట చేతనా ? అని ప్రశ్నించుకొన దగును. ఈ రెండవ యూహయే సత్యము నకు సమీపముగా నుండగలదని భావించుచున్నాను. కానె సర్వప్ప శివకవుల మార్గమునకు చెందినవాడు. కానైతే ఈతడు వీరశైవుడు కాడు. వేదమతమున కనుగుణమైన సాధారణ శైవమతమునే పాటించినవాడు. అయినను కవిత్వరీతు లందు శివకవుల పదములను మెట్టినవాడు. ఏవి శివకవిరీతులు ?

1. శివభక్తుల కథలను, వర్తమాన వీరుల వృత్తాంతములను కావ్యవస్తు వుగా గైకొనుట.

2. దేశీయ ఛ్ఛందస్సులలో రచన చేయుట.

3. ఛందోవ్యాకరణ నియమములను కొంత సడలించుకొని, వాని పరిధిని విస్తృతము చేసికొనుట.

4. నాటి జన వ్యవహారమునకు సమీపముగా నుండు భాషానిబంధనము కావించుట. దీనినే ప్రాచీన శివకవులు జాను తెనుగని వ్యవహరించినట్లు కాన్పించును.

కానె సర్వప్పయం దీ లక్షణములు గోచరించుచున్నవి. శివభక్తుల చరిత్ర ములకు బదులుగా నీతడు ప్రజాహితతత్పరులైన మహారాజుల పుణ్యవృత్తాంతము లను కవితావస్తువుగా గ్రహించినాడు. వారును శివారాధకులే. కాకతీయుల శివాలయ ప్రతిష్ఠలు లోకప్రసిద్ధములు. వారు కావించిన తటాకారామ ప్రతిష్ఠలును నేటికిని కొంతవరకు నిలిచియే యున్నవి. ఇట్టి లోకహిత పరాయణుల చరిత్రమును కావ్య

వస్తువుగ గ్రహించుట శివకవి సంప్రదాయమున కనుగుణముగనే యున్నది. నాకు తెలిసినంతవరకును చరిత్ర ప్రసిద్ధులైన మహారాజుల కథనమును సాహిత్యము నందు ప్రవేశపెట్టిన యాంధ్రకవీశ్వరులలో నీతడే మొదటివాడు. కృష్ణరాయ విజయము, నరపతి విజయము మున్నగు చారిత్రక కావ్యములను వ్రాసిన కవు లీతనికి అనంతరులని చెప్పదగి యున్నది.

సిద్ధేశ్వరచరిత్రయం దీతడు వాడినది దేశీయ ఛందస్సైన ద్విపద. ఇందును ఈతడు సామాన్య ద్విపదనుగాక మంజరీ ద్విపదను పాటించినచో ఎక్కువ విజయమును సాధించి యుండును. అభ్యాసపాటవము విస్తారముగా లేనివాడగుటచే యతిప్రాసలను గూర్చునప్పుడు లక్షణ విరుద్ధ ప్రయోగములనుచేసి యున్నాడు. లేదా మే మిదివరలో సూచించినట్లు భిన్నలక్షణమార్గమును పాటించినవాడు. ఈతడు కావించిన ప్రయోగములను వానికి మూలములు కాదగిన హేతువులను దిగ్దర్శనముగ చూపింతుము.

(అ) *వ్యాకరణాంశములు* : సంధిని కూర్చుటయం దీతడు శివకవుల యాచారమును పాటించెను. అకారేకార సంధులు, క్త్వార్థకేకార సంధియు చేసినాడు.

| | |
|---|---|
| కందువ+అలర్చెను=కందువలర్చెను. | పుట. 4 |
| పర్వప్ప+అనువాద=పర్వప్పనువాద. | 4 |
| భూమి+అందును=భూమందును. | 23 |
| గోదావరి+ఉత్తరించి=గోదావరుత్తరించి. | 28 |
| బిలముదూరి+అటుబోవ=బిలముదూరటుబోవ. | 57 |

సంస్కృతసంధియందును కొంత స్వేచ్ఛ వహించెను.

| | |
|---|---|
| సద్యః+జీవన్ముక్తి=సద్యజీవన్ముక్తి. | 10 |

పురూరవుడు, అనుటకు పురురవుడు అని ప్రయోగించెను.

వైరి సమాసములను గూర్చుట యీతని కలవాటు. వామదక్షిణపాదులు; బత్తి సాయుధావళులు.

అన్యదేశ్యములను వాడుట యీతని యందును కలదు. వజీర్లు, సరదార్లు, బత్తీసు, ఎల్లెము=వేగము అను వర్థమున తెలంగాణమున నేటికిని గలదు. దీని నతడు ప్రయోగించెను. ఇట్లే మల్లెసాల, తోకొంచువంటి పదములు తెలంగాణము లోనే తరుచు వినవచ్చును. స్వరభక్తిచేసి సంయుక్తాక్షరములుగల శబ్దములను విడదీయుట ఇతర కవులందును గలదు. హర్షము అనుటకు హరుషము అని యీతని ప్రయోగము.

(అ) ఛందోవిషయములు : కానె సర్వప్పచేసిన యపప్రయోగములని చెప్ప దగినవి విస్తారముగా నీ శీర్షిక క్రిందనే చేర్పదగి యున్నవి. ఇవి యపప్రయోగము లనుటకంటె భిన్న సంప్రదాయసూచకములు అనుట యుక్తమని మాయభిప్రాయము.

1. ద్విపద మాత్రాగణబద్ధమైనది. ఇంద్రగణములతో నేర్పడునది. నల, నగ, సల, భర, త అను గణములలో, నలమున్ను 'భ' గణమున్ను 4 మాత్రలు కలవి. తక్కినవన్నియు నైదేసి మాత్రలు కలవి. కావున ఈరెంటినిగూడ పంచ మాత్రాకములుగ చేయుట బాగుండునను భావము కలవాడీ కవి. ఇతర శివకవు లెవరైన నిట్లు చేసిరేమో విచారింపవలెను. ఈతడు 'భ' గణముతోపాటు 'భల' గణమును, 'నల' ముతోపాటు 'నలల' గణమునుగూడ వాడినాడు, ద్విపద చదువు నప్పుడు ఈమార్పు మనకంతగా గోచరింపదు. తక్కిన యైదుమాత్రలగణములవలె నివియు నడచిపోవుచుండును, కొన్ని యుదాహరణములు :

| | |
|---|---|
| *అతని* కుల పావని యర్ధాంగలక్ష్మి | పుట 5 |
| *పదకమల* సౌరభా స్వాదనానూన | 21 |
| *నందగిరి* యనియెడి చందంబు గలుగ | 29 |
| *సానుమతి* హోమ సంస్కారాది విధుల | 35 |

2. ప్రాస యతి యందు పూర్వాక్షర నియమము నీతడు పాటించుటలేదు.

| | |
|---|---|
| *మదిని* సద్గురుడు శుక్రాదులు తెల్ప | పుట 18 |
| *వనములు* చెఱచి యుద్యాన ముల్ విఱిచి | 66 |

ప్రాసయతి యందు ద్విత్వమునకును ద్విత్వరహితమునకును మైత్రి కూర్చెను.

| | |
|---|---|
| జాల రువ్విన భక్తు లెల్లర భూతి | పుట 9 |

3. అద్రుచు, విద్రుచు మున్నగువానియందువలె సంయుక్తాక్షరమునకు పూర్వమున్న వర్ణము గురువు కాకుండుట. 'ఛ' కార పూర్వవర్ణము గురువు కాకుండుట. 'ఏకఛత్ర' పుట 53, 'గుణదోషఛంద' పుట 6.

4. ప్రాస యందు శాంత ప్రాస పద్ధతిని పాటించుట. అనగా సంయుక్తా క్షరము ప్రాసవర్ణమైనచో దానిలో నొక్క హల్లుతో మాత్రము మైత్రిని పొసగించుట యీతని రచన యందును గలదు.

| | |
|---|---|
| గోపుర ప్రాసాద కుట్టిమంబులను | పుట 17 |
| నేర్పుతో రచియించె నేపు దీపింప | |

5. యతి మైత్రిని కల్పించుటయం దీతడు మిక్కిలి స్వేచ్ఛవహించెను. జన వ్యవహారమునందు వినవచ్చు శబ్దరూపము నాధారముగా గొని యతి సమన్వయముచేసికొనుచు వచ్చెను. తెనుగునందు దంత్యతాలవ్య 'చ' కార భేదము గలదుగదా. 'ఇఈ ఎఏ లం గూడిన చ జ లు తాలవ్యములు' అను సూత్రమున్నది. 'చ' కారాదియైన పదములు సంస్కృతములైనను 'చె' యన్నట్లు వ్యవహారమున వినబడుచుండును. దీని నాధారముగా గొని యీ కవి యతి పాటింపజొచ్చెను.

చల్లమాంబను వేశ్య జేసి తెప్పించి — పుట 9

చెల్ల యన్నట్లు చదువవలెను. చెల్లమ్మ మున్నగు పేర్లు కలవు.

జయ భక్త ఫలదాయ శ్రీగిరిశాయ — పుట 15

జెయ అన్నట్లు చదువవలెను.

శ్రద్ధ ప్రథమ కథిత సేవ్యంబునందు — పుట 21

శ్రెద్ధ యని చదువవలెను. లోకములో నిట్లే వినవచ్చును. వర్ణప్లుతిచే కొందరు 'శెర్ధ' యని పలుకుటయు కలదు.

జనసేవ్యుడగుచును సిద్ధేశుడుండు. — పుట 24

జెన యని చదువవలెను.

చందురు దస్త్రాద్రి చేరిన లీల — పుట 39
చటులత వచ్చెను సిరియాలదేవి — 44
చండపరాక్రమము చెప్పి బాలునిది — 62

ఋకారమునకు ఉకారముతో మైత్రి పాటించుట ఈతనిలో సాధారణము. ప్రాచీన కాలములో నెట్లున్నను అర్వాచీనకాలములో 'ఋకారయుక్త' వర్ణములు 'ఉత్వ' సమేతములుగా వినవచ్చుచునేయుండును. దీని నాధారముగా గొని యీ యతి కల్పింపబడియుండును.

కృష్ణ గోదావరీ సంభిని మధ్య — పుట 23
ఉందు రెప్పుడు మునిబృందముతోడ — 23
ఋత్విక్కులను బిల్చి యాధిగా జేయ — 35
మృడుఁడు సిద్ధేశుఁడు ముదిత నీ కిచ్చు — 41

కొన్ని శబ్దరూపములను పొరపాటుగ గ్రహించుటచే యతి వైషమ్య మేర్పడినది. శ్రుతి=వేదము అను పదము 'శృతి' యన్నట్లు గ్రహించి యతి కూర్చుట జరిగినది.

చేకూర జెప్పరే శ్రుత్యుక్తముగను. పుట 35

చెదరక నడచేటి సంఖ్య యెట్లనిన. 37

ఈ శబ్దము 'చదరక' అన్నట్లు వినబడును. గుండె చెదరినది-చదరినది. అట్లే.

'ఎఱుకదేవరాజు' అనుటకు 'యరుకదేవరాజు' అని ప్రయోగించెను. పుట 24

యరుక, యానాది-ఇట్లు వ్యవహారము కలదు.

సోమదేవరాజు అను పదమును గణానుకూలముగ సోమదేవరరాజు అని చదువుకొనవలెను. కవి రెండు రూపములను బ్రయోగించెను.

'ల-న' వర్ణములకు యతి మైత్రిచేయు టొక విశేషము. 'లుతులసానాం దంతాః' అను సూత్రము మేరకు నిది సత్సంప్రదాయమే యగుచున్నది.

లీనాత్మ సముదిత నిత్య నిపుణుండు పుట 21

నాగనాథుని యడ్గులకు మ్రొక్కి-చాల 22

అఖండయతి యీతనికి సమ్మతము.

నందుండు సంక్రంద నాదుల మీఱె పుట 31

అనుస్వార సంబంధముచే 'ట-త' వర్గాక్షరములు మైత్రి నందునని యప్పకవి మనుచరిత్ర నుదాహరించెను. అనుస్వారసంబంధము లేకయు సర్వప్పకవి 'ట-త' వర్గాక్షరములకు యతి కూర్చెను.

దుర్గాది దుండిపటు క్షేత్రపాల పుట 20

పై యంశములనుబట్టి కాసె సర్వప్పకవి యనభ్యస్తుడనుటకన్న శివకవి సంప్రదాయమును పాటించినవా డనుట యుక్తతరముగ నుండును.

8—11—1960 ఖండవల్లి లక్ష్మీరంజనం

శ్రీశైలస్థిత మల్లికార్జున విభుః
శ్రీ దక్షవాటీ పతిః
భీమేశః సురకామినీ సహచరః
కాళేశ్వ రాధీశ్వరః
దేశే యత్ర వసంతి సంతత మతో
దివ్యా త్రిలిఙ్గ స్థితేః
సోఽయం దేశశిఖామణి ర్విజయతే
దేశ స్త్రిలిఙ్గాహ్వాయః.

— అనితల్లి కలువచేఱు శాసనము



సిద్ధేశ్వరలింగము

# శ్రీ సిద్ధేశ్వరచరిత్రము

## [కాకతీయరాజుల చరిత్ర - ప్రతాపచరిత్ర]

### ప్రథమాశ్వాసము

### అవతారిక

శ్రీ సదాశివమూర్తి ! చిరతర కీర్తి !
వాసవనుత ! కృత్తివాస ! మహేశ !
కరుణాకరాభవ ! కళకంఠ ! శర్వ !
గిరిశ ! మృత్యుంజయ ! గీర్వాణవంద్య !
పరమేశ యోగీశ (పాపవినాశ)
సురశైలచాప భాసుర దివ్యరూప
నిగమాంత సంవేద్య నిఖిలైకవంద్య
జగదీశ పార్వతీశ్వర పురారాతి
ధవళాంగ కలుషవిధ్వంసక శూలి
భువనసంభూతి సంభవన కపాలి[1]
భూతనాయక మహాద్భుతచరిత్రాత్మ
పూతచారిత్ర లో*కైక పవిత్ర
భాషావధూటీ విభావరీనాథ
శేష కర్పూర రంజిత యశోహార
నిత్య సత్యజ్ఞాన నిపుణ విధేయ
కాత్యాయనీమనఃకంజవిహార[2]
సాంబ నిర్జిత పంచసాయక కాంచ
*నాంబరలోచనక పద్మపూజ

1. సంభూత సంభావ కపాలి; 2. కాత్యరాయనిమనఃకంజద్విహార.

దేవాది[1] ......సుహృద్భావ
పావనాత్మక మిమ్ముఁ బ్రస్తుతించెదను
సిద్ధమాహాత్మ్యంబు చెప్పంగఁ దలఁచి
*సాధ్యంపు ద్విపదలఁ జర్చింతు సుజన
హృద్యమై సద్బుధ చోద్యమై భక్త
వేద్యమై ప్రమథకృతాద్యమై తనరి
సిద్ధ (వి)శేషతఁ జెలఁగుచునుండు
సిద్ధాశ్రమంబులు చెలఁగి భువిపయి
బుద్ధిఁదలఁచఁ జాలఁ బొగడిత కెక్కు
సిద్ధప్రతిష్ఠలు చెలఁగి మూఁడందు
రేవణా సిద్ధేశు (ఁడు) విమలభావు
ప్రవరసంగ(మ) సిద్ధపతియ గోదావ
రందుండు దాని తీరము నివాసముగ
నందుండు హనుమాద్రియందు సిద్ధేశుఁ
డగ్ని ప్రతిష్ఠని యందురు కొంద
*అది జనులకుఁ దెలియ దందలి మహిమ
ప్రభు......................
.........................
సిద్ధేశ్వరస్తుతి చేకొని సభల[2]
వృద్ధ సమ్మతముగ వేదోక్తఫణితి
విద్యచేఁ గను సిద్ధ విఖ్యాతమహిమ
విద్యచే గన సాధ్య*మగునె యెవ్వరిక
పార విద్యాది తత్త్వ విచారనీతి
పారగులకుఁ గాక భవుని సల్లీల
చేరంగవచ్చునె జిలిబిలివేష
పారగులైన వా*చాడంబరులకు

1. దేహాది; 2. సభం.

గాన శ్రీసిద్ధేశు ఘనమహత్త్వంబు
వీనుల కింపుగా వినిపింతు వినుఁడు.

మొద(లు) శ్రీ విఘ్నేశు మూషకవాహు
నదమలంబుగ నాత్మఁ జక్కంగ నిలిపి
శారదాదేవిని జక్కంగఁ గొలిచి
వీరశైవాచార విదులగునట్టి
ఘోరవికార మా*యాచారులైన
మారారి భక్తుల మదిలోనఁ దలఁచి
శైవసిద్ధాంత ర*హస్య వేదార్థ
ప్రావీణ్యులగునట్టి భక్తులఁ దలఁచి
మద్వంశవరులను మాననీయులను
విద్వద్గరిష్ఠుల వినిపింతు వినుఁడు
ఆశ్వలాయన శాఖయందుద్భవించి
*శా(శ్వతైశ్వర్యుండు) సద్గుణ గరిష్ఠుఁ
డాత్రేయ గోత్రజుం డమలసద్యశుఁడు
గోత్రధీరుఁడు బ్రహ్మకులసంభవుండు
కాసె మల్లణమంత్రి ఘనకుమారకుడు
వాసికెక్కినయట్టి వంశవర్ధనుఁడు
[1]బయకారములు పెక్కు పద్యకావ్యములు
నయమొప్పఁజెప్పిన నాగరకుండు
శివపదధ్యానైక చిన్మయాత్మకుఁడు
[2]శైవ శాస్త్రాగమ సారానుభవుఁడు
లింగార్చనక్రియా*నిరతుండు కాసె[3]
గంగాధరుండు జగత్ప్రసిద్ధుండు[4]

1. భయకారములు; 2. ప్రాస చెల్లించువేళ పూర్వాక్షరము లొకట లఘువులుగాను వేరొకట గురువులుగాను అసమానములై యుండుట యీ కృతియందు బహు స్థలముల గానిపించును; 3. కాశ; 4. జగత్ప్రసిద్ధి వదని.

అందు నానందంబు దెందమలరఁగ
సతతవ్రతాచార సంపన్న ధన్య
పతిభక్తియును గల పరమ పవిత్ర
సతి యరుంధతితోడ సరిపోల్పవచ్చు
కలియుగగౌరి శ్రీశ్వద్గుణోద్ధారి
యలరు సంపదలచే నమరు నిల్లాలు
ఆ దంపతులకు సమ్మోదంబుగాను
ఉదయమందెను తాను సుగుణాన్వితుఁడు
మానసీయుల సభ మల్లప్పరాజు[1]
గాన విద్యల భోజు కందర్పతేజుఁ
డతనికిఁ దగు దేవులైన లక్ష్మాయి
సతిసుగుణోపేత సంతత శాంత
మానవతీశ్రేష్ఠ మహిత[2] సంతుష్ట
అనయంబుఁ బతివ్రతంబున నొప్పుచుండు
ఆ దంపతులకును హరుష మింపొంద
మాదిరిఁగలిగె కుమారత్రయంబు
అందగ్రజుండు సర్వప్పనం గతని
కందువలర్చెను ఘన పరదేశి
అతనికి సోదరుం డతినీతివిదుఁడు
మతిమంతుఁ డనఘుఁడు మానసీయుండు
మఱవఁ డెన్నఁడు మేలు మానధనుండు
వీరణార్యుఁడు బోధ విద్యల కధికుఁ
డం దగ్రజుండ సర్వప్పనువాఁడఁ
బొందుగ నుండుచుఁ బొలికొండసీమ
ఆజన్మ ప్రభృతి నాకవు[3] జన్మభూమి
తేజంబులకుఁ దల్లి ధృతి చెర్వుపల్లి

మానసీయుల రాజవశం మల్లప్ప; 2. మదిత; 3. నడ.

పెండార్లనుండియు నండచేసికొని
నందు గర్భాష్టకమందున జనక
విహితాక్షరాభ్యాస విద్యోపనయన
సహితుండనైతి సంస్కార వినీతి
నారీతి నీరీతి నేరీతి లేమి
చేరితి దారిద్ర్య చింతచే నున్న
యంతట నొక కొన్ని యబ్దముల్ చనిన
యంతలో నుద్వాహ వంత నున్నంత
ఘన వైభవములందు గానంగఁ బడుచు
ననయంబు ధర్మవర్తనల వర్తిల్లి
ఘనుఁడు వదాన్యుండు కవిత(ల) సుకవి
వినుతుండు విజ్ఞాన విమల చరితుఁడు
సరసుఁ డెల్లెడలను స్వామికార్యముల
ముదిగొండ దమ్మన్న[1] ముఖ్యుఁడౌ నెన్న
*నతని కులపావని యర్ధాంగలక్ష్మి
[2]సతులందు నొప్పుఁ బా*తివ్రత్యమహిమఁ
బతిహిత గుణచర్య ప్రాభవౌదార్య
సతి నన్నపూర్ణకు సరినెన్నవచ్చు
రామమ్మసాటికి రావు సుస్త్రీలు
వేమరు భువిలోన వినుతిసేయంగ
నా దంపతులు నాకు హర్షమింపొంద
మోదంబుతోఁ బుత్రి మొగిఁ బెండ్లిచేసి
వరవస్త్ర భూషణావళులు నా కిచ్చి
సరగున నుద్యోగసరణు లిప్పించి
నన్ను మన్ననచేయ నాఁటినుండియును
సన్నుతిఁ బరఁగితి సభికు లౌననఁగ

1. 'ముదిగొండ ధర్మన్న' అయియుండును; 2. సుతులందు.

అతనికి నిజరాణి యలికులవేణి
మెండైన యీ యన్మకొండలోపలను
సిద్ధేశు కరుణఁ బ్రసిద్ధిగా నుండి
సిద్ధమాహాత్మ్యంబు చెప్పితి వినుఁడు.

సిద్ధేశుఁ డచటికి శివుఁడు దా వచ్చి
పార్వతితోఁ గూడి పరఁగంగ నిలచి
పూర్వ పశ్చిమముల భూధరంబులను
వసియించి జనులకుఁ బొసఁగంగఁ గోర్కె
లెసగంగ నిచ్చిన యిద్ధ[1] చరితము
ఎఱుకు రాజులు నేలి యిట చన్న పిదప
వఱకు నేలిన రాజవరుల మహిమంబు
సరకు నేయక దేవి సమ్ముఖంబునను
నిరుకు సాహసముల నేర్పడఁజేసి
వరవైభవములచే వసుమతినేలు
నరనాథులగు కాకి*తమహారాజ
వరుల చరిత్రలు వరుసతోడుతను
వ్రతములు తపములు వరశివాలయము
లతులితగతి తడాకాది[2] సత్కృతుల
నలరు ప్రతాపుని యంశలాదిగను
జెప్పితి ద్విపదలచే నొప్పుగాను
నొప్పుఁగఁ జెప్పెద నొనరంగ వినుఁడి
శబ్ద సంగతులును శాస్త్రాది విమల
శబ్దలక్షణములు చర్చించి యెఱుఁగ
నాటకాలంకార నవ్యరీతులను[3]
కూటువ లుంకువల్ గుణదోష ఛంద

1. యద్ది; 2. వంసత్కృతుల; 3. నవ్యన్యునాతి.

వాటంబులేమియు వరుసతో నెఱుఁగ
సిద్దేశ్వరస్తుతి చేకొని మె(ద)ను
లబ్ధప్రసాదు(ండ) సిద్దేశు కరుణ
కరమరు దగుచు శ్రీకరమగుచుండు
వరవర్ణితంబగు వరకవిత్వంపు
తత్ప్రాప్తు లెఱుఁగ నాతని స్వామికరుణఁ
జెప్పితి నీకృతి చేకొని వినుఁడి.

## శివుఁడు సిద్ధేశ్వరుఁ డగుట

శ్రీ రజతాచల శిఖరంబునందు
నారదు వీణాస్వనంబులు వినుచు
చేరికఁ బ్రమథులు చెలఁగుచుఁ గొలువ
భృంగీశ తాండవ ప్రియుఁడునై దివ్య
మంగళ మణి [1]గిరి మహనీయలీల
నంగనామణి సతి యర్ధాంగి గౌరి
సంగతి యొప్పఁగ సరసత నుండి
వామభాగంబున వలనొప్పుచుండు
పాము, కెంజడల లోపల గంగ నునిచి
భైరవ గుహ వీరభద్రులు గొలువ
గారవింపుచు విశ్వకర్తఁ బేర్కొనుచు
బ్రహ్మాది సురలెల్లఁ బ్రస్తుతిచేయ
బ్రహ్మసుజ్ఞాన సంపదగల మునులు
కొమరొప్పఁ గొలువుండి కూర్చున్నవేళఁ
బ్రమథు లిట్లని శివుఁ బ్రార్థించిరపుడు :

1. ఖరి.

“ఓ దీనరక్షక ఓ కఱకంఠ
ఆదిదేవుఁడవు నీ వఖిలాధిపతివి
భల్లాణరాయని భక్తి కన్గొనఁగ
చల్లమాంబను వేశ్యఁ*జేసి తెప్పించి
కదిసినయెడ మోహకత్వంబు లేక
ముదమొప్ప సుతుఁడవై ముద్దుచూపితివి
చిఱుతొండ భక్తుని శిశువుకై పోయి
సిరియాళుఁ గూరగాఁ జేసి ప్రోచితివి
జాల రువ్విన భక్తు*లెల్లర భూతి
రైలైన(?) [1]శరణులఁ *జేసి ప్రోచితివి
కుంచెనగాఁ బంపెఁ గొదలేక యొకఁడు
వింటఁగొట్టె నొకండు వెఱవక మిమ్ము
చంటి బలిచ్చెను సర్వజ్ఞుఁ డొకఁడు
[2]దంటించి రొకట............
కన్నప్ప పాదసంగతి పూజనంబు
మన్నించి యెంగిలిమాంసంబు గొంటి
[3]వేలాది ప్రమథుల నేలనో యభవ
భూలోకమున జగత్పూజితంబైన
సిద్ధేశురూపుఁ బ్రసిద్ధి వహింపు
సిద్ధులు మునులును జేరి కొల్చెదరు
అది యెట్టిదనిన నో యభవ నీ కేము
విదితంబుగా విన్నవింతుము తెలియ
శ్రీశైల ముత్తరదేశంబునందు
భాసిల్లు గోదావ*రీ కృష్ణమధ్య
మున నుండు హైడింబముఖ్య నాశ్రమము
అనుమకొండనఁగ పురాధిరాజంబు

1. శరణులం; 2. దంటించి రొకట వటించె నొక; 3. ఏమల.

కనుఁగొన వేడుకగా నొప్పుచుండు
నచటికిఁ గ్రోశద్వయమగు దూరమున
నచటికి నీశాన్యమం దొప్పుచుండు
కోటలఁ గొమ్మలఁ గొమరైన పువ్వుఁ
దోఁటల బావులఁ దొలఁకెడు పూర్ణ
తర తటాకములచే ధనధాన్యమహిమ
(కరుల సంఘములును) దురగ సంఘములఁ
గదనోగ్రభటులు రంగద్గోపురములఁ
గనక కవాట సంఘాత గృహమ్ము
లనుపమ నవరత్నహారజాలములు
సుందరీమణులు భూసుర రాజ వైశ్య
బృందంబులును శూద్రబృందాదికములఁ
గలుగుచు సకల [1]సౌఖ్యమ్ములఁ దనరి
మలఁగుచు వర్ణాశ్రమంబులతోడఁ
గరమొప్పుచున్న [2]తద్గ్రామంబుచెంత
వెరవొప్ప నుండును [3]గిరిరాజ మొకఁడు
అందుల గర్గణాద్యాదిమశక్తు
లెందఱేఁ గల రాగిరీంద్రంబుచుట్టు
సిద్ధుల మునుముంద [4]శివుగుడిచెంత
నిద్ధమిద్ధంబని యిత్తురు కాయ
సిద్ధులు, నౌషధసిద్ధుల నొసగు
సిద్ధులు గల్గు ప్రసిద్ధ హన్మాద్రి
గిరిదక్షిణమునఁ [5]జెచ్చెర నొక్క వింత
సరసి తీరంబు వేమఱు చెప్పవచ్చు
నా మహాసరసికి నాగ్నేయదిశను
నా మహామహిమంబు లబ్జజుకైన

1. వైభవములఁ 2. తద్గ్రామణి; 3. గిరీంద్రంబు నొకడె; 4. శివుగుడు చంద్ద; 5. జెప్పఁగ.

వేమఱు వర్ణింప విశదంబు లగునె
కలిదోషముల రోసి గజిబిజిఁ బాసి
వెలియు లోనను జూచి విశ్వంబుఁ దెలిసి
ఫలములు తెగఁగోసి ప్రాజ్ఞత వెలసి
వెలయ బ్రహ్మజ్ఞాన విధులను దెలిసి
వెలయు దక్షిణకాశి వేదవారాశి
యలరు కైలాసాద్రి యగు హనుమాద్రి
సద్యజీవన్ముక్తి సచివులయుక్తి
హృద్య చిత్సుఖము [1]సంశ్రిత తపఃఫలము
యతులకు ముదము కామ్యార్థుల సుఖము
గతుల మొదల్పాతకము లాడ వదలు
తపసులపంట మో*క్షశ్రీల కుంట
ఉపమలలేవ వా*చాశుద్ధిత్రోవ
న్యాయంబుప్రోక యన్యాయంబు ఢాక
కాయంబు శుద్ధి [2]చాగంబుల బుద్ధి
సిద్ధుల కుబుసు ప్రసిద్ధుల సొగసు
వృద్ధుల జపము ప్రబుద్ధుల పదము
వ్యక్తజనులదండ *వేడ్కలకొండ
భక్తజనులకండ ప్రాపన్మకొండ
సిద్ధులు పూజింపఁ జెలఁగుచు నుండు"
మని వేడి పార్వతి నపుడు వీక్షించి
వినతులై ప్రమథులు వేడ్క నిట్లనిరి :
"వినుమంబ! నీకేమి విన్నవించెదము.
మును దక్షకృత యాగ [3]మున నవమాన
మునునొంది కోపంబు మునుకొని నీవు
చని సర్వకుల గోత్ర సన్నుతి పాత్రుఁ

1. భాస్వర ; 2. చైతన్యంబు ; 3. మునసుదాపిన.

డని హిమవంతున కామేనకకును
జనియించి వారల సత్కృతుల్ గొనుచు
ననుదినం బభివృద్ధినంది పెంపొంది
యనుపమంబగు యౌవనాగమంబైన
సుమహిత (నిజతనూ) శోభాతిశయత
రమణుఁగా శివునిఁగోరఁగఁ దండ్రి యరిగి
యీ కూఁతు శివునకే యిచ్చెద ననుచు
మేకొని తనవారి మిత్రబాంధవుల
కులగోత్రపతుల శ్రీ కుధర సుమేరు
మలయ మందర సేతు మహీధర క్రౌంచ
గంధమాదన నీల ఘనచక్రవాళ
బంధుర రోహణ పర్వత నిషధ
సురుచిరాస్తోదయ శుభసింహ కూర్మ
గరుడ వింధ్య మహీంద్ర కరిసింహఋష్య
భూమిభృన్మాల్యవద్భూధరముఖ్య
హేమకూటముల నింపెనయ రావించి
కామరూపంబులు కైకొని వారు
తమతమ విభవముల్ తనర వేంచేయ
హిమవంతుఁ డందఱ నెలమిఁ బూజించి
క్షేమంబులడిగి మచ్చిక ముద్దుకూఁతుఁ
గామాంతకునకును గడు నీయఁదలఁచు
తనపూన్కి తెల్ప నందఱు సమ్మతించి
యనుకూల వాక్యంబులాడి యందఱును
వరముహూర్తంబున వరునిఁ జూచుటకుఁ
గర మొప్ప వేడుకల్ గడలుకొనంగ
గురుశుక్రులాదిగాఁ గొందఱు మునులఁ
గఱకంఠుపాలికిఁ గడువేడ్కఁ బనుప

వారలు శకునముల్ వర్ణించుకొనుచుఁ
బేరైన తాంబూలపేటు లావిగను
శుభకరముల(యందు) సురలు ధరించి
వైభవంబున రాఁగ వచ్చి తద్రజత
గిరిఁ జేరి మందర గిరిశు కేవార్త
మురియుచు నారదుముఖమునఁ దెలిపి
యతని యంగీకృతి నటఁ బ్రవేశించి
మతిమీఱ శర్వుని మహిమముల్ పొగడి
సమహితవిధము లీశున కెఱింగింప
నతఁడు సంతోషించి యానందలహరి
హితవొప్ప వారితో [1]నిష్టము తెలుప
తాంబూలము నొసఁగి తగ వరదక్షి
ణం బిచ్చియును తత్క్షణంబున మీరు
మావెంటనే రండు మంచి ముహూర్త
మీవేళ శకునంబు లెచ్చునప్పుడును
గనుఁగొని మనము లగ్నము నిశ్చయింత
మని తోడుకొని(పోయి) యా మార్గమందు
శుభనిమిత్తంబులు చూచుచు నేగి
రభసంబుతో గిరీంద్రము చేరఁబోయి
హిమవంతుతోడుత (నీ) క్ర(మ)మెల్లఁ
గ్రమమునఁ జెప్పెఁ దత్కౌతుకం బెఱిగి
నిన్ను దోడ్తేఁబుచ్చె నిపుణలైనట్టి
యన్నలినాక్షుల నంతిపురమున
కంత శ్రీ పార్వతి యెంతో వేడుకలఁ
గాంత లెంతయు నంతఁ గైసేసి రెలమి
మేనకాదేవియు *ముద్దు కూఁతునకు

1. నిష్టత.

సూన మంజరి (శుభ) సూచకమణుల
హారముల్ రత్నాల హారంబు దీర్చి
సరవిని సకల భూషణములు వెట్టి
బాలఁ గై నేసి రవ్వల ప్రాణసఖులు
నెలమిని ముందర నిరుపార్శ్వములను
జాఁగు బళాయని సఖులు కడంగ
బాగుగ ముత్యాల పాలకీ యెక్కి
సోగకన్నులఁ దోటి సుందరుల్ గొలిచి
వేగంబుగా ముందువెనుక నేతేర
పనిగొని వినయ సంభ్రమములు మనము
నన పెనఁగొనఁగ నా*యంభోరుహాక్షి
మునులఁ జూచియు ముద్దు తొనకెడు చూపు
లాననంబున దరహాసంబు నిగుడ
జగతి శృంగారరసంబెల్ల నజుఁడు
చిగురాకుఁబోఁజేఁగా జేసెనోనాఁగఁ
గోరిక లీరికల్ కొనగొని సాగఁ
బారంగ శివుమీది భక్తియుఁ గదుర
వాస(వ) వందిత వై భవం బలర
భాసుర ముత్యాల పాలకి డిగ్గి
మౌనీశ్వరులకు నమస్కృతి జేయ
మౌనులు తగు వంద*నంబులుచేయ
ముత్యాల గద్దెపై మునుకొని యపుడు
కాత్యాయనీ దేవిఁ గడు నలంకృతను
గావించియు శుభలక్షణములఁ జూచి
వావిరి [1]తర(?)సాధ్య వై భవంబులకుఁ
బ్రోవుగాఁబోలని పొగడుచుండంగ

1. అర్థము ?

సాముద్రికముశాస్త్ర సంగతులెల్ల
వేమరు ప్రేళ్లెన్ని విస్మితులగుచు
నా మహామునులంత హర్షంబుతోడ
సోమార్ధధరునకు సుదతి పార్వతికిఁ
జంద్ర తారాబల [1]సఖ్యంబు గలిపి
సాంద్ర మైశ్వర (నామ) సంవత్సరమున
వెరవొప్ప కార్తిక వెస శుద్ధ నవమి
పరమేశ్వరునకును బ్రాఁతియౌ సోమ
వారంబు రాత్రి ధ*నుర్లగ్నమునకు
గారవంబున నాల్గు గడియలలోన
నని మునులందఱు హర్షమింపొదవఁ
గనుఁగొని లగ్నని*శ్చయము గావించి
రంబకు నపుడు ముద్రారోహణంబు
తాంబూల తతులతోఁ దగ సమర్పించి
యంతఃపురంబున కెంతయు ననిపి
నంత(ట) హిమవంతుఁ డెంతొ వేడుకలఁ
గాంత శ్రీ పార్వతీకళ్యాణమునకు
సంతసంబున సర్వజనులును గొలువ
కంతుసంహరుఁ జూడఁగలిగిన దనుచు
నెంతయు మునులకు నిలఁ జాగి మ్రొక్కి
మునుల వీడ్కొలిపెను ముదముతోడుతను
వెనుకొని కొంతదవ్వేఁగి వారలను
ననుపుచు నెంతయు నానందమునను
కైలాసకుధరంబుకడ దిక్కుఁజూచి
వాలాయితంబుగ వర్ణించి మ్రొక్కి
నన్నుఁ బుణ్యునిఁజేయ నాగేంద్రధరుడు

1. శ్రేష్ఠంబు.

కన్నెఁ జేకొనుమనంచుఁ గడు సంభ్రమమున
[1]శ్రీ నీలగళుమీఁదఁ జిత్తంబు నిలిపి
*సన్నుతు లెంతయు సద్భక్తిఁ జేసి
తన మందిరమునకుఁ దగ నేగుదెంచె
ఘనమునులును దారు కైలాసమునకు
నరుగుచునుండంగ నంత నక్కడను
శుభసూచకంబులు చూచుచు నపుడు
వైభవంబులతోడ వారును బోయి
శ్రీ రజతాచల శిఖరంబుఁ జేరి
వారు నంజలిఁజేసి [2]వరుస నిట్లనిరి
జయసర్వలోకేశ ! శాశ్వతైశ్వర్య !
జయ భక్తఫలదాయ* శ్రీ గిరీశాయ
నిత్యం నమోస్తు తే నీలకంఠాయ
సత్యస్వరూపాయ సర్వేశ్వరాయ
[3]శివ ! మీదు నానతి శీతాద్రి కరిగి
సావధానత మేము శర్వాణిఁ జూడఁ
గందు నెందును లేని కళల సంపూర్ణ
చంద్రబింబము మీఱ సకల సౌభాగ్య
మంగళగుణముల మహితచారిత్ర
సంగతి భార్యగాఁ *దగు మీకు వినుఁడు
మోదంబుతో నని మునుకొని తాము
పోయివచ్చిన[4]తీరు భూతేశు కంత
వేయివిధంబుల వినిపించి రంత
కాంత శ్రీ పార్వతి కల్యాణమునకు
దేవేంద్రుఁ డాదిగా దిక్పాలవరుల
వావేగ రమ్మని వెసఁ బిల్వనంప

1. శ్రీంధరుమీది కోరిక లలర; 2. వారు; 3. దేవమీయానతి; 4. తెరకు.

వారిరిఁ దమతమ వాహనంబులతో
దేవతలెల్లరుఁ దెఱఁగొప్ప నపుడు
..........................
కొమరొప్పఁగాఁ బుణ్య కోమలుల్ తాము
శ్రీవిష్ణు బ్రహ్మలు చేరనేతెంచి
రా విష్టపమునుండి యాత్మేశుకడకు
గురుడు శుక్రుండును గొనగొని సప్త
వరఋషు(లెల్లరు వరుసతోడుతను)
..........................
మతిమీఱ నేతెంచి మక్కువలలర
గరుడ గంధర్వాది ఖచర కిన్నరులు
వెరవొప్ప రంభాది విమలాప్సరసలు
కడఁకతో వచ్చిరి కైలాసము(నకు)
..........................
ఇది మంచివేళని యీశ్వరు నపుడు
ముదమొప్ప వృషభేంద్రు*మీద నెక్కించి
నెమ్మి గురుండు హో*మాది సత్క్రతులు
సమ్మతి మంత్రాది సత్క్రతుల్ సలుప
తమతమ వాహన (తతులపై నెక్కి
యమరులెల్లరుఁగూడి యరుదెంచుచుండ)
రంభాదు లానందరసమున నాడ
గంభీర గంధర్వగానముల్ చెలగ
పద్మావధూటియుఁ బౌలోమ్య మర్త్య
పద్మాననలు పెండ్లిపాటలు పాడ
..........................
...గాఁ బంపెనట హిమాద్రియును
దానును దనబంధు ధాత్రీధరముల

[1]జానొప్ప రావించి చయ్యన విశ్వ
కర్మను రావించి ఘనపట్టణంబు
నిర్మింపుమనిన మానిత నవరత్న
. . . . . . . . . . . . . . . . . . . . . . .
(దీపకన)క వజ్ర సోపాన దివ్య
గోపుర ప్రాసాద కుట్టిమంబులను
*నేర్పుతో రచియించె నేపు దీపింప
చెఱువులు బావులు శివమందిరములు
వఱలు వర్ణాశ్రమ. . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . . . . .
వెలయు నోషధిపురి విభవంబులకును
నిర్మించి నేర్పుగా నిజశక్తి విశ్వ
కర్మ తానంతట కరములు మొగిచి
శ్రీ విశ్వనాథునిఁ జేరంగఁ బోయి
వేవేల విధముల వినుతులు చేసి
"హిమశైల విభునికి నెదురేగ వలయు
సుమనస కోట్లతో సుముహూర్తమునకు"
అని విన్నవించిన నంబికాధవుఁడు
పనిగొని వృషభేంద్రుపై నెక్కె నపుడు
సకలదేవతలును సంభ్రమంబునను
*జోకతోఁ గొలువంగ శోభనోత్తమము
లాదరంబునను వాహనముల మీఁద
మోదంబుతో నెక్కి ముందర నడువ
హరియును బ్రహ్మయు నానందముగను
బరఁగఁ బార్శ్వంబులఁ బరమేశుఁ గొలిచి
రా నంతలో హిమ*వంతుండు తనరు

1. దానొప్ప.

*వెనుకబలంబులు వివిధ బంధువులు
హితులు మంత్రులు మహీపతులును దొరలు
నతులితగతితోడ నప్పుడు శివుని
పాదపద్మములకు భక్తితో మ్రొక్క
మోదంబుతోడుత మొగిఁ దోడి తెచ్చి
పాదార్చనంబు సద్భక్తితోఁ జేసి
వేదఘోషములతో వినుతింప నపుడు
...దొగ్గడి పుణ్యులఁ బనుప
సన్నుతలీలను జననియు బంధు
సుదతులు దేవతా సుందరీమణులు
మొదలు నభ్యంగన ముఖ్యకృత్యములు
నడిపి వస్త్రవిభూషణములు మాల్యములు
కడు రమ్యముగ నలంకారంబుచేసి
మౌక్తికచ్ఛత్ర సమ్యక్ఛాయ ననుప
రక్తిచే వాద్యవిరావంబు లొలయ
వచ్చినఁ గడుగారవమున హిమాద్రి
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి కూరిమి మీఱ
నిదె సుముహూర్తమం చెంతయు నియతి
మదిని సద్గురుఁడు శు*క్రాదులు దెలుప
తగు మునీంద్రులు "సావధాన" యనంగ
నగధరాదులు ప్రేమనగుచు ధ్యానింప
నెన్నిక శాస్త్రోక్తి నిందుజూటునకుఁ
గన్నెను దండ్రి పూ*నిక ధారవోసె
పెండ్లికి వచ్చిన పెద్దల కెల్లఁ
బెండ్లి కట్నంబులఁ బ్రియముతో నొసఁగి
యరణంబులిచ్చి 'మాయమ్మ ర'మ్మనుచుఁ
బొరిపొరి నొక కొన్ని బుద్ధులు సెప్పి

నిను శంకరునకుఁ జూనిక నప్పగించి
యనిపిన యది మొద లాత్మేశ్వరునకు
నల నర్ధనారీశుఁడను పేరు చెలఁగె
నెలమిఁ బాయకయుండు నిట్టి నీ విపుడు
పద్మాక్షి యను పేరు పాటించి నీవు
పద్మాక్షి యనఁగఁ దప్పక నుద్భవించి
సిద్ధేశు పడమటి శిఖరిపై నిలుపు
మద్ధాత్రియం"దని యవుడు వేఁడుటయు.

పరమ సంతోషులై పార్వతీశ్వరులు
కరుణచేఁ బ్రమథులఁ గనుఁగొని "మీరు
నచట భక్త జనంబులై యుండుఁ డేము
నుచితాకృతుల నట్లయుండుదు" మనుచు
నప్పుడు సిద్ధేశుఁడయ్యె శంకరుఁడు
చెప్పి పార్వతి దాను సిద్ధేశు నెదుర
నుర్విలోపలఁ దాను నొప్పుఁ గుప్ప
పార్వతి యెంతయుఁ బద్మాక్షి యయ్యె
బ్రమథవర్గంబులు భక్తులై రచట
నమరిన సిద్ధాశ్రమంబనఁ బరఁగి
సకల దిక్కులయందు సంసేవ్యమగుచు
నకలుష జనులకు నాశ్రయం బగుచు
నొక ముహూర్తంబున నుర్వికి డిగ్గి
సకల భక్తశ్రేణి సన్నుతింపఁగను
శ్రీహనుమాద్రి దక్షిణ దిశయందు
నూహ బెంపొంద నచ్చటి పరస్థిర
వాసుఁడై విలసిల్లె వైభవం పలర
పార్వతియును దాను బరమహర్షమున

సర్వశక్తులు గొల్వ సంభ్రమంబునను
దుర్గాది దుండి వటు క్షేత్ర పాల
వర్గంబుతోడుత వైభవం బలర
సిద్ధాశ్రమంబున సిద్ధులు గొలువ
సిద్ధేశ్వరునకుఁ బశ్చిమ భాగమునను
వృద్ధసమ్మతముగ వేడుక లలర
నచట గోత్రంబునం దగ్రంబునందు
నచటను నిచటను నెచటను దాన
పద్మాక్షి యనఁగ సంపద్వైభవముల
సద్మంబులకు నెల్ల సకల భక్తులకు
నీప్సితార్థములు వేదేప్సితంబుగను
*వాత్సల్యమున నిచ్చు వరుస నెల్లపుడు
స్త్రీ పురుషులు పూజసేయుదు రెపుడు
విద్యార్థులకును దా విద్య లిచ్చినను
గద్యపద్యంబులఁ గాంక్షఁ జెప్పుదురు
మోక్షార్థులెల్లను మొగి పునశ్చరణ
లక్షలు నక్షర లక్షలుఁ జేసి
యక్షయ పదవుల నందుచుండుదురు
పుత్రార్థులగువారు పొసగఁ బూజించి
పుత్రులఁ బౌత్రులఁ [1]బొందనేరుతురు.

అని ప్రమథులు వేడ నా సదాశివుఁడు
భక్త హితార్థమై పరగంగ వచ్చి
వ్యక్త సిద్ధాశ్రమ* వీథులనుండె.

1. పొసగనేతురు.

## ఆశ్వాసాంతము

ఇది సిద్ధశైవ పు*రాణేతిహాస
సదమల భక్త స*చ్చిత్త వికాస
సింధురాసురత్వక్కుచేలాంగసంగ
బంధుర సిద్ధేశ పాదాబ్జభృంగ
విదిత ప్రమథాఖిల విద్వజ్జనాళి
పదకమల సౌరభాస్వాదనానూన
మానసాంభోజాత మధుకరపాన
లీనాత్మ సముదిత నిత్యనిపుణుండు
కాసె మల్లనమంత్రి ఘనకుమారకుఁడు
వాసిగాఁ జెప్పె సర్వప్ప నాహ్వాయుఁడు
సిద్ధ మాహాత్మ్యమన్ శ్రీకృతియందు
శ్రద్ధ ప్రథమ కథిత* సేవ్యంబునందు
వినిపింపఁ దొలుకాడు (వి)శ్రుత కావ్య
మునఁ బ్రథమాశ్వాస మొగినయ్యె నొకటి.

ప్రథమాశ్వాసము.

★

# శ్రీ సిద్ధేశ్వర చరిత్రము

## [కాకతీయరాజుల చరిత్ర - ప్రతాపచరిత్ర]

### ద్వితీయాశ్వాసము

### కథా మూలము

శ్రీమహాదేవునిఁ జిన్మయాత్మకుని
నా మహేశానుని నఖిల లోకేశు
శ్రీశుభ లింగంబు శ్రీ హన్మకొండ
పాశమోచను సిద్ధపతి మతిఁ దలఁచి
వేగంబ తన కనురాగంబుగాఁగ
నాగనాథుని యడ్గు*లకు మ్రొక్కి చాల
యతని యనుమతి నేకామ్రనాథుండు
మతిమీఱఁ జెప్పిన కత వచించెదను.

నుతపురాతన నీతి కతలకు మీఱి
కుతుక మొదవగ నామెతలుగ శ్రుతుల
[1]కవి బృందశ్రేణికి మతి కుదురగుచు
నుతికెక్కు నూతన కతలను గొన్ని
బ్రతుకుకై బ్రతిమాలి నుతులిచ్చి కవిత
మతములఁ జెఱచెడి మతకలు కతల (?)
మతికెక్కలే రెట్టి మతులైనఁ గాని
పృథివిపతుల (పేర) *వరణించు వంశ
ప్రథితంబుగాఁ జెప్ప బాగొప్ప వినుచుఁ

1. కరి.

జెప్పితి రాజుల *చరితలు పూర్వ
మొప్పగ రాజ్యముల్ మొగిచేసి చనిన
చొప్పు చెప్పెద జాడ తప్పక ప్రియము
లుప్పతిల్లఁ గుతుక మొప్పంగ వినుఁడి.

## సిద్ధ క్షేత్రము

ఆ రీతి ²సిద్ధులయందలి ప్రేమఁ
గూరి భూమందును మారారి యుఁడెఁ
బ్రమథ గణంబులు భక్తులై రచట
సమరంగ నొక కొన్ని యద్దముల్ చనఁగ
శ్రీశైల ముత్తర దేశంబునందు
ధాసురంబగు మధ్య భాగంబునకును
గృష్ణ గోదావరీ* కుంభిని మధ్య
³వేష్ణమై (?) భూమికి విశ్రాంతి నొప్పు
దండకారణ్యంబు తగమును నుండ
దండయై భూమికి మండనం బగుచు
నుండు హిడింబాశ్రమ*(ము)నకును దాని
దండ నీశాన్యాన నుండు హన్మాద్రి
కుధరంబు విలసిల్లఁ గులకుధర మన
పథ మార్గమున వచ్చి పాటించి సురలు
*కథలు చెప్పుచు నుంద్రు కాలహరణముగ
అందుఁ గిన్నర యక్ష లమరులు సిద్ధు
లుందు రెప్పుడు ముని బృందముతోడ
అప్పర్వతంబ పు*రంబుగా మధ్య
నొప్పు భాగంబున నొగి సిద్ధయోగి

2. సుష్టుల; 3. వేష్టనమని యర్థమేమో?

జనసేవ్యుఁడగుచును *సిద్ధేశుఁడుండుఁ
గనుగొనఁ బూర్వభాగంబునఁ దనరు
భద్రేశ్వరి యనంగ భయదంబుగాఁగ
కాద్రవేయసుతల్ప ఘనుఁడు గోపాల
మూర్తి దక్షిణ.........
.........కొనియుండు
నటఁ బశ్చిమమునను నమరులై దండి
చటుల భైరవమూర్తి *చేకొని కొలువ
బద్మాక్షియుండును బద్మాసనమున
సద్మంబుగఁ గుధరసద్మమందుండు
ఖాసిల్లు నుత్తర భాగంబునందుఁ
జేసి నిషాదరు*ద్రేశ్వరియుండు
గర్గళ దేవుండుగా నాదిగాఁగ
వర్గంబులై దేవవాసముల్ పెక్కు
దుర్గశక్తులు గల దుర్గంబు చుట్టు
వర్గంబులై పెక్కు వసతులు దేవ
భూదేవ వాసముల్ పొలుపుగ నుండు
నాదైన హనుమాద్రి నాదరువుఁ జేసి
*[1]యరుక దేవరాజు యను కిరాతకుఁడు
*నరకుగొన దేవరాజు సరిగాఁడటంచు
శ్రీశైలమలవాస దేశికోత్తముఁడు
శూరుఁడు, మారుఁడు, శుద్ధగంభీర
సారుఁడు, విపిన సంచారుఁడై వచ్చి
తన చారులను దానుఁ దగ హనుమాద్రి
*సానుదేశంబుల సంచరింపుచును
గిరియ తన కాధార*ముగఁ జేరి యచట

1. యరుక, యెరుక అను రెండు రూపములు వాడఁబడినవి.

*సురుచిర స్థలములు చూచి వెఱఁగంది
సిద్ధ జాగ్ర(త్) స్థలసీమని తెలిసి
సిద్ధేశుఁ [2]గొలుచుచు సేవింపుచుండె.

ఆతనికి కొండఁడు ననుమఁడు నాఁగ
నుతిమీర గర్గశే*యుండునసంగ
నూటయెన్బదియాఱు నొగి వత్సరములు
పాటించి యేలిరి బాగుగాఁ బృథ్వి
నంతట నొక కొన్ని హాయనంబులకు
నంత పద్మాక్షి వ*ర ప్రసాదమున
కాకితరాజులు ఘనవైభవమున
నేకశిలనగర మేపారఁ గట్టి
రటమీదఁ బెక్కు సాహసములుచేసి
*కోటలు పెట్టించి ఘోరసంగ్రామ
*పాటవంబునఁ జెలఁగి పాలించి రవని
నేటించి వారల మేటికీర్తులను
నూటయిర్వదియైదు నొప్పగు కథలు
శ్రీ మత్ప్రతాపుని* చరితంబు కథల
నేమంబులగు ననుక్ర*మణికఁ దెలియ
వేమరు ద్విపదల విస్తరించెదను
నేమమున వినుఁడు చిత్తంబు లలర.

## చంద్రవంశ వృత్తాంతము

శ్రీమహావిష్ణుని సితపద్మనాభి
ధామంబుగాఁ జూచి ధాత జనించె

2. గొలిచెటి.

ఆ మహా నలువకు నత్రి జనించె
నేకమై యత్రిసు నేత్రంబులందు
రాకా సుధాకర రాజు దాఁబుట్టె
జోకగా శివు జటాజూటంబు తనకు
వీఁక నునికి స్థాన వేదిగా నుండె
నంత సుధాకరు నమరులు చూచి
వింతగా నెలనెల వేడ భత్యములు
సంతసంబున నెడద తనరార నిచ్చెఁ
దన రాజసంబు దాఁ దనకు శోభిల్లఁ
గనుఁగొన నతనికిఁ [1]గలిగె బుధుండు
ఆతఁడు గ్రహంబుల కనుగుణుండగుచు
గతిమీఱి నక్షత్రగతి నుండునంత
పురురవుండనియెడి భూపాలవరుఁడు
కరమొప్ప బుధునికిఁ గడు జనియించె
సుతుఁడయ్యెఁ దా స్వర్గగతులఁ బాలించె
నతని యన్వయమున నమరసముండు
నుతికెక్కె భరతుండు కత లుద్ధరింప
గతులకు భారతకతలన నీతి
కతమున నభివృద్ధిఁ గాంచెఁ దా భువిని
నంత నా సంతతి కధికవిఖ్యాతి
కాంతులు, కీర్తి దిగంతులు, సత్య
వంతులు, సాహసవంతులు, శౌర్య
వంతులు, వర గాత్రవంతులు, హరికిఁ
బ్రాణులు, విజిత గీర్వాణులు, నార్త
త్రాణులు, నిఖిల సంత్రాణులనంగ
చండ పరాక్రముల్ మండలాధిపులు

1. గా బుద్ధు పుట్టె

పాండవేయులు పంచపాండవులనఁగ
ధర్మ భీమార్జునుల్ ధర్మసంవిదులు
కర్మక్షయులు వారి గాదిలికవలు
వారలు చేసిన పరధర్మవితతి
నేరీతిఁ జెప్పంగ నేర్పు వాటిల్లు
రాజసూయ మహాధ్వరంబులు పెక్కు
వాజపేయంబులు, వర దేవఋషుల
పితరుల నెంతయుఁ బ్రీతులఁ జేసి
సతతంబు ధర్మంబు సాగించి రట్టి
వీరులలోనఁ గి*రీటి తా మేటి
శూరుఁడై మూరారిఁ బోరిలో గెలిచె
వాసుదేవుని సూతు వాసిగాఁజేసి
కన్నులవాని................
జేసి కౌరవులను శిక్షించి గెలిచె
నది యేమి చెప్పను నా ధనంజయున
కది భూషణంబె సాహస పరాక్రమము
నతనికి నభిమన్యుఁ డరుదారఁ బుట్టె
నతఁడు తండ్రిని మీఱె నటఁ బ్రతాపమున
*నతనికి పరీక్షిత్తుఁ డమరంగఁ బుట్టి
సతతంబు ధర్మంబు సాగించి మించె
శ్రీరామచంద్రునిఁ జెలఁగుచు మీఱె
కేరుచుఁ గృతయుగ క్రియ కెక్కుడయ్యెఁ
ధర్మంబు నాల్గు పాదంబుల నడపె
కర్మంబు లన్నియుఁ గడకుఁబోనూకె
అమ్మహాత్మునకును నతిసంతసముగ
సమ్మతి [1]జనమేజ*యుఁడు సుతుఁడయ్యె

1. జనమేజయపుడు.

అతఁడు తండ్రికిఁ బగ నమరంగ దీర్చు
కై తక్షకాదుల కతి వినాశముగ
సర్పయాగమ్మను నేర్పొప్పఁ జేసె
నతనికి సుతుఁడయ్యె నా శతానీకుఁ
డతనికి క్షేమకుఁడన జనియించె
నాతఁడు తన రాజ్యమంతయు మూఁడు
జతలుగాఁ జేసియు సరినొకపాలు
భూసురాలికి నిచ్చి పూనెఁ దా నొకటి
వెస తీవ కుసుతమ వేఁబంబులకును (?)
పసమీఱఁగను ధర్మ ఫలదంబునకును (?)
చేసి చిక్కిన పాలు చెలఁగి భండరువుఁ
బోసి వదాన్యత బుధులకు నిచ్చె
చూసిన రాధేయు సొబగుదనర్చె
*నా క్షేమకునకు దయమందె జయార్కుఁ
డక్షీణ కీర్తి ప్రతాప సోమేంద్రుఁ
డను వార లిద్దఱు నగ్రమహిషికి
*జనియించిరం దగ్రజనపతికి విష్ణు
*వర్ధను, తమ్ముండు వరసోమనృపేంద్రు
కుత్తుంగభుజుఁడు రణోత్తుంగభుజుఁడు
అత్తరి దాయాదు లవని భాగముకు
పొత్తుగూడ దటంచుఁ బోయి గోదావ
రుత్తరించి.......................
రాజుల గెలిచి తా రాజరాజగుచు
భోజుఁడై నన్నూరు పురదుర్గములను
సాధించి యెనిమిది సంఖ్య రాజ్యములు
బోధించి ప్రజలు దా భువి మేలనంగఁ
బాలించెఁ దనపేరఁ బద్యగద్యములఁ

దూలించె విమతులఁ *గడు శక్తినట్లు
*నతని యగ్రమహిషియం దుదయించె
సతత దయారస సచ్చరితుండు
నందుండు జనుల కానందంబుగాఁగ
నందనందనుఁబోలె సౌందర్యమునను
నతని చరిత్రంబు నలకార్తవీర్య
పతి చరిత్రంబులు పాటిల్లునట్లు
అందు సం(గ్రహమైన) చందంబుగాఁగ
విందుగాఁ జెవులకు వినిపింతు వినుఁడు
నందగిరి యనియెడి చందంబు గలుగఁ
బొందుగాఁ బురమొందు పొసఁగ నిర్మించె
అందు వర్ణాశ్రమమందు నగ్రజుల
నందుండు చండవర్మనువాఁడు నాతఁ
డతనికి సహచరుఁ డతులతేజుండు
మతిమీఱ సూరయా*ధిత్యుఁ డనంగ
కవగూడి ప్రాధాన్య గతి దెలుపంగ
సవరగా నతనికి సద్గతుల్ దెలుపు
గురువుగానుండును గోవిదవరుఁడు
*శారదానందుఁ డాచార్య విధేయుఁ
డా రాజవరునకు (నసుఁగై నధార్య)
సాలగుణాచార సన్మార్గచరిత
భానుమతీదేవి పద్మినీదేవి
గా నందుఁడుండును ఘన పరాక్రముఁడు
*గనుక లంబోదరుడు ఘనరాజవరుఁడు
*ప్రాణసఖుండుగా భుజబలశౌర్యుఁ
డిల సులభుఁడు రాజు నెసఁగుచుఁ బనులు
సలుపుచు నుద్దండ సచివనాయకుడు

వారికిఁ దన రాజ్యభారంబు చుట్టి
పోరున శ్రీ నగంబునకుఁ దాఁ బోయి
లింగంబు మల్లికా*ర్జున భ్రమరాంబ
సాంగంబుగాఁ గొల్చి చనిచని యచట
సిద్ధోపదేశంబుచే నొక్క బిలము
వృద్ధతఁ జొచ్చెఁ బ్రబుద్ధతమీఱ
నందొక్క యోగి తా నాతని శౌర్య
కందువ ధైర్యంబు గని మెచ్చి యిచ్చె
బాగుగా ఖడ్గ ఘో*టకములు దగిన
యోగ వాగములు(ను) వేగంబ కొనుచు
సాగ జనార్దనస్వామితాఁ జూచి
పోఁగాదు నిలుమని పోనీక నిలిపి
మాయా నృసింహ స్వ*రూపంబుఁ దాల్చి
కోయని యార్భటి గుహవాత నిలువ
నావంత చెదరక యా చెంతనున్న
నా వింతలకు మెచ్చి యా జనార్దనుఁడు
వానిఁ జేరఁగఁబిల్చి వరశస్త్ర సమితిఁ
బూనిక నీయఁగాఁ బోక తా మగిడి
యబ్బిలము వెడలి యటఁ జనుదెంచి
యుబ్బుచుఁ గాంచిపు*రంబున కరిగి
చోళేంద్రు కూఁతు సు*నందనుదాని
పాళిఁబాణిగ్రహణ మక్కడఁ జేసి
యటఁ జని సేతువు కరిగి రామేశుఁ
బాటించి తా ధనుష్కోటిలో మునిఁగి
వాటంబుగాఁ దనచోటికి వచ్చి
మేటి సేనలతోడ మేదినీవిభుఁడు

*నందగిరిపురి నానందముగ నేలె
నందుండు సంక్రందనాదుల మీఱె

## సోమదేవరాజు వృత్తాంతము

అతనికి విజయపా*లుఁడు జనియించె
నతనికి రాజ్యాంత*రమ్ములు చనఁగఁ
దద్వంశపారంప*రాభివృద్ధిగను
విద్వద్గరిష్ఠుఁడు విఖ్యాతుఁ డనఁగ
సోమదేవరరాజు శోభిత యశుఁడు
రామ పరాక్రమ భీమ సత్కృతుఁడు
నతఁడు కందారంబునకు రాజుగాఁగ
మతిమీఱఁ బాలించె *వైభవమలర
దేవభూదేవ పూ*జలు నిరంతరము
సావకాశతఁజేయు సత్యసంధుండు
ఉభయ గోదావరి నుండు సద్విజుల
కభయంబుగా నిచ్చె నగ్రహారములు
పదిహేనువేల న*న్నూరు గ్రామములు
సదమలంబుగ నిచ్చి సమకూర్చె ఫలము
వ్రతములు దేవోత్సవములును సలుపు
చతిముదంబున రాజ్య మప్పుడేలఁగను
ఆ సోమదేవ [1]రాజావులు నవని
ఘాసంబుకొలుకుఁ బ్రవాసతఁ దిరుగు
మూఁడువేలును నూఱు మొనకొని మంద
లాజాడమేయుచు నట మంత్రకూట
మాది భద్రాచల మటఁ దుదగాఁగ

1. రాజా విభుపులవని.

నావికుక్కా గోదావరీ తీరములను
మందలు వేయించి మందల మీఁద
కొంద ఐధికారులు గానకానియుండఁ

గటకవల్లభువారు ఘనచారు లపుడు
నటఁజని రాజుకు (నంతయుఁ) జెప్ప
సేనాసమేతుఁడై చెలఁగుచు నెట్టి
కోనవెళ్ళఁగఁ దోలు కొంచును వచ్చె
నంత నక్కడనున్న యధికార బలము
నంతంతబలముతో నార్చుచు వచ్చి
కొందఱ నొప్పించి ఘోరభాణముల
చిందరవందర చేసినవారు
పరశు తోమర పట్టి *సాదులతోడ
వరశస్త్రసామగ్రి వైభవయుతుల
దళమెక్కుడయ్యను దళముల నిలుపఁ
గళవళంబునఁ జాల కళవళ పడుచు
హతశేషులందఱు నప్పుడే తెంచి
కతలుగాఁ జెప్పిరి [1]కందారపతికి
చెప్పిన నా రాజు చిడిముడిపడుచు
నొప్పని మనమున నొగి నాగ్రహించి
కరి ఘటల్ హయములు కాల్బలమ్ములును
నరిమురి(మును) నరనాయకుల్ నడువఁ
గటకంబుపై దాడి నటఁ జని విడిసెఁ
తటుకునఁ గోటకు తగు ముట్టడంబు
కటకంబు చుట్టు రా గట్టుగాఁ బెట్టి
సర్వసేనలు దాను సరకుసేయకను

1. కందారమువను.

ఉర్వీశ్వరుఁడు యుద్ధ మొక యాఱు నెలలు
హోరె నుర్వినిఁ గాలుపోలిక అమర
వెఱపోయి సేనలు వెఱచి బల్లహుని
మఱుఁగు చొచ్చిన వాఁడు మసల కేతెంచి
*సోమదేవుని మీఁద సునిశిత బాణ
స్తోమముల్ వఱపిన సొగసి సేనలును
వేమరు యుద్ధంబు విసువక సేయ
కామముల్ చెడి తమ నేమముల్ విడిచి
కూలిరి రౌతులు రాలిరి భటులు
సోలివ్రాలెను జన స్తోమముల్ తోడ
నీ లీల మడిసిన నిట సోమదేవుఁ
డా లీల విఱిగి కందారంబు చేరె.

మగుడంగ సేనల* నేల యీనంగ
దిగుచుకో వచ్చియుఁ దెగి యైదు నెలలు
కసిమసఁగి బలము విసువక తగిలి
పసమాల్చి గెల్చిన బల్లహుఁ డపుడు
విసువక యుద్ధంబు వెఱపడఁ జేయ
*విసిగి సోమదేవ విభుఁడు నేతెంచి
ఘోర యుద్ధంబును ఘోరతఁ జేయఁ
బాజీ బల్లహు సేన పోరంగలేక
సారంబు చెడి శక్తి సారంబు లేక
వైరంబు వెడలి భా*సురములు దఱిఁగి
కూరి తావగలను జేరిరి పురము
భీరంబు వెడలియు బెలుకురి సేన
తూఱి కటకమునఁ దారుపాఱుటయు
నా రీతి నెనిమిది మాఱు లీ రీతి

పోర బల్లహుఁ డప్డు పురము వెల్వడియుఁ
గదనంబునకుఁ జాల కాలు ద్రవ్వుచును
మదిని బల్లహుఁ [1]డంత మదియించి వచ్చి
సదమదంబుగ భట సముదయంబులను
మదమేనుఁగులఁ జావ మర్దించి త్రొక్కఁ
జిదచిదలై భూమిఁ జెదరు శోణితము
పెదపెదలై యెడ లదవద వడఁక
*విజిగి సోమదేవ విభుడు పఱతెంచి
గరిమ దరగ వచ్చి కందారమునకు
సరివారలందఱఁ బరివారములను
బురి విసర్జించెను నరవరుఁ డపుడు
హితుల మంత్రులఁ బురోహితులను నీతి
మతులను సామంత పతులను నాత్మ
హితులను దనకూర్చు పతులను బిలచి
యతులిత గతి వెత నప్పు డిట్లనియె :
"పోరితి బల్లహుఁ బోర లోఁగొనఁగ
నేరీతిగాఁ జేతు నారీతి మిమ్ముఁ
గోరితి నడుగను మానితి జగడ
మీలాగు మాలాగు బాగుగా దింకఁ
జాలు చెప్పఁడు మాకు మేలుగా నొకటి"
అని యడ్గ నప్పుడు నా సోమదేవు
కని రొక్క మాటుగా *నా పురజనులు
వస్తువాహనముల వరబలంబులఁ బ్ర
శస్తుండు ప్రబల దై*వికశక్తులందు
నట్టి యా వీరుని నెట్టనఁ గెలువ
గట్టిగా దేవ వ*రంబు కార్యంబు

1. ఁడు మన్నత తిష్ఠపించా.

పట్టి గెల్వఁగరాదు ప్రాభవంబునను
నట్టి పుత్రుఁడు గల్గునట్టి మార్గములు
పట్టఁగావలె బుధ బ్రాహ్మలవలన
మట్టుగ విని చాల గుట్టుతోడుతను
పట్టవలె వ్రతము పట్టు" మని యన
నెట్టన రాజు దా గట్టిమాటనుచు
నారాజు వేగమే యట ద్విజవరుల
గారాముగాఁ బిల్చి కడు భక్తి మ్రొక్కి
"నాకు పుత్రుఁడు గల్గ నవ్య సత్క్రతువు
చేకురఁ జెప్పరే *శ్రుత్యుక్తముగను"
ఆ మాటలకు బ్రాహ్మ లతి సంతసిల్లి
వేమఱుజేసిరి విన్నపంబులను
పుత్రకామేష్టి యన్ పుణ్యసత్క్రతువు
ఋత్విక్కులను బిల్చి *రూఢిగాఁ జేయ
పుత్రకుఁ డుదయించు భూరిసత్త్వండు
*పాత్రుఁడు జనియింప శాత్రవ జయము
నగు" నని చెప్పిన నంత భూవిభుఁడు
తగువారి హోతలఁ దగఁ బిలిపించి
హోమంబు చేయంగ నుద్యుక్తుఁ డగుచు
సామవేదులఁ బిల్చి సభల రావించి
వారి నెదుర్కొని వారి పాదముల
కౌఁగి సాగిలఁ బడి కొండొక నేపు
లేవక దీనతఁ బ్రోవుఁ డటంచు
సావకాశతఁ బల్క సద్విప్రవరులు
లేనెత్తి యభయంబు లెస్సగా నిచ్చి
[1]సానుమతి హోమసంస్కారాది విధుల

1. వాసామతి.

సోమదేవరరాజు సోమయాజిగను
సోమదేవునిదేవి సోమిదేవిగను
దీక్షితుఁగాఁజేసి దివ్యమంత్రముల
దాక్షిణ్యముగఁ జేయ దగ హవనమున
దక్షిణార్చులతోడఁ దగ నగ్ని వెలుఁగ
సాక్షిసూచకముగ సభికులు సూచి
"సుకుమారుఁ డుదయించు సుమి మీ" కటంచుఁ
బ్రకటితంబుగ నొప్పఁ బలికి రందఱును
నాహవనం బంత నటఁ బూర్ణమైన
నా[1]హవాగ్నులలోన నా హవిర్భాగ
శేషంబు మంత్రవిశేషంబు గాఁగ
సిరియాలదేవికి సేవింపఁజేసి
[2]రార్య పురోహితు లాశీర్వదించి
*రంత సోమదేవుఁ డార్యులందఱకు
సంతసంబున బ్రహ్మ సభలకు నెల్ల
వింతవస్త్రమ్ములు వివిధ భూషణము
లంతంతఁ గానుక లందిచ్చునంతఁ
గైకొని నిజనివా*సములకు నరుగ
మైకొని తమయిండ్ల మరువకయుండ్రి.

*సోమదేవరాజు సుదతికి గర్భ
నేమంబునకు గర్భ [3]సీమంతక్రియలు
నేమఁబు మీఱంగఁ బ్రేమమునఁ జేసి
*కామంబు మీఱ నభిరామమున నుండె.

అక్కడఁ గటక బ*ల్లహుఁ డది యెఱిఁగి
వెక్కసంబుగ నావ మెక్కినరీతిఁ

1. ఆహవాగ్నులలోన; 2. కార్య; 3. సీమాది.

జక్కన రాయబా*రులచేత నెఱిఁగి
పొక్కుచుఁ గినుకచే స్రుక్కుచుఁ జాల
చక్కన లాహిరిఁ జొక్కినరీతి
అక్కటా ! యిది కృత్యమని విప్రవరుల
కెక్కుడి సామర్థ్య మెక్కుడి బలిమి
చక్కఁబెట్టకయున్నఁ జక్కిగాదనుచుఁ
దన బంధువరులను దన బుధవరులఁ
*దన యమాత్యుల దొరలఁ దాఁ దాను రావించి
కార్యమూహించి యవార్యత నతని
భార్యతోఁ గూడంగఁ బట్టి తేవలయు
*లేదేని సోమదేవు లేమను నతని
గాదని చెప్పక కార్యంబుగాదు
గా" యని దండయా*త్రకు గల్గునట్టి
సాయంబుగా జేసుపాయంబు మీఱఁ
గాయంబు మీఁద నపాయంబు దలఁచి
సాయంబుగను దళ*స్తోమంబు గూర్చి
పాతాళ కుహర సంఘాతాలు నదలి
భీతిల్లఁ బ్రస్థానభేరి వేయించి
*కదలె గజ ఘటలతోఁ గటకవల్లభుఁడు
*చెదరక నడచేటి* సంఖ్య యెట్లనిన :

అష్ట సహస్రంబులగు గజంబులును
ఇష్ట హయంబులు నిరునాఱువేలు
స్పష్ట హుంకృతులతోఁ జను పదాతులును
*పుష్ట ద్వాదశ సహస్రములు పొంది నడువఁ
జనిచని కందార సామీప్యమునను
మునుకొని వేలంబు మొగి విడ్చినపుడు

అంత నీ వృత్తాంతమంతయు వినియు
సంతాపచిత్తుఁడై చని సోమదేవ
రాజు దా నెంతయు రభసంబు మీఱ
నాజికి నందఱ నటఁగూర్చి తగిన
వాజుల గజముల వడిఁ గయిసేసి
భటులను బిలువను బడవాళ్లఁ బనిచి
చటులత సమరంబు*నేయు వేడుకల
భటఘటార్భటుల భూభాగంబు వగులఁ
బటిమతో వెడలెను భండనంబునకు
నంత బల్లహు బలము లవని గంపింప
వంతఁ బొందగ శత్రు వరబలంబులను
గొందఱ నిర్జించి కొందఱ నొంచి
చిందరవందరచేసి నొప్పింప
నందంద బలముతో నార్చుచుఁ గవిసి
కందారమునఁ బేరు గల దొరల్ రాజు
ముందఱఁ బోనీక మునుకొని నిలిచి
అందంబులగుఁ బత్తి సాయుధావలుల
క్రమందించి రాజు కానంద మొందింప
నందితుఁడై వంది బృందముల్ పొగడఁ
గందార రాజుకుఁ గలిగెఁ గయ్యంబు
సోమదేవర రాజు సునిశితాస్త్రముల
వామ దక్షిణ పొదుల్ వరుసగాఁ గట్టి
ధను వెక్కువెట్టి యుద్దండ కోపమున
వెనుకొని శస్త్రాస్త్ర వితతిఁ గప్పుటయుఁ
గొందఱు వెఱచిరి కొందఱు పాఱిఁ
గొందఱు గొందుల కుఱికిరి నొఱలి
కూలెడి భటులును రాలెడి తలలు

ఘాలుమేలై పోవు గజ సముదయము
పాలుమాలియు భీతిఁ బాఱు రాహుతులు
నీ లీల నాక్రియాలోలుఁడై సోమ
దేవరా జప్పుడు దివ్యార్ధచంద్ర
దేవాశుగములచే ధృతిఁదూల్చి బలముఁ
గాలూన నీకున్నఁ గటకుండు కినిసి
మేలుమేలని చాల మెచ్చి తా నెదిరి
గజఘటతోడుతఁ గడుఁ జుట్టుముట్టి
గజిబిజిగాఁ ద్రొక్కి కలచె నేనుఁగుల
చే నొచ్చి రాజు దాఁ జిడిముడిఁ బడచు
మానుగాఁ జెయ్యాచి మానియున్నెడను
మాసద్వయంబును మానక యుద్ధ
మాసతోఁ జేసిన నా గజయుద్ధ
మందు నంకుశహతి నవనిపై రాజ
చందురుఁ డస్తాద్రిఁ* జేరిన లీల
వ్రాలిన యపుడు దుర్వార పరాక్ర
మా లీల సామంతులటఁ బోక నిలిచి
యందు భూపతిలేని పందకయ్యంబు
చందమని యనక సాధింతమనుచు
ననుచుఁ బంతములు దరాడుచు వాని
వెనుకొని యుద్ధంబు వెసఁ జేసి రొక్క
*మాసంబు తమ బ్రతుకుకోసంబు గ్రాస
వేసముల్ లేకనె వీర సద్భటులు
ఐదువేలకు మీఁద నట గజంబులను
కైదువుల్ గైకొన్న ఘనపదాతులను
మూఁడు వేలనుజంపి మొననిల్పి రాజు
పాడి విచారించి పరికించి భూమి

పాలుదేవికి గర్భపదమున సుతుఁడు
నే లీలఁ గలుగును నిది సిద్ధమనుచు
నుండగ నంతలో నొగి రాజుదేవి
యుండదని తలఁపుచుండు నాలోన
నంతః పురంబున కా రాజువార్త
రంతుగాఁ జెప్పిన రాజుదేవులును
సంతాపమును బొంది చాల దుఃఖించి
కాంతాశిరోమణి కన్నీరు నించి
"హారాజవర్య! మహారాజతేజ!
హారాజపూజిత! యసమాన ధీర!"
యని విలపించుచు నా ప్రొద్దె విప్ర
జనముల నూట యిర్వది సంఖ్య లమర
వారికి వస్తువాహనములు గట్టి
వారల తోడుత వైభవం బెడల
గర్భంబులో నున్న నర్భకుఁ గావ
దుర్భరంబని చాల దుఃఖించి పురము
నార్భటంబులు మాని యన్నకొండకును
గర్భభారంబునఁ గదలి పోవుటయు

## మాధవశర్మ సిరియాలదేవిని రక్షించుట

*నప్పురం బేలెడు నాయెఱుకు దేవుఁ
డప్పుడు నిక్కడ నొప్పఁగాదనుచుఁ
జెప్పిపంపిన నప్డు సిరియాలదేవి
"అప్పరో! శరణార్థి నగురాజపత్ని
నగు నన్ను పేక్షింప నాయమె" యనుచు
తగు జనంబులతోడఁ దగ రహస్యముగ

బ్రాహ్మణోత్తము వేదపాఠకు శ్రుతుల
బ్రహ్మఁ గిద్వఁబచేటి పావను సుజను
మాధవ శర్మను మహిత యశుండు
బోధాగ్రగణ్యుండు బుధుల కెల్లరకు
నతని పాలికి నేఁగి యతని పాదముల
కతి భక్తిదండ ప్ర*ణామంబు చేసి
“యార్తను కందార కర్తకు సతిని
కీర్తి రక్షించుట మూర్తి మీ” కనిన
నార్యులు లోకోపకార్యులు నార్య
వర్యులు పదవాక్య శౌర్యులు మీరు
ధైర్యులు సత్కృపావర్యులు విహిత
కర్మలు షట్కర్మ వర్మలు నిత్య
ధర్మలు దాక్షిణ్య దమశమ మహిత
శర్మలు మాధవ శర్మలు నపుడు
వీక్షించి గర్భిణి నీక్షించి ‘దేవి!
నీ క్షేమమంతయు నెఱిఁగితి’ ననుచుఁ
బడియు సాఁగిలఁబడ్డ పణఁతి లేనెత్తి
కడు దయారసదృష్టి గడలుకొనంగ
మృతుఁడు సిద్ధేశుఁడు ముదిత నీకిచ్చుఁ
గడువడి శుభములు నుడుగ కెప్పుడును
నుడుగుము దుఃఖంబు విడువుము నిడుమ
*కడు రహస్యము నుండు జడనుపడ కనిన
సభవారలందఱు సనుదెంచి సతికి
నభయమిచ్చిరి మాధవాగ్రణితోడ
నొక్కకుత్తుక గాఁగ* మీరును మేము
చక్కనుండిన మాట లెక్కలే మనకు

[1]వారిజాక్షుల యెడ వైవాహమందుఁ
గోరి భీతుల ప్రాణిఁ గొనువేళ విత్త
భంగమప్పుడు గోవుఁ బట్టిన యపుడు
నంగీకృతముగాదె భంగవచనము
బొంకు దోషంబులు పొందంగలేవు
శంకలేకను భయా*తురఁ జేతఁబట్టు
మనుచు శంకరభట్టు నా భైరవేంద్రు
ఘనసింహ పరవాది కామదేవుండు
విదితాష్టభాషాకవిత్వ ప్రవీణ
సదయుండు గోపాల సామవేదులును
వీరాదిగాఁగల విప్రపుంగవులు
వీరలు చెప్పంగ విని సిరియాల
దేవి నుంచెను తన దేవి సంగతిని
సేవగింపక సభలెల్లను బొగడ
అంతఁ గందారంబునందు సా(మం)తు
లెంతయు దుఃఖించి లేటమొగముల
సాటిగాఁ బోరంగ వాటంబులేక
మేటి దొరల్ రాణఁ గూటువలగుచు
దుఃఖించి తమరాజు లెక్కించి (?) దేవ
చక్క నెక్కడఁ బోయి చనియెద మనుచు
హాహాకారములతో నట పురి వెడలి
[2]సాహసంబుల రాజసదనంబు విడిచి
కోటలు విడిచి కవాటముల్ దెఱచి
నేటైన భూముల పాటవం బెడలి
నాఁటిరాతిరి పాటిఁ* రటవులు దూఱి
సాటి సూటులు లేక బోటులతోడ.

1. పోతన భాగవతపద్యము దీనికి మూలము కావచ్చును; 2. సాంహయబుల.

అంతట బల్లహుఁ డతిసంతసమునఁ
బంతంబు మీఱ నా పట్టణవాసు
లంతయుఁ బోవుట నట దయమాలి
కందారమునఁ జొచ్చి కాల్చి యిల్లిల్లు
సందుసందు వెదకి సకలంబు చూచి
కోటలు ద్రవ్వి కవాటముల్ విఱిచి
మేటి యంతఃపురిచోటులు వెదకి
మేడల విహరించు పోడుముల్ చూచి
యాడలేకున్నంత నవి యెల్ల వెదకి
గూడెగాండ్లందఱుఁ గూడి యా దేవి
జాడలు పో బండ్లజాడలు నడుగ
జాడ లనుమకొండ జాడలాదేవి
జాడ లెల్లెడలను గూడంగవేసి
చెప్పిరి బల్లహు కొప్పుగా నపుడు
గప్పుచుప్పును లేద చెప్పనిజాడ
దేవరా నీ వరాల్మేర యిచ్చినను
పోవరా(ని)ది దూర పోకళ్ళు మాకు
నని చెప్పినంతలో నా బల్లహుండు
చని యన్మకొండపై సకల సేనలును
దానును తన మంత్రి*సహితంబుగాఁగ
*వెనుకొని వేలంబు విడిచి తత్పురము
ముట్టడంబుగఁ జేయ మునుపె యా రాజు
గట్టిగాఁ గోటకుఁ గాఁపు పెట్టించి
యెఱుక దేవరరాజు సరకు సేయకను
నురు గజాశ్వములను నుత్తమ భటుల
సవరణ సేయించి సకల సేనలతో
*నావలీవలఁ గోట కలగంబు దిరుగఁ

దగువారినుంచియుఁ దానును బంధు
లగువారిఁ గూర్చుక తగు విచారములు
సిరియాలదేవికై చేసిన కృత్య
"మఱిముఱి బల్లహుఁ డక్కడనుండి
యిక్కడి కేతెంచు టిదియెల్ల మీరు
చక్కంగ వింటిరె ? నిక్కంబుగాఁగ
బలవద్విరోధంబు భావ్యంబు మాకు
నలవడ" దన్నను "నార్తురా లియఁ
బ్రత్యక్ష నరకంబు ప్రాపించు మనకు
సత్యం బసత్యమై చనదెందు భువిన
గత్యంబు పనియిది కారణంబేమొ
సత్యంబు జయమని చాటు తచ్ఛ్రుతులు"
అనుచుండ నంతలో నచటి మంత్రులును
పని విని బల్లహు పనుపున వచ్చి
యనిరపుడంతయు నారాజు నాజ్ఞఁ
గని దేవరాజుతో గర్వోక్తి నిట్లు :
"కందారదేవి మీకడ నున్నదనుచు
బంధు పుత్రామాత్య పరివృతుండగుచు
కటక బల్లహుఁడు మీ కటకంబుమీఁదఁ
జటులత వచ్చెను* సిరియాలదేవి
నొప్పించు వేగంబ యొప్పించవేని
కప్పివుచ్చిన నీక ఘనప్రమాదంబు
వచ్చుఁ గందారంబు వార్త లెఱుఁగుదె
*సచ్చరిత్రులకును సమరసము వలయు
నని రాజు పంపిన నరుగుదెంచితిమి
యన రాయబారుల కనియె నారాజు
*"విను మీకు మాటలకు వెఱపముగాని

సిరియాలదేవి మా శ్రీయన్మకొంత
వెరవుగా నుండుట వెదకుఁడు మీరు
ఆయుధపాణులై యలరంగ మిమ్ముఁ
బోయి చూడఁగనీము పురములోపలికి
మీకుఁ గావలసిన సారె సారెకును
రాకపోకలుచేసి మూఁకలు పోక
ఆయుధంబులు వీడి వేయివిధములఁ
బోయిచూచుండు మా పురములోపలను
నుండెనా మీకును నొండన మేము
రండు తోకొంచు నా రాజదేవులను"
అని చెప్ప నీ వార్తలన్నియుఁ గొనుచుఁ
గనుఁగొని రాజుతోఁ గతలుగాఁ జెప్ప
విని వెఱఁగుపడి తా విస్మితుం డగుచు
అనె రాజు తాను దానట్ల గ్రహించి
"వర్ణాశ్రమంబులవారి యిండ్లకును
వర్ణాశ్రమంబుల వనితలఁ బురుష
వరులను బ్రాహ్మణ వరుల యిండ్లకును
బ్రాహ్మణ స్త్రీలను బ్రాహ్మణ వరుల
రప్పించి నేరుపు లొప్పఁగాఁ జెప్పి
కప్పివుచ్చక రండు ఘనముగా మీర
ల"ని పంప నప్పుడు నందఱుఁబోయి
చని చూచి రెలమితో సప్తదినములు
అంగళ్ల వీధుల సంగడియిండ్ల
సంగతిగాఁ జూచి పొంగుచు నపుడు
*ముడుపుటిండులలోన మల్లెసాలలను
వాడవాడల వేశ్యవాడలఁ బురము
వీథుల నాడాడ వేమఱు వెదకి

సాధుబాధలు సేయ సమకట్టిరపుడు
వచ్చిన చోటికి వచ్చుచు మఱలి
వచ్చుచుఁ బోవుచు వదుసతో నిట్లు
తిరిగి యింటింటికి తిరిగియుఁ దిరిగి
అరిగి రా యింటికే తిరిగి తిర్గియును
అరిగి రాజుకుఁ జెప్పిరా (గా)థ లెల్ల
రాజు దా ననియెను రాజసంబుగను
"భోజులై యీ రాజు పురిలోన వెదకి
సిరియాలదేవిని దెచ్చిన వారి
కోరికలిత్తును గుప్తంబుగాఁగ
హయలుఁ దేరులు మణుల్ హారముల్ గజము
వరవస్తు చయములు వాని కే నిత్తు"
నని చాట నందఱు నతివేగిరమునఁ
*జని బ్రహ్మ క్షత్రియ జాతులాదిగను
పౌరపొచ్చెములు లేక బొంకక చూడ
నరలేక యందులో నతిధూర్తుఁ డొకఁడు
మాధవ శర్మని మహనీయ గృహము
శోధించి శోధించి [1]సుందరియైన
రాజపత్నినిఁ జూచి రభసంబు మీఱ
నోజతో నాయమ తేజంబుచూచి
కలికి క్రొల్గన్నులు గౌరతఁబిరుదు
లలినీల కుంతలంబుల తళుకు మోము
చక్రవాకంబులఁ *జెనఁకెడు కుచము
లరఁటి కంబములతో నదురు పెందొడలు
హంసయానంబులు నట దొడ్డకొప్పు
నంసద్వయంబుల నటనట జాఱు

1. సుందరంబైన.

హొనరు పల్కులలీల *నల సుకుమార
మనుమాన మెనయదు (నవి) రాజపత్ని
యిది రాజపత్ని దా *నిశ్చయ మనుచు
నిదె సిరియాలదే విది సిద్ధమనుచు
మాధవశర్మతో మాటిమాటికిని
బోధగాఁ జెప్పినఁ బోనీక యతఁడు
"మా కూర్మి పుత్రిది మాయింట నుంచి
మా కూర్చునల్లుఁడు మా కప్పగించి
వారణాసికిఁ బోయివచ్చెదననుచు
గారవంబున దీని గర్భిణి మీరు
కాపాడుఁడని పోయెఁ గథలేల" యనిన
వాఁడు వీడక తనవారలఁ గూడి
జాడగాఁ జెప్పిన సాధ్యమౌననుచు
నందఱు నచటికి నరుదెంచియపుడు
"నందచందము చూడనగు రాజపత్ని
గా నుండ కీ సతి గల్గునె ? మరుని
సానపట్టిన శస్త్ర సూనశరంబుఁ
బోలియున్నది దీని పొలుపెల్లఁ జూడ"
*నని యెఱుకు రాజుల యనుతిమీఁదఁ
గొనిపోవఁగా నప్డు కూడి యా విప్ర
నభ యంతఁ జనుదెంచి యభయంబు దలఁచి
యిభ రాజగమనను నింటికిఁ బనిచి
అభయులై బలికిరి యందఱుఁగూడి
"బ్రాహ్మణస్త్రీలను బట్టినయట్టి
*అంహాకర్ముల బట్టి యలనాటి యముని
జిహ్మగ శరములచే నంటఁగట్టి
*సంహారముగ సప్తసంఖ్య రౌరవము

లందున నంతురు ననునాగమోక్తి
విందుము మీరును వినరొ మా పుత్రి
సుందరిఁ గొనిపోను జాతురె మీరు
*అందచందము లెంద రెందఱికి లేవు ?
అందఱి రాజుల సుందరులనుచుఁ
గందువలెఱుఁగని పందలమాట
*చందమెఱుఁగరు జడుల చందమువారు
అందుదుర్ దుర్గతుల్ చెందుదు రవని"
అని యిట్లు పలికిన నా విప్రవరుల
కును నిట్టులని పల్కి *దుర్వేశునెదుర
"గట్టిగా నిది రాజ*పత్నియౌ వారు
*నిట్టి తమ పట్టియని నెట్టియాడెదరు
నెట్టి పాటులు చూడఁ డెత్తినఁగాని
యొట్టుకైనను వీరి పట్టిగా"దనిన
అంత నా విప్రులు సంతత రోష
కాంతులై శౌర్య స్వ*తంత్రులై యనిరి
"ఈమాట మీకును హితవైనదేమొ
*మామాట వినుఁ డొకటె మా దీక్ష మీరు
మోమోట మేల (యీ) మాట మేమొకటి
*నూటఁజేసెదము మాపాటిక వినుఁడి
చావు నిక్కంబును సర్వజనులకు
లావు గల్గిన వీరలక్ష్మలకైన
కులములో బ్రాహ్మణకుల మగ్రకులము
గలవార మపకీర్తి గల మేరలేల
*అందఱము దీనికై చెందుదుము ముక్తి
సందియంబిఁక లేదు డెందంబులందు
నం"దనుచు నావిప్ర సందోహ మెలమిఁ



సిద్ధేశ్వరదేవాలయము - సరస్సు

గ్రందుకో నందఱు ఘనవీరజడల
*నల్లుకొని "మీ కీర్తి ముల్లోకమెల్లఁ
జెల్లింతు"మని దాము చితులు పేర్చుకొని
చితులపై నప్పుడు వెత మది లేక
గతి తమ కగునని సతులతోఁ గూడ
పతులు పుత్రులు బంధు తతులలోఁగూడ
సతికినై ప్రాణాల రతి మాని యనిరి
"సత్యంబు చేతు మీసాధ్వి మా పడుచు
హత్య కట్టుకవచ్చె నా బల్లహుండు
వాని వంశంబును వాని పుత్రులును
వాని సామ్రాజ్యంబు వడిఁ గూలిపోవు"
నని శపియింపఁ బూనిన [1]నా (క్షణం)బ
విని బల్లహుని మంత్రి విసరంబులెల్ల
గడగడ వడఁకుచు నడుగిడలేక
తడఁబడు మాటలఁ జిడిముడి వారి
కడిమికి శౌర్యంబు ఘనమైన తెగువ
వడువున కాత్మలో బెడదరు కొనుచు(?)
ఏలయా మీకింత యీ సాహసంబు
లేలయా మీకెట్టు లిష్టంబుకొలఁదు
లేలాగు లాలాగు మాలాగు లనుచు
నలుకుచు మాధవు నడుగుల కెఱఁగి
"మాధవ శర్మని మహిమెర్గువార
లీ ధాత్రిని గలరె యెన్ని చూచినను
రాజకాంతని మేము రవ్వఁబెట్టితిమి
భ్రాజష్ణులగు మీదు [2]పలుకు నమ్మకను
తేజంబుఁ జూచి మహాజనుల మిము

1. యా,......బ్బ; 2. విపలుకులవశ లేమి.

¹నంతియకాని మీ పంతంబు చెల్లె
వంతలేటికి సంత*సంబున నుండుఁ"
డని వారు తమకొక్క హరుషంబు కలదు
చని దైవసామీప్య సమ్ముఖంబునను
తగవుగల దొకటి మిగులంగ మీకుఁ
దగ మాకు సిద్ధేశు తన శివయెదుర
న్ననిన విప్రులు తగవది యెట్టిదనిన
ననిరి బల్లహుమంత్రు లందఱుఁ గూడి
"సిద్ధేశునగరిలోఁ జెలగుచు మీరు
వృద్ధసమ్మతిని నీ వెలఁది వడ్డింప
బుద్ధులన్నియు మాని భుజియింతురేని
*సిద్ధంబు మీ పడుచుశ్రద్ధ లింకేల ?
కాదేని పూనిక గాదేని మీకు
వాదేల నారాజు గాదిలిపత్ని
గర్భంబులో నున్న యర్భకునకును
నిర్భయమ్మునుజేసి నేమింతు మతనిఁ
గందార పట్టంబు గట్టి యా శిశువుఁ
బొందు పెట్టుదుము మీమందికందఱికి
అగ్రహారంబులు నధిక వస్తువులు
శీఘ్రంబ యిత్తుము చెలగి వెయ్యేళ్ల"
ఆ మాటలకు విప్రు "లేనాటనైన
మీమాట లవి మాకుఁ* జెవినాట వనిన
గ్రామముల్ మాకేల కనకంబు లేల
కామంబు లేదు నిష్కాముల మేము
మీరు చెప్పినయట్లు మేము సిద్ధేశు
*వరవుల మక్కడ మఱుఁగు లేదెందు

1. అంతేను కాని.

*మా పడుచు వడ్డింప మేము భుజింతు
(మాపు) పోవఁగ జూడుఁ డందుల నిజము
శివు డెఱుంగని బొంది చెన్నొందఁ లేదు
నవు"నని గుండంబునందు స్నానములు
సవురుగాఁ జేసియు సకల బ్రాహ్మణులు
అభిషేచనాదుల నర్చించి శివుని
నభిషిక్తుఁగాఁ జేసి యట సోమదేవ
రాజులు దా సోమయాజిగాఁ గ్రతువు
రాజదేవులుఁ దాము రమ్యత దీక్ష
సేయునప్పుడు సోమి*దేవమ్మ యయిన
వేయు విధంబుల [1]వేదమార్గములు
*సేయు సిరియాలమ్మచేతఁ బెట్టంగ
నాయతంబుగ భోజనము సేయరాదె?
కాని శ్రీ సిద్ధేశు ఘనప్రసాదంబు
అనయంబు వేదోక్తమగును బ్రాహ్మలకు
*"వేదాధ్యయన రతో విప్ర"యంచనెడి
సాధు వాక్యంబుల సరగున సోమ
దేవరాజును దేవ *వేదపాఠకుఁడు
వనుచు నా బ్రాహ్మణు లందఱుఁ [2]గుడువఁ
గనుగొని బల్లహుంకటకంబు దొరలు
చూడంగ నక్కడ శుభమహోత్సవము
*లాడఁ బుష్పవృష్టు లందంద గుఱియ
*వేడి బల్లహు బలము లాడ నిల్వకయుఁ
బాడిగా రాజుకు వాఁడిమి ద్విజుల
గోడాడినట్టి తమ వాడిమిఁ జెప్ప
పోడిమి చెడి రాజు భూదేవవరుల

1. వేదమార్గహుల; 2. గుఱిచి.

తెంపును వారల పెంపును దగవు
సొంపును తమ కార్యవంపును మెచ్చి
సత్కారములుచేసి సద్ధరామరుల
భూత్కారములకును సత్కారుఁ డగుచు
*భోరునఁ దన మిత్ర బుధజనులతోడఁ
*గరమైన తన యేలు కటకంబు చేరి
కందారదేవినిఁ గనుగొని వెదక
సైంధవంబులుగల సాహసోత్తముల
వెదకంగఁబంపియు విభుఁడు భూములకు
మదిలోన నెదగుద మానకయుండె

## సిరియాలదేవి కుమారుని గాంచుట

అంత నిక్కడ సిరియాలమ్మదేవి
కాంతాశిరోమణి గర్భంబునందు
నవమాసములు నిండ నం దొక్కనాడు
సావకాశత గ్రహసంపత్తులుండ
మెండైన యా యన్మకొండలోపలను
చండపరాక్రము సతి సుతుని గాంచె
సభవారలందఱుఁ జనుదెంచి చూచి
శుభముహూర్తంబని సుకుమారునకును
సర్వసర్వంసహాచక్రమంతయును
నిర్వక్రముగ నేలు నీ రాజ సుతుఁడు
నని జాతకంబుల నట నిర్ణయించు
కొనుచుఁ, దారందఱుఁ గొందఱు పోయి
మాధవశర్మకు బోధగాఁ జెప్ప
నాతఁ డాశీర్వాద మప్పుడ చేసి

ఖాతిగా నప్పుడు బ్రాహ్మణోత్తముల
నుత్సవంబులఁ బంచి తత్సభాజనుల
కుత్సవంబులును బుత్రోత్సవం బిచ్చి
"గర్భాష్టకం బాదిగా రాజసుతుఁడు
అర్భకుండై యుండి యవని పాలించు
*నేకచ్ఛత్రంబుగా నీసుతుఁ డనుచు
జోకతో జాతక శ్రోతలు ననఁగ
విప్రదంపతులును విధ్యుక్తముగను
నప్రమత్తత నామ మడిగిరి జనని
*నామకరణంబునకు నామమే మనిన
వామలోచన నగి వారికిట్లనియె
"తల్లియుఁ దండ్రియు దైవంబు గురుఁడు
నెల్లెడ మాధవుఁ డితనిదె నామ"
మని చెప్ప వారలు నందఱు నపుడు
విని చాల హర్షించి విద్వజ్జనాళి
మాధవశర్మని మాఱట పేరు
మాధవవర్మను మహనీయనామ
మాదట వెలయించి రామహీసురులు
మాధవశర్మని మహనీయదేవి
బోధఁ దా నెంతయుఁ బోషింపుచుండె
నంత నా బాలుండు నంతకంతకును
కంతు జయంత సంకాశతఁ దనరి
పంచవర్షంబులు పరఁగ నాబాలుఁ
డించు విల్తుని మఱపించు నత్తరిని
విహితాక్షరాభ్యాస విధ్యుక్త విధులు
సహితుఁడై మాధవు సన్నిధి నతుల
మతులచేఁ దత్పూర్వ కతలచే నీతి

గతులచే సంప్రీతి రతులచే భూమి
[1]పతులు చేసిన కార్యగతులెన్ని తనకు
మతియును గతియును మాధవుఁడనుచు
శక్తిచే నా రాజయుక్తిచే గురువు
భక్తిచే సంతత ప్రావీణ్యుఁడగుచు
సకల శాస్త్రంబులు చదువుచుఁ బ్రేమఁ
బద్మాక్షి గుడిలోన బాలురుఁ దాను
సద్మంబులందుండి చదువులో వచ్చి
పలకఁ బుస్తకమును బట్టి యా దేవి
వలపటనుంచియు వచ్చి బాలురతో
నాటతమిచేత నాపూఁటఁ బుస్తకము
మేటి పల్క మఱచి సాటివారలతో
*నాటలాడుచుఁ దనచోటి కేతేర
నోటమిలేక నా పూట మాధవుఁడు
*చదువుమన్నను బల్క మదిఁదలఁచి యతఁడు

## మాధవవర్మకు పద్మాక్షీదేవి ప్రత్యక్షమగుట

యదవదవడఁకుచు మదినెదలేక
చెదరక బెదరక గొదగొని దేవి
మదికి సమ్మోదంబు గదుర నేతేర
నా వేళ కాళి భయంకరాకార
దేవ భూతవ్రాత దేదీప్యమాన
*భేతాళ శాకినీ ప్రేత పరివార
వ్రాత రాక్షస యక్షవర పరివృతయు
నగుచున్న పద్మాక్షి నల్లంతఁ గాంచి

1. పసులు.

తెగువ మీఱంగ నగుమొగము కన్గొనగ
వెఱపొకింతయు లేక వెఱవక యచట
నరమర లేక గుండెదరక భయముఁ
బొరయక నరయక భూతకోటులను
సరగునఁ బాయంగ ఝాడించి పలక
పుస్తకంబును గొంచుఁ బోఁబోవు తరిని
హస్తంబు పట్టిన నట తల మనుచుఁ
బోఁబోవ నంతట భూరి భయంక
*రబహు రూపులయి యత్తన్వియున్న
వెఱవక మనమున *నదరక మ్రొక్క
వాని సాహసమును వాని ధైర్యంబు
వాని శౌర్యంబును వలనుగా మెచ్చి
"మెచ్చితి నీ కిదె యిచ్చెదఁ గొనుము
యిచ్చవచ్చిన ఫలము లేమి గావలయు
వత్స ! నీ మదిలోని [1]వాంఛిత మేమి ?
సచ్చరిత్రుఁడవౌదు సరగునఁ జెపుమ"
అని యద్దు దేవికి నాతఁ డిట్లనియె—
"వినుము శ్రీ పద్మాక్షి వీరహంకాళి
మా తండ్రి పశువుల [2]మల్లు బల్లహాని
చేత నోటువడిన నేమమంతయును
తమ తల్లిచే విన్న తన కథ తెలియు
*కామంబునకు ఫలము గావలె ననియు
వాని జయింపగ వరబలశక్తిఁ
గాని యొండొల్ల నో కమలాక్షి !" యనిన
నట్టె కానిమ్మని యపుడు కృపపుట్టి
నెట్టనఁ దనవద్ది నెఱి బిరుదైన

1. వాత్సల్యమేమి ?; 2. మలిలు.

ఖడ్గఖేటకములఁ గరమొప్ప నిచ్చి
అడ్గఁదలఁచిన కోర్కు లన్నియు నిచ్చి
"యిది చేతనున్న నీ కెల్ల జయములు
గదిసి సాధింపుము కటక బల్లహుని
*ఈ సాధనాలు నీ కెంత పనికైన
నీ సాహసమునకు నెఱి శత్రువితతి
గాసిల్లి నీపదాక్రాంతులై యుందు
రసిబోనియట్టి యీయసి చేతఁబట్టి
*వెలయ సహస్రద్వయ మేలుమాసములు
పొసఁగ రాజ్యముచేయు పో" మ్మని మఱియుఁ
దన యోగబలములఁ దగబిలంబులను
తన సమీపంబునఁ దనచేతఁ జూపి
"ఇటఁ బశ్చిమమ్ముగా నిటునటు ననక
తటుకునఁబోవఁగఁ దగు రహస్యముగఁ
బోవఁగా నక్కడ భూపకుమార
సావధానత వచ్చుఁ జతురంగబలము
*కూడు [1]దళవాయులు కూడుదుర్ నిన్ను
బోడిగా నటఁ బ్రొద్దు పొడిచిన మీఁద
వేదవత్తురు సేన లాడకాడకును
వాఁడి మిగులు దొరల్ పోడిమి మీఱ"
నని చెప్పి మఱియును నతని కిట్లనియె
"పీ ఖడ్గఖేటకాల్ నీకును నెలమి
రేఖగా వేయేండ్లు రోఖున నుండు"
నని చెప్పి యొక బుద్ధి నప్పు డిట్లనియె
"విను బ్రాహ్మలను వేదవేదులైనట్టి
జనులను గోవుల సాధుల మన్ను

1. దళవాయువులు.

మఱవకుండుము మామ*హేశ్వరప్రీతి
అ(రయుచుఁ) బ్రోవుమి యార్తుల నెపుడు"
నని వీడుకొలిపిన నాబాలుఁ డంత
చనుచు నమస్కృతి చయ్యనఁ జేసి
బిలము దూరటుబోవఁ బెక్కు విఘ్నములు
*కోలాహలంబుగాఁ గ్రూర సర్పాది
భూత పిశాచ రా*క్షసు లుగ్ర యక్ష
జాతు లెదిర్చిన సంచలింపకయు
బిలము వెల్వడి సాఁగి*పోవ నక్కడను
బలముల సంఖ్యలు ప్రబ్బికొనంగ
భేరుల మ్రోతలఁ బృథ్వి గంపింపఁ
బరులు హరులు భటార్భటులును గంధ
కరులు ధారలు భోరు కలుగు వాద్యములు
సురుశంఖ ఘోషంబు లుదుటయినట్టి
కరిఘంటికానాద గర్జిత ధ్వనుల
నరిమురి దిగ్భిత్తు లల్లల నాడఁ
బ్రళయకాలమునాఁటి బహుమేఘ వితతి
కల శాత గర్జితంబుల దిక్కులులియు
విధమున ధ్వనులతో వినువీథి ముట్టి
బిలమార్గముల వెడలి పెక్కు సేనలును
గలియవచ్చినఁ జూచి కడు రాజసుతుఁడు
వెనుకొవి వేలంబు వెసలెక్కఁబెట్టె
పనిగొన నప్పుడు భద్రగజములును
నఱువదివేలును నగు నశ్వసంఖ్య
సురుజవాశ్వంబులు నొగి నాల్గులక్ష
లలవడ బలములు నట పదాతులును
బలవంతులగువారు పదునేడులక్ష

లరు దొంద మాణిక్యహార భూషణము
లొకపైన స్వర్ణంబు లొక యేడుకోట్లు
తో వచ్చి గణికలతోఁ దోపులాడ
నావలీవల బెత్తులాడ వజీర్లు
సరదార్లు వచ్చిరి బలుదార్లతోడ
హా రాజ నిల్వు పరాకంచు మంత్రు
లాహా జొహారంచు నంతంతఁ గలిసె
సాహాయ్యముగఁ జేరి సన్నుతించినను
వారల మన్నించి వైభవంబెసఁగ
వారలు చేయు సత్కారాలు గొంచు
నబ్బలంబులఁ గూడి యన్మకొండకును
ఱొబ్బున నానంద సుఖలీలఁ దగుచు

## మాధవవర్మ అన్మకొండకు వచ్చుట

వారినచ్చట నిల్పి తారొక్కరుండు
కెరిపణ (?) వీథి(ని) ఖేటక ఖడ్గ
పాణియై మాధవు పాదపద్మముల
మాణిక్య కాంతుల మకుటంబు లొఱయ
మ్రొక్కి యా(య)నకు సమ్మోదంబుగాను
బొక్కుచు నున్నట్టి భూసురవరుల
వృద్ధదంపతులకు వెలఁది తల్లికిని
శ్రద్ధతో మ్రొక్కనఁ*జేరి వారలును
బెన్నిధిఁ గన్నట్టి పేదలరీతిఁ
గ్రన్నన రాసుతుఁ గౌగిటఁ జేర్చి
చెక్కిలి నొక్కియుఁ* జిబుకంబు పుణికి
మిక్కిలి ప్రేమతో మేనెల్ల నిమిరి

చక్కని శిరమున ముక్కులు మోపి
మక్కువమీఱ నా*ఘ్రాణించి సుతుని
*నొక్క నిముసముఁ బాయ వక్కన నీవు
చక్కనయ్యవు నీవ దెక్కడ మొఱఁగి
యీ రాతి రీరీతి నేరీతిఁ బోతి
వారీతిఁ జెప్పుమా నీ రీతు లెల్ల"
నని యడ్గు తల్లికి నా దంపతులకు
తాను బోయినపని తా నాదిగాఁగఁ
బద్మాక్షి వరలబ్ధ ప్రాభవమహిమ
సద్మంబునకుఁ దాను జనుదెంచు తుదగఁ
జెప్పిన నబ్బాలుఁజేరి మువ్వురును
నొప్పగాఁ ద్రైమూర్తు లొగి భానుబింబ
మప్పుడు గప్పిన నొప్పిదంబయ్యె
కప్పుక శోక మోహము లుప్పతిల్ల
విప్పుగా నాశ్చర్య విహ్వాలులగుచు
నున్నంత మాధవుఁ డొగిని సామ్రాజ్య
మున్నంతయును మీరు చెన్నొందుఁ దేను
సన్నుతి మీ కనుసన్న మెల్గెగెదను"
అన్న నామాట(ల) కామాధవుండు
ఓ యయ్య వృద్ధుల మోరంతప్రొద్దు
మా యయ్య! కన్నులు మాఁగుడు కలిసె
శ్రుతి ఘటంబులకును శ్రుతిశక్తి లేదు
మతిదప్పి దానికి మఱపుద్భవిల్లెఁ
గాలు చెయ్యాడుట గతులకుఁ దఱిఁగెఁ
బాలుమాలుచుఁ గంఠనాళంబునందు
శ్లేష్మంబు లడ్డుగ జేకుఱు మిగుల
ఊష్మంబులెల్లను *దోషంబులయ్యె

క్షుత్పిపాసలు మాకు సూక్ష్మంబులయ్యె
వ్యుత్పత్తి చాలదు *వేదపాఠముకు
మాకు రాజ్యంబేల ? మాకు భోగముల
తాఁకుసోఁకేలయా ? తగు నీకు రాజ్య
భోగంబు మాకదే భోగంబు నీవు
వేగంబె చేకొను త్యాగంబులొదవ
ఆగమంబులు చెప్ప నతిపోషకుండె
వేగంబ తంత్రని విధి చెప్పుచుండుఁ
బోషించితిమి నిన్ను బుద్ధెరుగదనుక
పోషించు మిక మమ్ము భువనైకవీర"
యని తన్నుఁ బలికిన నా విప్రవృద్ధ
జనముల నటఁజూచి మనమునఁగొంత
జాలిమాలై పాలుమాలిన వగలఁ
గూలి(యు)ఁదానొక కొంత సేపునకు
లోలోనఁ దలఁచుచుఁ గాలూన (లే)క
యాలోన మగిడి తా నా మహాదేవి
లీలఁ జూచిన కరా*ళాభీలమైన
లోలతఁ జాల దయాళురాలైన
నగరికిఁ జనుదెంచి తగ మ్రోల నిలచి
నగజకుఁ జెయ్యెత్తి నమ్రుఁడై పలికె
"ఓ పరమేశ్వరి ! ఓ పుణ్యసాధ్వి !
ఓ పరమానంద ! ఓ తల్లి ! వినుము
మాధవశర్మకు మహిత సామ్రాజ్య
బోధ ప్రసాదింపు పూజ్యునిఁ జేయు
మదిగాని వాంఛ నాకదిగాని కాదు
మదిమెచ్చి నీవిష్టు మాకిచ్చునట్టి
పదవు లొండొల్లము పద్మాక్షి" యనుచు

సదమల హృదయుఁడై సాష్టాంగ మెఱఁగి
నీ ఖడ్గఖేటకం*బులు నీవు గొనుమ
*మోఘ వాక్యము మీది *యది తప్పదనుచు
సాగిలఁబడి లోన సరగు(న) వంత
సాఁగి కోర్కులు మది మూగ నాదేవి
వాని యౌదార్యంబు వైరాగ్యమునకు
వాని సాహసముకు వడి సంతసిల్లి
"మెచ్చితి నోబాల ! యిచ్చితి నీకు
నొచ్చంబు లేదిఁక నొకమాట వినుము
మీ తాతయగు విప్ర మిథునంబునకును
ఖాతిగా నిచ్చితిఁ బ్రాయంబు వినుము
ఎంతకాలము ధర యేలుదు వీవు
నంతకాలమ్ముందు రతి ప్రాయమునను
నూటయిర్వదియేండ్లు నొగి భూమి యేలి
నాఁటికి దివ్య కన్యక కామయుక్త
కృష్టుండవై (నీవు) కొండ బిలముల
*విష్టప దివ్యాంగనావిష్టుఁడవగుచు
భోగంబులును దేవ *భోగంబులంది
వేగంబ యమరత్వ విభవంబు నొంది
యుండెద"వని దేవి యొగి నానతీయ
*మెండైన ఖడ్గఖేటకములు కొనియు
సాష్టాంగుఁడై మ్రొక్కి సంప్రీతి లేచి
యిష్టసిద్ధులు గల్గె నింక నా కనుచు
దేవి వీడ్కొనివచ్చి దేదీప్యమాన
నవయౌవనాంగులై నయమొప్ప నున్న
మాధవ శర్మకు మహి సాగి మ్రొక్కి
సాధుభావము చేర సంప్రీతి నుండ.

నటననుమ కొండను నాపట్న మేలు
నెఱుకురాజులు సేన నెంతయుఁజూచి
కరులు దేరులు వాజిగములు భటాది
వరులనంతయుఁ జూచి వారు భీతిల్లఁ
బట్టుచాలదు సేన బలములకొలఁది
యెట్టు సేయఁగ వచ్చు నింకేమి తెఱఁగు
పోరాదు నెదుటకు రారాదు మగిడి
ఘోరాటవులు సొచ్చి పోరాట మాని
దూరంబుపోవలె వైరంబుమాని
సారంబులేదు సంసారంబు [1]నందు
నిన్నిదినము లుంటి మీ యన్మకొండ
అయ్యయో! నింతలునయ్యెనే! యనుచు
అయ్య సిద్ధేశ్వరు నట దూఱుకొనుచు
నుండంగ నంతట నొక భూసురుండు
*చండ [2]పరాక్రమము చెప్పి బాలునిది
అంత తద్వృత్తాంతమంతయు వినియు
సంతసంబున వచ్చి సన్ముఖులైన
మాధవశర్మ దా మానిత యశుఁడు
బోధాగ్రగణ్యుండు పుణ్యుఁ డగణ్యుఁ
డెఱుక దేవరరాజు కిట్లని పలికె
"మీరు పరాక్రముల్ మీరలు దేవ!
భూదేవవరులను బ్రోతు రెల్లెడల
వేదసేవకు విప్రవృత్తుల యెడల
వెరవొప్ప మీ రాజ్యవిభవంబు చెల్లెఁ
గరమొప్పఁ(గాను) శ్రీకర మొప్పఁగాను
"[3]అమరసావే మల కరుగుఁడు మీరు

1. లందు; 2. పరాక్రమ; 3. అమరవాది రాజ్యమని ప్రతా. చరి.

కామరొప్ప నుండుఁడు కొదవలే దంచు"
నని వీడుకొలిపిన [1]నరిగిరి వారు
మానిత యశులు దా మాధవు నాజ్ఞ

## మాధవవర్మ సింహాసన మెక్కుట

అంత నా బాలుండు నా సేన నెల్లఁ
గొంత దవ్వేదురేఁగి కోర్కె దైవాఱ
ననుమకొండకుఁ దెచ్చి యందఱ నుంచి
కనుఁగొని వారల గారవింపుచును
నొక ముహూర్తంబున నొగి మాధవర్మ
సకల బ్రాహ్మణులకు సంతృప్తిగాఁగ
దేవ భూదేవ పూ*జనలు గావించి
భావశుద్ధిగ వారి భక్తిఁ గొల్చుచును
భూసురాశీర్వాద పూర్వకంబుగను
భాసుర శాలివా*హన (శక) వర్ష
మందు శతంబులు నవి రెంటి మీద
పొందుగా ముప్పది చెందు వర్షములు [2](శా. శ. 230)
నందున తారణ *సంవత్సరమున
యందలి మార్గశి*రంబనుమాస
మందు పంచమి తిథి యగు గురువార
*మందలి శ్రవణంబునందు శుభలగ్న
మందు సింహాసన మవలీల నెక్కె
నందు మాధవవర్మ యతి ధర్మవిదుఁడు
సకల జనంబుల సదయుఁడై పిలిచి
సకల వస్తువు లిచ్చి సంప్రీతితోడఁ

1. అటఁజనిరి; 2. శా. శ. 291 సం. తారణ సం.ర మాఘ. శు. ౫ గురువారమని ప్రతాపచరి.

దమ తండ్రి వైరంబుఁ దలఁచి తానపుడు
తమ గోవులఁ దలఁచి తమకంబుతోడఁ
గటకునిచే నొచ్చి గాసిఁబడిపోయి
యట చిక్కినట్టి కం*దారాస్త్రవర్గ
ములను రమ్మని లేఖ ముదముతో వ్రాయఁ
దలఁపులోననె వారు తగ నేఁగుదేర
దొరలు మన్నీలు స*ర్దార్లు వజీర్లు
వడి మంత్రివరులును వరుసను బొంగి
ముందున్న తమతండ్రి మూలబలంబు
లందఱు వచ్చిరి పొందుగా నపుడు
తమరాజు గలిగెను తమకంచు వేడ్క
సమయంబునకు వచ్చి చనుదెంచినంత
వారల మన్నించి వైభవం బలర
వారికి ననియె నవారిత ప్రీతి :
"మన పూర్వశత్రుఁడు మని యుండ మనకుఁ
గనుఁగొనలకు నెట్లుగా వచ్చు నిద్ర
మన గోధనంబులు మనకు రాకున్న
మనసు నూల్కొనునె వేమాఱులకైన"
*అని ప్రీతిఁజేసి పడవాళ్ళను బిలిచి
చని మీరు చాటుఁడు *సేనకు నెల్లఁ
గరి హయ భట కదం*బంబులనెల్ల
సరగున వేగమ సమకూర్చ ననిన
*వారెఱిఁగి సేనలో వసుధామరేంద్రు
భోరను నాజ్ఞఁ దార్పొగడి యిట్లనిరి :
"ఓహో చమూనాథు లోహో వజీర్లు
*నా [1]మహాక్రౌర్యుఁ డగు (నా) కటకు మీఁద

1. క్రావ్యుఁడగు.

బాహాబల ప్రౌఢి పరిణమింపంగ
నాహవక్రీడకు నధిపుని యాజ్ఞ
*ఎల్లి [1]చనుచున్నాఁడు [2]నెల్లెము మీరు
సల్లీల మన్నీలు సరదార్లు దొరలు
కదలుఁడు చతురంగ గములతోఁగూడ
మదినొప్ప మీ"రని కదిపి చెప్పుటయు
వారలు నుత్సాహవైభవం బలర
*వరవాహనము లెక్కి వచ్చిరందఱును

అంతట నప్పుడు నారాజు కొంత
వింత చందంబుగా వివిధహారములు
వరరత్న భూషణావళులు ధరించి
శరఖడ్గ ఖేటక చాపముల్ దాల్చి
వరశక్తి వచ్చియు వరబలంబులను
మురు(?)శక్తి తమ తండ్రి మూలబలంబు
కూడి యంభోనిధి ఘూర్ణిల్లునట్లు
వాఁడిమిమీఱ నవార్యుఁడై భేరి
వేయించి శంఖముల్ *పూరించి దిశల
మాయించి ప్రళయభై*రవమూర్తిఁ బోలి
తా నేఁగి తమతల్లితత్వాదములకు
మానుగా దండప్ర*ణామంబుఁ జేసి
విప్రదంపతులకు నప్రమత్తతను
సుప్రబోధంబుగా క్షిప్రత మ్రొక్కి
చతురంగబలము లసంఖ్యలు గొలువ
హితులు మంత్రులుఁ దన యిరుగడ నడవ
సతులు పుణ్యస్త్రీలు సరి నివాళింప

1. చనుచున్నా డదిగా ; 2. వెల్లెముమీరు ఎల్లెము - శీఘ్రము.

గతులకు నర్తకిగతులు చెలంగఁ
గతి ప్రయాణంబులఁ గటకంబు చుట్టి
యతివైభవంబుల పతియాజ్ఞ బలము
కోటలు ద్రవ్వి కవాటముల్ విఱిచి
మేటి బుర్జులు విటతాటగాఁ జేసి
వనములు చెఱచి యు*ద్యానముల్ విఱిచి
జనపదముల నేర్చి జనములఁ గూల్చి
గోవుల మలపి యీ*రసమున నిలిచి
*మదకరుల మాయించి మల్లాడి కటక
భూవరు నెంతయుఁ బోనీక పోరి
[1]పోవక మాసంబు పోటులాడగను
బల్లహుబలమును ; బల్లహుఁ డపుడు
చెల్లచెదరై పాఱి పొల్లవోయినను
బల్లహుతలఁ ద్రుంచి పట్టణంబు నొంచి
కొల్లగాఁగను మూఁడుకోట్ల ధనంబు
లప్పనంబులుగొని యట వాని సుతుని
కొప్పుగాఁ గటకంబు నొప్పనచేసి
తనయాజ్ఞ గైకొని తగనుండు మనుచుఁ
*దన బలంబులఁ దాను దగ మఱలి తనకు
మేదినీ కరవాల మేటి భైరవుల (?)
సాదిని బిరుదంబు సమరంబులందు
చెల్లించుకొని వచ్చి శ్రీ యన్మకొండ
సల్లీలతోనుండె సంభ్రమంబునను.

అంత మాధవవర్మ యతి ముదంబునను
సంతసంబునఁ దన పంతంబు నెఱపె

1. పోవ కాకమాసంబు.

గోవుల మఱలించి గోధనంబులను
నావలీవలఁ గృష్ణ నదితీరములను
శ్రీనగోపాంత్యంబు చేరువ మంద
*లను గతంబుగ నమర*వాది యాదిగను
వేయించి మందలు వెన నధికారు
లై యుండ గోపాలురందఱ నునిచి
నెఱకు రాజులకు నేమఱకని చెప్పి
సరగున దిక్కులు సాధించుకొఱకు
సేనలోఁ జాటింపఁ జెప్పిపంపుడును
మానసీయులు రాజు మన్నన దొరలు
వడివాగఁ దేజీలు పల్లకీ లెక్కి
వడిఁబాయ కేతెంచి *రదటు•మీఱంగ
వరబలంబులు పెక్కు వారువంబులును
సరగున నెక్కి స్థాజాల్(?) ద్రిప్పుకొనుచు
*వెఱగొప్ప వచ్చిరి వైరిజయమునకు
సరగునఁ గొందఱు సామజాలెక్కి
పరఁగ నేతెంచిరి బలు సరదార్లు
తలతలఁ బాయుఁడు దాయుఁ దటంచు
భళిరె ! సెబాసంచుఁ బరువిడుకొంచుఁ
బరవళ్ల ద్రొక్కుచుఁ బైసపైసంచు
నురవళ్ళ నుఱుకుచు మరువుళ్ళతోడ
కదియుచు నొడియుచుఁ గైదువుల్ గొనుచు
మదభటు లేతెంత్రు మాధవుఁగొలువ
వాహనాలెక్కి యావహాలుల్లసిల్ల
బహుచిత్ర భూషణవస్త్ర సంభూషి
తాంగులై కస్తూరి కాలేపనాది
సాంగులై నృపకార్య శౌర్యోత్సవముల

తంత్రులై నిఖిల స్వతంత్రులై మించు
మంత్రు లేతెంచిరి మాధవు కడకు
హితులు మంత్రులు పురోహితులు విద్వాంస
తతులుఁ బౌరాణిక మతులు దేశాధి
పతులు వకీళ్ళు నౌబతులు వజీర్లు
నతుల వైభవరాజ్య గతి చెలంగుచును
దిగ్విజయంబుకై *చెలఁగుచు దివ్య
స్రగ్గంధ వస్త్రభూషణములు దాల్చి
వరఖడ్గ ఖేటకావలులు ధరించి
శరచాపదండ (ముల్) చక్రాయుధములు
ధరియించి మాధవ దంపతులకును
సిరియాలదేవికిఁ జేరి సాష్టాంగ
దండంబు గావింపఁ (దా మణి) హేమ
మండనంబులు నిచ్చ మది నుత్సహించి
యాశీర్వదించిరి యా రాజసుతుని
భాసిల్లు భూసురప్రకర మందఱును
నేసలుముత్యాలు నేనలు చల్ల
భాసురం బగు పైడిపల్లకి నెక్కి
మాధవవర్మ తా మహిమతో వెడలె
భేరులు దారలు పెద్ద వజీర్లు
వారువంబులమీఁద వరుస నేతేరఁ
బశ్చిమోత్తర యామ్యభాగాలవారు
నాశ్చర్యత్తై రాజులంద తేతెంచి
కరులు రత్నంబులు కనకాంబరముల
వర వస్తునిచయంబు వాహనంబులును
నప్పనంబులు దెచ్చి యొప్పనచేసి
చెప్పి తార్వోయిరి సీమల కపుడు

కొందఱు రాజులు క్రొవ్వుల మీఱి
యందంద బలముతో నార్చుచువచ్చి
మ్రందిపోదురు తమ డెందముల్ పగిలి
కొందఱు సమరసమందుచునుందు
రందఱఁ గరుణించి యప్పనఁ గొంచు
నలుదిక్కు గెలిచియు నతిమోద మొదవఁ
చెలఁగుచు ననుమకొం*డకుఁ జేరి విజయ
లక్ష్మితో సామ్రాజ్యలక్ష్మితో నమర
లక్ష్మితో సింహాస*నాసీనుఁ డయ్యె
మాధవవర్మ దా మహనీయమహిమ
మాధవుఁ బోలి తా మహి నేలుచుండె.

ఆ సమయంబున నా పట్టణంబు
భూసురులెంతయుఁ బొడగని వచ్చి
యాశీర్వదించిన నందఱఁ బ్రీతిఁ
జూసి వారల ప్రేమచేసి కూర్చుండ
నియమించి వారలు* చనుదెంచినట్టి
ఆయనంబునకు మది*వినయంబు గుదుర
"స్వాములు వేంచేయుచంద మెట్టిదియొ
వేమఱు మాకును వినిపింపుఁ" డనిన
నని రొక్కమాటగా నా విప్రవరులు
"వినుమ యో రాజేంద్ర ! విభవదేవేంద్ర !
మీ తల్లి సిరియాల మేదినీదేవి
కాంతకై ప్రాణంబు గాచిననాఁడు
కటకబల్లహుంబాధ కడు వికటించు
నట భుజించిన పోవునఁటె క్షత్రియాన్న
మును ? గలియుగమున మొనయ ననర్హ

మను నైనదానికి ముదమొప్ప వినుఁడు
నాపదవేళల నదియును గాక
నేపాఱ స్త్రీచెఱ పాపంగవలసి
శివప్రసాదం బని సేవింపవలసె
నవమానమైన యీ యనుమాన మెపుడు
మెరమెరఁ బాయక మెదలు చున్నదియు
[1]భూవర సప్తగోదావరతీర
మున నగ్రహారముల్ మునుకొని యుండఁ
జని యనుష్ఠానముల్ సరగునఁజేసి
గతులఁ బొందెదము మీ యతుల ధర్మమున"
మతిమీఱ నన జనపతి ముదమొదవ
వెయ్యిగ్రామంబులు సయ్యన నిచ్చి
చయ్యన ననిపినఁ జనిరి వారంత
నంతట నొక కొన్ని హాయనంబులకు
సంతతికొఱకునై చింతతో నున్న
నంతఁ బద్మాక్షి వ*రప్రసాదమున
వంత దీరఁగ నొక్క వరసుతుఁ గాంచె
దేవీప్రసాద తే*జోమూర్తి యగుట
దేవిపేరిదియన (దేవి) పద్మాక్షి
నామంబుదనకును నేమంబుగాఁగ
నేమంబుగాఁ బద్మ నేనుఁడై వెలసె
నంత మాధవవర్మ యధిక విఖ్యాతి
సంతసంబున ధరా చక్రంబు నేలె
నూటయర్వదియేండ్లు నొగిపాలనంబు
వాటంబుగాఁజేసి వరశక్తి మహిమఁ
బద్మాక్షి పూజకు బహువిధవర్ణ

1. పావర.

పద్మంబులుండంగఁ బద్మాకరములు
సకలవర్ణంబులు సరసతగల్గు
నకలంక శోభితంబగు పువ్వుతోట
లొనరఁ బెట్టించి తానొప్పుగానుండ
ఘనవైభవంబులు గాంచియుండంగ
నొకకొండ బిలమున నుండి కన్యకలు
సకలంబు గొనిపోవఁ జర్చించి దినము
నొకనాఁడు కావలి [1]యుండి యారీతి
బిలములోనుండియు బిలకన్యవితతి
యలరులు వ్రత్తురు నందఱుఁ గొనుచుఁ
గొనిపోవగాఁ జూచి కువలయేశునకుఁ
జని చెప్పనంతయు సకలంబు తెలియు
మాధవవర్మకు మనమునఁ దోచె
బోధ పద్మాక్షిదని పొలుపంత దెలిసి
పద్మసేనుని రాజ్య పట్టంబు గట్టి
పద్మంబునందుండి చని పువ్వుతోట
కారాత్రి బిలకన్య కాకృష్టఁ డగుచు
నారామభూముల నాబిలంబులను
బోరాము సేయుచు గారాముతోడ
నారామలనుగూడి యమరత్వ మొందె

ఆశ్వాసాంతము

రాజరాజార్చిత రాజీవపాద
పూజనీయకృపాళు భువనవిలోల
రాజిత రాజీవరంజిత చరణ
పూజిత సాహస్ర పురుషోత్తమాద్య

1. యుండి తీటిడు.

*రాజీవభవవంద్య రమ్యగుణ వంద్య
పూజభక్తి గిరీశ భువనప్రకాశ
శ్రద్ధ భక్తి హితార్థ శైవాగమార్థ
సిద్ధ చిత్త విహార సిద్ధేశ యీశ
యిది సకల విద్వజ్జ*నా పాదకమల
సదమలాంతఃకరణ [1]సభ్య సంస్మరణ
భాసురసాధు భావన గుణానూన
భూసురాశీర్వాద పూజనీయుండు
కానె మల్లనమంత్రి ఘన కుమారకుఁడు
వాసిగాఁ జెప్పె సర్వప్పను నతఁడు
సిద్ధ మాహాత్మ్యమన్ శ్రీకథయందు
*సిద్ధ ప్రమథ కథిత చరితంబు కథల
యందు పూర్వపురాజు లందఱి కృతిని
అందు నాశ్వాసంబు నయ్యె రెండవది.

## ద్వితీయాశ్వాసము

1. సభ-సంస్మరణ

# శ్రీ సిద్ధేశ్వర చరిత్రము

## [కాకతీయరాజుల చరిత్ర - ప్రతాపచరిత్ర]

### తృతీయాశ్వాసము

శ్రీ భక్తమందార! శ్రితజనాధార!
వైభవాకార! కృపాపారవార!
సారమంత్రోద్ధార! సరసగంభీర!
క్రూరపాపవిదూర! కుండలిహార!
[1]సిద్ధభక్త సరోజచేతోవిహార!
సిద్ధేశ! పార్వతీచిత్తవిహార!

మాధవవర్మ దా మహనీయ యశుఁడు
బోధచేఁ [2]గన్యలఁ బొలతులఁ గూడి
బిలముల వనములఁ జెలువములుగను
నలరుల తోటల నారామములను
నా రీతిఁ దా నుండి యమరత్వ మందె.

### పద్మసేనుఁడు

కోరిక నాతని కూరిమిసుతుఁడు
పద్మసేనుం డను పార్థివోత్తముఁడు
పద్మాక్షిఁ బూజించి ఫలముగఁ బెద్ద
కాలంబు లవలఁ దా నేలెను వసుధ
నాలంబులను వైరిజాలంబు నణఁచి

1. శ్రద్ధ: 2. కన్యకం.

యంతట సంతానవంతచేఁ జిత్త
మంతకంతకు మదిఁ జింతిల్లి విబుధు
లనుమతంబునఁ దన *ధృఢమతంబునను
గొనకొని సిద్ధేశుఁ గూష్మాండఫలము
లను బూజఁజేసియు నాయనకరుణ
ననయంబ వర్తింప నపుడొక సుతుని
గనిన నాతనికిని ఘననామ మపుడు
వెన్నమరా జను వేడుకపేరు
క్రన్నన నిడి వాని నెన్నికఁ బెంచు
*చున్నంతట మహో*న్నతవృత్తి కటక
బల్లహుఁ డపుఁడు దా బలుపున నున్న
నల్లనఁ జని వారి నపుడు జయించి
యప్పనంబులు గొని యట రెండుకోట్లు
నొప్పగు స్వర్ణంబు లొగిఁదెచ్చుకొనియు
వరుస డెబ్బదినాల్గు వర్షముల్ భూమి
సరగునఁ బాలించి సకలంబునకును
బఱఁగ వెన్నమరాజుఁ బట్టంబు గట్టి
పద్మనేనుఁడు దాను పరలోక మేగె.

## వెన్నమరాజు

అంత వెన్నమరాజు నంతయు భూమిఁ
బంతంబుమీఱఁగా పాలించి యొక్క
పుత్రునిఁ బడసెను భుజబలాధికుని
శత్రుసంహరణంబు *చేసి యా ధాత్రి
వృద్ధానుచార సం*పద్విలాసముగ
సిద్ధేశుఁ బూజించి చెలఁగుచు నొక్క

పరసుతుఁ గాంచెను వైభవోన్నతునిఁ
గరమొప్ప నతనికి ఘననామ మిడియెఁ
బోరంకి వెన్నుఁ డన్ పొందగు పేరు
నా రీతిగాఁ బెట్టి యతనికి రాజ్య
పట్టంబుఁ దాఁ గట్టి బహువిధగతుల
నెట్టణంబుగ నేలె నీ ధరాతలము
*డెబ్బదిమూ డేండ్లు దెంద మలరఁగ
గొబ్బున నంతలోఁ గూడెఁ దా శివుని.

## పోరంకి వెన్నమరాజు

అంతలోఁ బోరంకి యా వెన్నమయ్య
కొంతకాల మవని సంతసంబందఁ
బాలించి సంతానప్రాప్తికై జాలి
మాలిచే సిద్ధేశమంటపంబునకు
మణులు, రత్నంబులు, మాణిక్యములును
*నాణిముత్యంబుల నగు ముగ్గుఁ బెట్టి
యద్దేవు కరుణ నహర్పతితేజు
డిద్ధసమాధిక *జ్ఞానపారీణుఁ
డగు సుతుఁ బడసెఁ దా నతనికిఁ బేరు
తగువార లందఱుఁ దగు పెండ్లిగుండఁ
డను నామ మిచ్చిరి నతనికి నపుడు
వెనుకొని పోరంకి వెన్నమరాజు
పట్టాభిషిక్తుఁడై పరఁగరాజ్యంబు
మట్టుగాఁ జేయుచు మఱలఁబడ్డట్టి
కటక బల్లహుఁ ద్రుంచి గాదిలివాని
కటకంబునకు రాజుఁగాఁ జేసి సుతుని

చేత సువర్ణంబు చేకొని కోట
లాతత బహుకీర్తులంది దిగ్విజయ
మాతలిరాజుల నందఱ గెలిచి
మతిమీఱఁ బురముకు మగిడి తా వచ్చి
దెబ్బదిమూఁ డేండ్లు *తెలుఁగొప్ప భూమి
గుబ్బునఁ దా నేలికొని పెండ్లిగుండ
రాజుకు రాజ్యంబు రమణగాఁ గట్టి
తేజుఁడై పోరంకి దేవవెన్నుండు
రాజు దా శివలోకతేజంబు నొందె.

## పెండ్లిగుండమరాజు

పెండ్లిగుండమరాజు తండ్రిని మీఱి
చండవిక్రమకళామండనుం డగుచు
రాజ్యంబు నేయుచుఁ బూజ్యుఁడై పెక్కు
రాజ్యముల్ గెలిచియు రాజులఁ జేరి
యప్పనంబులు గొంచు నవనిఁ బాలించెఁ
దెప్పదేలంగ భూదేవ దేవులకుఁ
బెక్కు పూజలు చేసి యక్కజంబుగను
జక్కన దేవ ప్రసాదమున నొక
వరసుతుఁ గాంచెఁ దా వైభవం బలర
నెరుకదేవరరాజనెడిపేరు నిడియుఁ
దనయాజ్ఞ మీఱిన తగ [1]పార్శ్వదేశ
మున కేగి [2]యవనాది మూలతురుష్క
బలముల నవలీలఁ బట్టి వధించి
మలయుచు వారిచే మది సంతసింప

1. పార్శ్వదిశమున; 2. ఈ విషయము ప్రతా. చరి. లో లేదు.

నెనుఁబది లక్షల యెన్నిక మూఁడ
లునుగొని మగిడి తా *నున్నంతలోనఁ
*[1]గటక బల్లహుఁడు తన కటకంబులోన
నట మర్లబడినను నల్లుర రుద్ర
*దేవుఁ బంచిన నతఁడు దేదీప్యమాన
*మవు బలములఁగూడి యాకటకంబు
చుట్టును విడిసి తా ముట్టడంబుగను
పట్టు యుద్ధముసేయ మట్టునెడి వాఁడు
మాసత్రయంబును వేసటలేక
చేసిన యుద్ధంబు చేయంగలేక
యేబదిలక్షల యేబదివేలు
మాబగంచును(?) వాఁడు మాడలిచ్చినను
*అల్లు రుద్రదేవుఁ డటమర్లివచ్చి
బల్లిదుఁడౌగుండ ప్రభునితోఁ జెప్ప
నాతఁడు కోపించి యా రుద్రదేవుఁ
బ్రీతిగా నెవ్వటి పెట్టిబడివస్తు (?)
*చేతప్పి స్వల్పంబు తెచ్చితి వీవు
భాతిగాదని తానె *పయనమై కదల
మరికి నారాయణ కరకరితోడ
సరకు చేయక తాను సకల సేనలతోఁ
*బురికి నేతేర నేమరక కటకుండు
నరికి వెన్నీయక యట రెండు నెలలు
సరికిఁ బోరియు నటఁ బిఱికితనమున
నప్పనంబుల నిచ్చె నెప్పటి యట్ల
చెప్పి గుండమరాజు కోపించునంత
సంతసంబును నొంగి పంత మెలర

1. ఇది ప్రతా. పరి. లో లేదు.

నంత పదార్థంబు మంతనం బిడక
యంత దళములకు వంతులు దీఱ
వింతవింతగ దళమంతకుఁ బంచె
కొంతబ్రాహ్మణులకు సంతసపడగఁ
బంతంబు మీఱంగఁ బంచి పెట్టుదును
అష్టదిక్కులు గెల్చి యవనిపాలించి
స్పష్టంబుగా జయ స్తంభంబు లెత్తి
పెండ్లి గుండమరాజు పేర్వెలయించి
దండిగా నేఁబది తగ నెనిమిదేండ్లు
మెండుగా నా యన్మకొండఁ దానేలి
యెరుకుదేవరరాజు కెనలేరటంచుఁ
బఱగఁదన సుతుకుఁ బట్టంబుగట్టి
అంతట శివలోక మరిగె నాగుండఁ
డెంతో సంతసమున వంతలు లేక.

## కుంతలదేవి

ఎరుక దేవరరాజు డెంతయుఁ జిన్న
వర బాలకుఁడు గాఁగ వాని మేనత్త
కుంతలాదేవన సంతతధర్మ
వంతన చతురంత వార యానాది
కాంత దిగంత విక్రాంత యెంతయును
నంత సామ్రాజ్యంబు *దా నేలుచుండి
గుజరాష్ట్రి మహరాష్ట్రి ఘూర్జర యవన
రాజులపై దొడ్డ రయమున వెడలి
వారి నోడించి యవారిత ధనము
లప్పనంబులు గొని యా జయ స్తంభ

మెప్పుఁగవేయించి యొగి నన్మకొంత
విప్పగు వీథుల వేంచేసి మగిడి
చనుదెంచునంతలో సరసత నపుడు
ఘన బలాధికుఁడైన కటక బల్లహుఁడు
మఱలంగఁబడ్డ నా మనుజేశు నపుడు
*కరి హయ భటులతో ఘనబలముఁగూర్చి
*రాణి గంగిదేవు రాణువునకును
నాణెంబుగా దళనాయకుఁజేసి
పంపుటయును వాఁడు బల్లహుతోడ
చంపి దావుదుచేసి(?) జగడంబులపుడు
ఆరునెలలుచేసి యాతని ద్రుంచి
బోరున నటవాని పుత్రుని నిలిపి
యెప్పటివలెఁ దమ యప్పనంబులును
కుప్పలుగాఁ దెచ్చి కుంతలదేవి
కిచ్చినంతట మెచ్చి పొచ్చెంబు లేక
[1]పందొమ్మిదేండ్లు దా భరమూని రాజ్య
మందునెఱుకదేవ కపుడు పట్టంబు
గట్టి తానును శివుఁ గలయంగఁ జనియె.

## ఎఱుకదేవరాజు

పట్టి యెఱకదేవ ప్రభులు చెలరేగి
నవయౌవనాంధుఁడై నానాటి కపుడు
సేవకావలి తన్నుఁ జేరి కొల్వంగ
అంగవంగకళింగ....లాట చోళ
బంగాళ నేపాళ పాండ్య పుళింద

1. "నవవర్షంబు"లని ప్రతా. చరి.

రాజుల గెలిచెఁ దాఁ దేశంబు మీఱ
భోజుఁడై దేవేంద్ర భోగభాగ్యముల
దేవతాదులకైన దుష్కంపరాని(?)
దేవగిరిమీఁది కుద్రేకుఁడై వెడలి
వారి సాధించి యవార్యత వారి
వారిచే స్వర్ణంబు వరుస నెన్మిదియు
*లక్షలు గొని మగిడి యాక్షణంబునను
సక్షిప్రముగ విప్రజనముల నెల్ల
రావించి వారల సేవించి భక్తి
గావించి నెఱవాదిగా మంచి సుతునిఁ
గామించి తన పూన్కి గావింపు మనుచు
సేవించి క్రతువుఁ దా జేయింపుఁ దనియె.
"పుత్రులు గల్గిన పాత్రత గల్గు
గోత్రపవిత్రత కులమునకెల్ల
గాత్రశుద్ధియును సత్యాత్రత గల్గు
పుత్రుడు గలిగెడి పాత్రత తెలియ
*మిత్రతఁ జెప్పరె పాత్రమతులార !
*ఆర్తులమైన మా" కని విన్నవింప
ననిరి భూసురవరు లందఱుఁ బ్రీతి.
*విని "యెఱుకదేవ భూదేవానుమతిని
పుత్రకామేష్టి యజ్ఞ పుణ్య సత్క్రతువు
*నేత్ర పర్వంబుగా శ్రోత్రియులచేతఁ
బాత్రత జేయింప గోత్ర వృద్ధిగను
పుత్రుఁడు గల్గును శాత్రవజయుఁడు"
అని చెప్ప నప్పుడు నా యెఱుకదేవుఁ
డనుమతించియుఁ గ్రతువట్లు చేసినను
బుత్రుఁడు గలిగెను భూరిసత్త్వుండు

*నత్యుత్తముఁడు భువనైక మల్లుండు
నను రాజు కొమరుండు నవయౌవనాంగుఁ
డునుగాగ నెఱుకదేవన భూపవిభుఁడు
విజయనగరముపై విఖ్యాతముగను
*గజబృందములు పేరుగల దొరలతోడ
విజయంబునకు దండు వెడలి నృసింహ
విజయరాయల గెల్చి పీడెల్లఁ గాల్చి
యతనిచే విత్తంబు నప్పన గొనియె.

ఆతని దన యాజ్ఞకు నతునిగాఁజేసి
మగిడనుమకొండకు మంత్రులుఁ దానుఁ
దగు జయలక్ష్మితోఁ దా నేఁగుదెంచె
నెనుబది తొమ్మిది*తెఱగొప్ప నేండ్లుఁ
బుచ్చిన రాజ్య సం*శోభితుఁడగుచు
భువనైక మల్లుని బొసఁగ రాజ్యమున
నవరణతో నిల్పి సకలంబు చెప్పి
యెఱుకదేవరరాజు నేగె సద్గతికి.

## భువనైకమల్లుఁడు

నరవరాగ్రేసరుం డా భువనైక
మల్లుండు తాఁ గీర్తి చెల్లించుకొనియె
నెల్లరాజుల గెల్చి యేపుమీఱంగఁ
బట్టాభిషిక్తుఁడై ప్రతివీరుఁగటకు
నెట్టణంబుగ వాని పట్టణంబునకు
ముట్టడంబును జేసి మొగి వాని ద్రుంచి
కట్టి పట్టము వాని గాదిలి సుతుకు

వాని బిరుదములు వారాహచిహ్నా
లగు బిరుదంబులు నప్పుడు గొనియె
విజయంబు గైకొని వేగంబె మగిడి
విజయనగరముపై వెస దండువెడలె
గజిబిజిగాఁజేసి కలచి నగరము
విజయంబుగైకొని వేగంబ యతని
గజబృందములకును కలఁగి యేతెంచి
నరసింహరాయలు నారాయవిమత
నరసింహుఁడగునట్టి*యా భువనైక
మల్లున కప్పుడు మణులుహా*రములుఁ
జెల్లించెఁ గానుకల్ సల్లీలగాను
మఱియుఁ దాఁ బాలించె మంచి విలాస
పరిజనంబుల నప్డు పరివారములను
గానుకగా నిచ్చెఁ గడుఁ దా విలాస
*మున విలాసవతియు మనుకొని కాంతి
*మతియు గుణవతియు వరరూపవతియు
నతి సర్వసౌభాగ్య యగు విశారదయు
పంచకన్యకలను పతికిఁ దా నిచ్చె
నంచితప్రీతితో నందఱ కపుడు
సంచితంబులు సర్వ సౌభాగ్యములును
మంచి ముహూర్తాన మానినిఁ దనదు
నంచిత గుణవతియగు సహోదరిని
శ్రీరంగదేవిని జేరంగఁ దిగిచి
సారంగ సకల భూషణములు నిచ్చి
సవరని గ్రామముల్ సమకొల్పి యరణ
మప్పుడు కాంచిపు*రంబు నాదిగను
నొప్పుగఁ జోళదే*శంబును నొకటి

శ్రీరంగదేవికి చేకొన నరణ
మారయ నిచ్చియు నధిక సమ్మతిగ
బంధుత్వ సరణులు పాటించి తమకు
బంధుత్వ మెప్పుడుఁ బాయకుండంగ
సఖ్యంబుఁ జేసియు సహజాగ్నిహోత్ర
మాఖ్యగా సాక్షి ప్రమాణముల్ చేసి
స్వర్ణపటములపై సహజంపుప్రాలు
పూర్ణతగాఁ బెట్టి భువనైకమల్లుఁ
డచట నాలుగు నెల లట్లు వసించి
యచటికిఁ దన పూర్వ*నగరంబునకును
వచ్చునపుడువారు వరపూజ లెలమి
*నిచ్చిన నృసింహరాయలు వస్తుసమితి
పుచ్చుక దేవితో భువనైకమల్లుఁ
డచ్చటఁ గదలిరా నా సిరిరంగ
దేవి బాల్యమునుండి తెఱఁగొప్పఁ దనకు
*దా వివరించియుఁ దగువరుఁడు తనకుఁ
*గావలెనని ప్రేమగూఱి వసుదేవ
దేవమూర్తియు నగు దేవ పాంచాల
రాయనిఁ బూజించె వేయు విధముల
నాయమ ఫలసిద్ధి యగునంతలోన
తనవెంటనే తెచ్చెఁ గనుగొంటకొఱకుఁ
దనయిచ్చఁ బూజసేయను గోరి తెచ్చె
ననుమకొండకు రాఁగ నచటికి నిరువ
*దన నొక్క యోజనము లతిదూరమునను
నైరృత్యభాగంబునకుఁ జేరువగను
నరుదొంద నచటను నగ సమీపమున
*మునులు భువనైక మల్లునిఁ గాంచి యనిరి

*మునుమిడి యీ పుణ్య ముఖ్యక్షేత్రంబు
*కనుఁగొన రంగద్వారంబుకు ఘనము
నిచట మీనాంబరం*బను నొక్కతిప్ప
నచట దేవనివాసమన నొప్పియుండు
నని చెప్పునంతలో నా భువనైక
ఘనమల్లుఁ డెంతయుఁ గనుగొని యచట
సంతోషచిత్తుఁడై యంతయు నూరు
వింతల గుళ్ళను వేగంబ కట్టి
మున్ను ప్రత్యక్షమై యెన్నిక నున్న
*విరూపాక్ష లింగంబు వేడ్కఁ గేదార
మరుదగులింగంబు నత్యుగ్ర నార
సింహుని శ్రీ హిర*ణ్మయ భద్రకాళి
నంహోని రసనము నటఁ జేరి మ్రొక్కి
దేవియుక్తంబుగా దినము పదేడు
*నవికల మనమున నటఁ దులాపురుష
ములు దూఁగి స్వర్ణంబు *నొకకోటి దాన
ములుచేసి (వా) సుదే*వుని ముందు నిలిపి
యొక్క శివాలయం (బక్కడ) నిలిపి
చక్కగ ననుమకొం*డకుఁ జనుదెంచి
*పాంచాలరాయనికిఁ బ్రాఙ్ముఖంబునను
వేంచేయ దేవాల*యంబు గట్టించి
ఆ దేవు నిత్యోత్సవంబుకు కంచి
కాది దేశంబుల నగు పదకొండు
గ్రామంబు లవి కొన్ని క్రమముగా నిచ్చి
నేమంబుమీఱ రా*జ్యము నేయు నెడను
శ్రీరంగదేవికి చెలఁగి భువనైక
నారంగ(?)మల్లున కప్పుడు నొక్క

*పుత్త్రుఁ డుదయించెను భూరిసద్విమల
గాత్రుండు, వర్ధనగోత్రుండు, సుజన*
స్తోత్రుండు, పాత్రుండు, సుచరితుఁ, డఖిల
మిత్రుండు, త్రిభువన మేటి మల్లుండు
నను నొక్క పుత్రుండు [1]ననుఁగుఁ బుత్రికయు
జనియించె నంతట *నేమంబుమీఱ
సామంబు పాంచాల*రాయని పేరు
నేమంబుతోఁ బెట్టి నిత్యోత్సవముల
భువనైకమల్లుండు పూజ్యసామ్రాజ్య
భువనంబు లన్నియుఁ బొగడఁ బాలించు
సమయంబునందున *నట నారసింహ
నామరాయల కప్డు నేమంబుమీఱ
పుత్రుఁడు పుట్టెను భూరి సత్త్వుండు
పాత్రుండు దిక్కులగోత్రుండు నాఁగ
వేంకటనాథుండు విమలసద్గుణుఁడు
*అంకరహితేందుసంకాశవదనుండు
పంకజోదరభక్తప్రణతుండు, వీర
హుంకారుఁడను బిరుదాంకుండు నాఁగ.

### వేంకటనాథుఁడు హనుమకొండపై దండువెడలుట

వేంకటనాథుండు విమల సద్గుణుఁడు
నొకనాఁడు లీలాసముల్లాస మెసఁగ
సకలసేనలుఁ దాను సంభ్రమంబునను
బురము వెల్వడివచ్చి భూపకుమారుఁ
డరుదొంది యట నిల్చి యాప్రజఁజూచి

1. నాకి యొక పుత్రి.

రాజప్రజాన్యాయ *నడవళ్ల చూచి
తేజంబు తండ్రికిఁ దెలియ కిట్లనియె :
*"మన యుత్తరపుగవని మార్గంబు మొదలు
పనుగొని వైపరీ*త్యము దోచె" ననిన
నాకుమారునికి నిట్లనియె నారాజు
"వీఁకమై భువనైక వీరమల్లుండు
ఢాకచే మనలపై దండెత్తినపుడు
పోకుండ రాజ్యంబు చేకొంటి మతని
కప్పుడు శ్రీరంగ మప్పచెలియలి
నొప్పించి యాయమ కిప్పించి నట్టి
యరణంబు భూమియు నట నుత్తరంబు
నరయంగ నిచ్చితి" మనిన నా తండ్రి
పలుకులు చెవులకుఁ జిలికిన పెద్ద
ములుకులై తాలిమి నలుకువలేక
పలక వ్రాతలఁదప్పుబడ్డదటంచు
నలుక గదురఁగ వేం*కటనాథుఁ డనియె
"అద్దిరా ! రాయసింహాసనస్థులకు
నుద్ది దానయ్యెనే యొక రాజవరుఁడు"
అనుచు నేనలతోడ ననుమకొండకును
ఘన నినదంబులుగా భేరివేసి
చెప్పఁ జూపఁగరాని *శౌర్యంబు లడర
ముప్పదాఱైనట్టి మొగి హయదళము
లక్షల సంఖ్యఁ దా నక్షయంబుగను
నాక్షణంబ వెడలె నన్మకొండకును
నక్కడ నంతట నా భువనైక
చక్కని మల్లుండు చారులచేత
నిక్కంబుగా నెర్గి యక్కజంబుగను

పెక్కు సేనలతోడఁ బెకలించుకొంచు
నతనిపై నడువఁబో నప్పుడు పుణ్య
సతులు రంగమదేవి పతి నివాళింప
వెతపడి కన్నీరు వెలఁది తా నించె
మతి నెర్గి భువనైక మల్లుఁ డిట్లనియె:
"అతివ నీ మదిలోని వెత తెల్పు" మనిన
గతియును మతియును బతి తన కనుచు
సతియు రంగమదేవి సౌభాగ్యవతియుఁ
బతితోడ ననియెఁ దానతిప్రేమమునను
"నరసింహరాయలు నన్నిచ్చునపుడు
నరమర లేకుండ నప్పు డయ్యగ్ని
సాక్షిగా స్వర్ణంబు సంపుటంబులను
నీ క్షితిమేఖల నిటు వ్రాసి మీరు
పేక్షించు ధర్మంబు పెంపుగాదనియు
వీక్షించి వేంకట విభునకుఁ బ్రాణ
హానియు మీకును నలరంగ వినుఁడి
ప్రాణేశ.........."యు నగు ననుచు
"కన్నీరునించితిఁ గాక తక్కనను
కన్నియలకు మాకుఁ గలవె చింతలును?"
ననుచు రంగమదేవి యాడు వాక్యములు
మనమున వినయసంభ్రమములు నిగుడఁ
గనుగొని కులకాంత కన్నీరు దుడిచి
"యేలనో బాల నీకీ లీల వగలఁ
జాలుమాలై మది జాలి నీకేల
ప్రాలు మాలి యసత్యపద్ధతిఁ గూలి
కాలుప్రోలికిఁ జనఁజాలునే ధర్మ
శీలుండు కీర్తివిశాలుండు ముక్తి

లోలుండు సారద*యా కృపాలుండు"
ననుచు మన్నించి తా నప్పుడే మగిడి
చని తాను సింహాస*నాసీనుఁడగుచు
నూహించి కార్యంబు నూహించి ధర్మ
మూహించి జగడంబు నూహించి బుధుల
రావించి కామించి *నేమించి యనియె
"మంచి మాటలఁ గార్యమగునట్టి నీతి
నంచించి చెప్పుఁడా యందఱు మీరు
కొంచింప" క న్ననుఁ గోవిదు లనిరి
"వారు వచ్చెడిదారి వారికి మనకు
*సరిహద్దు గ్రామముల్ సరి నగ్రహార
ములు విప్రజనులకు మునుకొనియియ్య
సరినేఁగి వారల సరగున నిటకు
నరుగకుండగఁ జేయ నరుగుదు" రనిన
నదరున నఔచేసి యా విప్రు చేరి
నెల్లూరివద్దను నిల్పిరాకుండ
మర్లునట్టుగఁజేయ మది నుత్సహించి
నరవరుఁ గాంచి "యో నరనాథచంద్ర
మఱతురె విప్రజ*నా భక్తి యను (చు) (?)
మా యగ్రహారముల్ మఱి నీకుఁ దగునె
నీ యనుగ్రహముగా నీతియే త్రొక్క
భూదేవ వృత్తులు పొసఁగునె చెఱచి
*యదయతఁ ద్రొక్కిన నతిపాప మంద్రు"
అని రాక యడ్డంగ నట నరికట్టు
కొనిన వెంకటనాథు కొమరొప్ప నిలిచి
నంత రంగమదేవు లతనికి గోప్య
*మంతరంగము తెలియనంపిన లేఖ

యంతయుఁ జూచియు సంతస మొదవ
మంతనంబునఁ జూచి మన్నించి వారి
నెంతయు బహుమానవంతులఁ జేసి
పంతంబుమీఱ నా బ్రాహ్మలఁ జూచి
"దేవ భూదేవ భూ*ములమీఁదఁ బోను
*త్రోవఁజూపఁగవలసి తోడ్తోన వారి
కెనిమిది లక్షల నెంచి స్వర్ణంబు
లనిమిషేశ్వరనిభుఁడైన యా రాజు
శ్రీరంగదేవినిఁ [1]జేరంగఁ బోవు
దోరంగ తన బుద్ధి *నప్పుడు పుట్టె
తన బలంబులఁ దాను దగ నమ్మకొండ
కును బోవునంతలోఁ గూర్మి దైవాఱ
భువనైక మల్లుండు పొసఁగంగ నెనిమి
దవు యోజనంబులు *నెదురుగా వచ్చి
వెలఁదితోఁగూడ నా వేంకటనాథుఁ
డలరంగఁ దోడ్కొని యనుమకొండకును
బోయి వేంకటనాథు భువనైకమల్లుఁ
డాయాస మార్గంబు లన్నియుఁ దీర్చి
పురము శృంగారించి భూ(తి) యెలర్ప
నఱలేక యాతని కతిప్రీతిఁ జేసి
వరవస్త్ర భూషణావళులు దా నిచ్చి
కరుణమీఱగఁ దన గాదిలిసుతకు
పాంచాలదేవికిఁ బతిఁగా నొనర్చి
యించువిల్తుఁడు రతి*యగును (?) వీరనఁగ
మంచి ముహూర్తాన మానితయశుఁడు
వేంకటనాథుకు *వైవాహికంబు

1. జారంగ

హొంకంబుగాఁ దనపుత్రి[1]తోఁజేసి
యరణంబు లొక కొన్ని *సవరణంబుగను
కరణాలఁ బిల్చి యాభరణమ్ము లెల్ల
భరణంబులందుంచి పరిణయ మెసఁగఁ
గరుణతో నారాజ కంఠీరవుండు
పాంచాలదేవికి భక్తితోడుతను
నెంచ మించగు రత్నకాంచనంబులను
కొండవీడును కొండపల్లి యాదిగను
మెండుగ రాజ్యముల్ మేదినీవిభుఁడు
దండి విదర్భదేశంబును నియ్య
నుండె మూణ్ణెలలును గొండొక తడవు
దండిగా నా యన్మకొండలోపలను
వేంకట నాథుండు వేడుకలమర
శంకలేకుండ నిశ్శంకుఁడై యతఁడు
నరపతి రాయల నాఖ్యతగలుగు
నిరవగు రాజ్యంబు నిజముగాఁ గట్టి
అల్లుర నాడు బి*ద్దను దగ ననిపి
సల్లీల సుఖముండె మల్లుఁ డంతటను.
భువనైక మల్లుండు భూమిఁదానేలి
భువనంబులందుఁ దాఁ బొగడితకెక్కె
[1]నెనుబదిరెండేండ్లు నేర్పాటుగాను
ఘనుఁడు రాజ్యంబేలి కడు వడి సుతునిఁ
బట్టంబు గట్టి దాఁ బరలోక మేఁగెఁ
బట్టి దాఁ బ్రావీణ్య ప్రాభవంబుగను.

1. దా;   1. ఇరువదియారేండ్లని ప్రశా. చ.

## త్రిభువనమల్లుఁడు

త్రిభువనమల్లుండు తేజంబు మీఱఁ
ద్రిభువనంబుల కీర్తి దీపితంబయ్యెఁ
గాకిత మహాదేవి కడు నొప్పఁ గొలిచి
*యొకసుతుఁ బడసె న*ద్దండ విక్రముని
నాదేవి నామంబునకుఁ బ్రోది గాఁగ
సాదె వేదముగాఁగ మేదిని మీఁదఁ
[1]గాగద ప్రోల్రాజుగా నామ మిడియె
సాగించె ధర్మంబు భోగించె సుఖము
అంతటఁ గటకంబునందు బల్లహుఁడు
పంత మెలర్పఁదా పరిదాన మిడక
వింత నున్నను వాని చెంతకు నేగి
వింతవింతల సేన లంతంతఁ గొలువ
నంత వానిని ద్రుంచి పంత మెలర్ప
సంతసంబున వాని సంభవు నచటి
పొంత నుంచియు వాని యంత బండరువు
మంతనంబిడక తా నంతయు దోఁచి
కంతు జయంత సంకాశుఁడై వచ్చి
సంతసంబున రాజ్యసంస్థితుండయ్యె
నటఁజని గంగా పు*రంబులోపలను
తటుకున కడమగాఁ దగు శివాలయము
లటు గట్టి సత్కీర్తియందు శోభిల్లి
[3]యెనుబదాఱేండ్లు దా నెన్నిక రాజ్య
విభవంబు వృత్తిధ*ర్మములును జరిపి
త్రిభువనమల్లుండు ధృతిమీఱఁగాను

2. కాకతియని కాఁబోలు; 3. డెబ్బదినాలుగు సంవత్సరములని ప్రతా. చ.

సభికు లౌననఁగఁ గా*కతి ప్రోలరాజు
కంత పట్టంబు దా నంతయుఁ గట్టి
త్రిభువనమల్లుండు దివి కేఁగె నంత.

## ప్రోలరాజు

సభవారు నందఱుఁ జని ప్రోలరాజు
*పిన్నగాన నతని బిరుదు మగలెల్ల
*సన్నన సన్ననఁ జని రతని విడిచి
మఱలఁ బడ్డట్టి యా మాట బల్లహుఁడు
చారులచే నెర్గి వారి వార్తలను
*పోరికిఁ దలకడచిపోయి ప్రోల్రాజు
గారి ముట్టడిచేసి పేరు దాఁ జెప్పి
*విశ్వనాథదేవ విభుదళవాయి
శశ్వత్తురంగముల్ చాల[1] యేనుఁగులు
*అనుమకొండమీఁద నటవిడిసి యాఁడఁ
బనుగొని పన్నెండు ఘనవర్షములును
ముట్టడంబులు చేయ[2] నట్టిట్టులనక
గట్టిసైన్యముగని గట్టిన సొమ్ము
పెద్ద తటాకంబు *గట్టించి పేరు
బెట్టె కన్నడ సము*ద్రంబన నదియుఁ
గాకతి ప్రోల్రాజు ఘను(ఁడు) దానేగి
తగువారి సామంతతతిని రావించి
యాప్తవర్గంబును నటలోన నునిచి
గుప్తమ్ముగా దిడ్డగొందుల వెడలి
విముఖులై యున్నట్టి వీరపుంగవుల

1. శావ; 2. శాయ.

సుముఖులుగాఁజేసి సొంపుదీపింపఁ
గటకంబుపైఁ బోయి కటకవల్లభుని
కటకంబు సాధించి కటకేంద్రుఁ ద్రుంచి
*వాని సుతునకుఁ గటకవాసంబు నిచ్చి
పూనిక స్వర్ణంబు బోరున రెండు
కోట్లద్రవ్యంబు(ను) గొని యన్మకొండఁ
బోట్లాడు దళవాయిఁ బూని[1]కఁ దఱిమి
తన పట్నమునకును దాఁ జొచ్చి వివిధ
ఘన వస్తుభూషణ కలితుఁ డౌచుండి
పృథివి పాలించుచుఁ బృథుశక్తి రాజ
కథలెల్ల వినుచును గడు సుఖంబుండె[2]
కడమైన గంగాపు*రంబున గుళ్ళు
కడమ గాకుండఁ దాఁగడు పూర్తి గట్టి
ఒక్క మహోన్నతం*బగు వాసుదేవ
చక్కనిమూర్తికి చన్నరాయనికి[3]
దేవాలయంబులు దేదీప్యముగను
*కవగూడగాఁ బ్రతి*ష్ఠలు చాలచేసి
తత్సమీపమున నీ*శాన్య భాగమున
కుత్సవంబు(గ) నొక్క కోనేరుగట్టి
యుండంగ నంతట నొకనాఁడు చూడ
దండిగా మునులు త్రిదండు లేతెంచి
రంత వారలఁజూచి యెంతొ వేడుకల
సంతసంబునను (దా) సత్కృతుల్ చేసి
పంతసంబున హిడింబాశ్రమ మహిమ
మంతయు నెఱిఁగియు నచటను గొన్ని
దేవాలయంబులు ధృతిమీఱఁ గట్టి
వావిరిరాజ్య వైభవములనుండె.

1. పోనిక; 2. సుఖంబుప్పై; 3. చెన్నరాయడు (చెన్నకేశవుడు) అయియుండును.

## స్పర్శవేది లింగవృత్తాంతము

నాసమయంబున నందలి ప్రజలు
గ్రాసార్థమై శ(క)*టంబులమీఁద
ధాన్యంబు దెచ్చుచుఁ దగ నాఁటి రాత్రి
మాన్యులు వృద్ధులు మఱి బహుజనులు
ననుమకొండకు రాఁగ నచటి కాగ్నేయ
మునను క్రోశద్వయమున నిర్నిమిత్త
మూఱకే శకటంబు నొరగల్లు వడియె
నారాత్రి శకటంబు నాగఁజాలకయు
చక్కఁజేయఁగ జాల*రైరి యొక్కెడను
నొక్క కమ్మి కనక మక్కజంబయ్యె
నక్కనకంబు దే నొక్కనికైన
వెక్కసంబుగఁ గొనఁ జిక్కగాకున్నఁ
జక్కనఁ బ్రోల్రాజు కక్కడి వార్త
చెప్ప నప్పుడె తర్లి సేనలుఁ దాను
నొప్పుగా నేతెంచి యొరగల్లు చూచి
యాశ్చర్యమునుబొంది యానందమంది
*వేశ్మంబులందున్న విప్రపుంగవులు
బంధుజనంబులుఁ బౌరు లమాత్య
సందోహములుఁ దాను చనుదెంచి చూచి
యిది యేమి చోద్యమో యెట దీని కాది
తుదయును మొదలును మదిఁ దోఁచదనుచుఁ
ద్రవ్వించి శోధించి తగపాలనంబు
లవ్విధంబులఁ జూడ నచట దేదీప
మాన తేజస్ఫూర్తి మహనీయ దిః
మాన శరచ్చంద్ర మందారకంద

సూన సితాంభోజ సుందరాపార
తారహార పటీర ధాళధళ్యప్ర[1]
*సార విస్ఫార కాం*తుల సరసమగుచు
దివ్యమంగళమూర్తి తేజఃప్రపూర్తి
నవ్యపాండురమూర్తి నా లింగమూర్తిఁ
బరుసవేది స్ఫూర్తి భక్తహితార్థి
సరసి తోడ్కొంచుఁబో నసుమకొండకును
దలఁచిన లింగంబు తఱలక యచట
నలరుచునుండఁగ నంత నుపాయ
మొక్కటి చింతించి చక్కని (రా)జు
పిక్కటిల్లిన మది నెక్కొల్పి ముదము
నక్కజంబుగ దావలెక్కంగ నపుడు
నెక్కున కాశేశ్వ*రావాసులైన
[2]రామరణ్యుల వేగ రావించి యతని
కా మహామహిమంబు నంతయుఁ జెప్పి
యాతని యనుమతి నాలింగమునకు
*మతిమీఱ గుళ్ళను మంటపంబులను
గట్టించి యక్కడ ఘనవైభవముగఁ
జుట్టుగాలింగముకుఁ జూడ యోజనము
గట్టిగాఁ బురమప్డు కట్టించి మధ్య
నొరగలుబడ్డ చో*టను నోరుగల్లు
కరమొప్పు నామంబు ఘనముగా దాని
కొనరించి కోటల కొగి ముగ్గువోసి
శాలివాహన శకవర్షముల్ తుదకు
తొలి తొంబనూటను తొమ్మిదౌ యేటి
కగు శుభకృన్నామ మగు వత్సరమున

1. ధాళవళ్యప్ర; 2. "రామారణ్య శ్రీపాదు" అని ప్రతా. చరి.

నగు కార్తికంబున నందలి శుక్ల
పక్షంబునందలి పరగంగ[1] విదియ
*నక్షయంబగు రోహిణందు శుభలగ్న
మందు వర్ధిల్లఁ(గా) నపుడు గట్టించెఁ
గందువలమరంగ ఘనుడు ప్రోల్రాజు
ఆ పట్టణము కభేద్యంబుగాఁ గోట
ఆపుగా రామరణ్యా(?) పాదు లపుడు
శ్రీదివ్యచక్రముచే యంత్రములను
..........................
రావిద్య(?) యంత్ర ప్ర*కారంబులకును
రేఖగాఁ జుట్టును లేఖ వ్రాయించి
లేఖప్రకారంబు లేఖలమరంగఁ
గట్టించి యందులో ఘనవిగ్రహములు
పెట్టి ప్రతిష్ఠలు పెంపుగాఁ జేసి
నట్టి దేవతలకు నామముల్ వినుఁడు
గట్టిగాఁ జెప్పెదఁ [2]గడఁకతో మీకు
ముక్తీశ్వరుండును మొగి విశ్వనాథు
వ్యక్తవిరూపాక్ష *వెసమల్లికార్జుఁ
డనఁగ రామేశుండు నట నీలకంఠుఁ
డనఁ బెక్కు దేవాలయముల ప్రతిష్ఠ
*చేయించి మించి శివాలయము [3]లేనూరు
*నయమొప్ప దేవి భవనంబు లేఁబదియు
నెనయ గణపతుల [4]కేఁబదిగుళ్ళు
ఘనవాసుదేవులకుఁ గడఁక మున్నూరు
భవనంబు లా వీరభద్రులకుఁ బది

1. పంచమీ గురువార మని ప్రతా. చరి.; 2. కణకుతో మీరు; 3. ఇన్నూట యేఁబ దని ప్రతా. చరి.; 4. నలువది యని ప్రతా. చరి.



నందీశ్వరుడు

అవి యాదిగాఁ గల్గునట్టి దేవాల
యంబులు గట్టించి యన్నిఁటి కుత్స
వంబులు సాగించి *రామరణ్య
శ్రీపాదుల యనుజ్ఞ శీఘ్రంబు వడసి
అయమయం(?) బగునట్టి యది లోహబార్వు
*మయ పరుసవేది లింగోపకరణ-
ములు నిడి నంతన మొగి స్వర్ణమయ్యె
కలిగె భాగ్యంబని కాకతి ప్రోల
రాజు దానెంతయు రామ అరణ్య(?)
భోజు పాదములకు భువిఁ జాఁగి మ్రొక్కి
బారువ స్వర్ణంబు పంచిపెట్టించె
బారువ సంఖ్య యేర్పఱపు మటన్న
రామరణ్యులవారు రంజిల్లి యనిరి
"కాకతిప్రోల్రాజ ! కనకబారువకు
వే*గంబసంఖ్యఁ దా వివరింతు వినుము
నూటయిర్వది గుంజ *లొాక యెత్తు తులము
*నిటు తులంబులు నూట యిరువదిగూడ
నొకవీసె యనఁబడు నొకనూటయిరువ
దేక వీసెలుగూడ నిడుదురు బారు
వన నొప్పునని చెప్పి యంతట రామ
ర*ణ్యపాదులు చని రటవులు దాటి
కాశేశ్వరంబుకు ఘనుఁడంతలోనఁ
గాశేశ్వరాశ్రమ కలితులై యుండ్రి
కాకత ప్రోల్రాజు ఘనుఁడు నిత్యంబు
లోహబారువదెచ్చి లోహోపకరణ
మూహచేఁ బూజల నొగిఁ జేయు నపుడు
నది సువర్ణంబైన నా ద్రవ్య మంత

సదయుడై బ్రాహ్మల సద్వ్యయమునకుఁ
జేయుచునుండంగఁ జేజేతనొక్క-
వేయిగన్నులు గల వేల్పును బోలి
సుతుఁ డుదయించెను సూనృతాచార
నీతుండు పుట్టిన నేతలందఱును
ఘాత నక్షత్రంబు హేతువు మృతికి
భాతి భూపాలుండు నీతనిచేత
హేతువున్నది చావ నీతని విడిచి
ప్రీతుండవగుమను ఘాతుమాటలకు
*నాతత బహు వ్యథోపేతులై సతియుఁ
బతియును నారేయి వెతలఁ బొర్లుచును
నతి స్వయంభూదేవు పతి ముఖంబునను
గతి నీవె సుతుకని వెత మది మాని
సతి పతు లిద్దరు సుతు నటఁ బెట్టి
కతకత బడుచును గదలి యింటికిని
జని రెవ్వ తెఱుఁగకుండ నివాసమునకుఁ
జనిరంతఁ దెల్లవాఱిన నటవారు
కనిరి కావలివారు ఘనరాజసుతుని
విని యెఱుంగము నిది విస్మయంబనుచుఁ
జని రాజుతోఁ జెప్పఁ జని వారితోడ
విని యేగి రాజు దా విహ్వలుండగుచుఁ
దానును బురజనుల్ తగువారు శిశువు
మాను(గాఁ) జూచి తా మది జాలిఁ బొంది
పెద్ద [1]పూజారికిఁ [2]బెద్దగాఁ జెప్పె :
ముద్దు బాలుని మీరు మొగిఁబెంచుఁ డితఁడు
పెద్ద పోకొం...ప్రియము నందఱకు

1. పూజారిపేరు "రుద్రజీయ్య" యని ప్రతా. చరి.; 2. బిహద్దుగా జెప్ప.

భద్రగుణంబులు పరఁగు సీతనికి
రుద్రనామము కడు..............."
.........అతని బూజారి తనదు
దార కప్పనచేసి దయదలిర్పగను
పెనుచుచుండఁగ నంత ప్రియమెలర్పఁగను
జనఁ గొన్ని వర్షముల్ చనఁగ రుద్రునకుఁ
బూజారి రాజసమ్ముఖముకు వచ్చి
భోజుఁడై కొలువున్న ప్రోల్రాజుఁ జూచి
"దేవర దయచేయు చిన్నిబాలునకు
వావిరి నుపనయవర్షముల్ మీఱె"
నని చెప్పనంతలో నబ్బాలునకును
బనియంతయును శోభ*న ప్రయత్నముకు
సకల వస్తువు లీయ సంభ్రమంబుగను
అకలంకముగఁ జేసిరప్పుడు వడుగు
నది యాదిగా విద్యలన్నియుఁ జెప్పి
పదపడి బహుశాస్త్రపద్ధతుల్ రాజ
నీతియు రీతియు భాతిగాఁ జెప్ప
పీతిహోత్రునిరీతి వెసను నానాఁటి
కాతతనవయౌవనాగమంబునను
బ్రీతితో నుండంగఁ బిలిచి ప్రోల్రాజు
ఇన్నాట యరువది యేర్పడ భటుల
క్రన్నన నాయక*త్వం బొప్పఁజేసి
లింగంబుఁ గావఁ దన కంగంబుగాఁగ
వెంగలు లెవ్వరే దొంగిల నుత్త
మాంగంబు తెగవ్రేయుమట్ల మీఱకను
*సంగతి నుండుమని చనియు నింటికిని
ఒరులెవ్వరును జొఱకుండంగ నాజ్ఞ

పరగున దయచేసి చని పరుసవేది
లింగంబు గావంగ నింగితంబుగను
సంగతి నుండుచుఁ జనువుతోడుతను
నతని యాజ్ఞను దానునటఁ దలమోచి
యతిహితంబుగనుండె నా రుద్రుఁ డంత

మరియును బ్రోల్రాజు మహిత యశుండు
పుత్రునిఁగనియెను బూతచరితుఁడు
*ఆతనికి మహదేవుఁ డను నామ మిడియె
ఆ మహాదేవుని యంగంబునందు
కామహాశ్వేతరోగం బుద్భవించె
"మేనెల్ల నిండిన మానంబు దూలి
దానంబులనుగాని తగు శాంతి గాదు
శ్వేతంబు కర్మనిపాతంబుగాఁగ
మాతోడఁ జెప్పఁడా మాన్యులు బుధులు"
అని యడ్గు బ్రోల్రాజు కావిప్రవరులు
కడు విచారించి తత్కార్యంబునకును
నుడివి చెప్పిరి దానిఁ గడఁకఁ దెలియఁగఁ
"దిలపర్వతంబుకుఁ దిలలై దుపుట్లు
పోలంగఁ గుప్పగాఁ బోయించి దాని
మీఁద స్వర్ణంబు దామించి కుందనము
తో దర్ప(ణ)ద్యుతిఁ దోచు నొక ప్రతిమఁ
గావించి పద్రెండు ఘనమైన మణులు
లావెత్తు తూనిక లావులఁజేసి
అష్ట భుజాశక్తి నందున నిల్పి
పుష్పదక్షిణకును బొందుగా నపుడు
ఐదు లక్షల మాడ లష్టు నేమించి

పైడితోఁ గూడిన బంగారు ప్రతిమ
దానంబు పట్టను దగిన బ్రాహ్మణుఁడు
మానంబుఁ జెప్పెద మహి మీరు వినుఁడు
మున్నెన్నడును దాన మన్నది యెఱుఁగ
నన్న బ్రాహ్మణు డయా*చితుఁడు గావలయు
నందఱు నీచేత ముందుగా దాన
మొందినవారెకా యెందెందుఁ జూడ
మెందుల నీభూమి నెందుఁ జూచినను
నందచందంబులనగు బ్రాహ్మణుండు
వేదపారకుఁడును వినయ విధేయు
పేదకుటుంబంబు సాదంగలేని
పుత్రవంతుండును పాత్రుండు నియమ
శ్రోత్రియుండు యజన సూత్రిత నిత్య
వైశ్వదేవుండును వరదానశాంతుఁ
డీర్ష్యంబు(?) మనమున నించుకేనియును
లేనట్టి బ్రాహ్మఁడు గానట్టివానిఁ
గానట్టుగాఁ జూచి *తాఁబట్టుమనుఁడు"
అనుచు కోవిదులెల్ల నా ప్రోలరాజుఁ
గనుచుఁ జెప్పినఁ జాల కలకలపడుచు
ఇట్టి బ్రాహ్మఁడు తన కేరీతిఁ గలుగు
నట్టి మార్గము చెప్పునట్టివారలును
గలుగుదురోయని కలకపడంగఁ
బలికెఁ బురోహిత బ్రాహ్మణుఁ డపుడు
మన పురిలో మున *వాడ[1]కట్టునను
నెప్పుడు యాయవా*ర స్వరూపమున
జన్మావధిని దానకర్మ మెన్నఁడును

1. వాడకట్టమును.

తన్మనంబునయందుఁ దలఁపఁ డెన్నఁడును
పరధన స్త్రీలను బాటించి చూడఁ
డరలక చేయును నాతిథ్యపూజ
దూది కేశవుఁడను దుగ్ధవారాశి
కాది సంపూర్ణ క*ళా శశాంకుండు
పాత్రుండు దాన సత్పాత్రుండు విమల
గాత్రుండు షట్కర్మ కలిత వర్తనుఁడు
*అతఁడు వైశ్వదేవ మటుచేయు నెడను
నతఁడు బలిహరణ మటు చేయువేళ
సతిపతు లిద్దఱుఁ జని పుత్రభిక్ష
గతి మాలి వేడినఁగాని పట్టండు"
అని చెప్పఁ దానంత నటఁ బ్రోలరాజు
చనె సతితోఁగూడఁ జని కాలమందు
నతి శుచిర్భూతులై పతియును సతియు
మతిమీఱఁగా నమస్కా*రంబుచేసి
"పుత్రభిక్ష"ంబని పొసఁగ నడిగిన
నార్తులఁ జూచి తాఁ బ్రార్థితుం డగుచు
దానంబుఁ దానది తగ గ్రహించినను
మానసాంతఃకర్ణ(?) మతిమీఱరాజు
గారి కుమారుకు సార విస్ఫార
పూరంబుగాఁ (?)దేజ సారంబు గలిగి
శ్వేతరోగంబు నిపాతమై ఖ్యాతి
భాతిగా గాత్రసంపూతమై దాన
హేతువై దూదికే*శవు ప్రతిగ్రహమ్ము
ఘాతవిఘాతమై శ్వేతమణంచె.

నాబ్రాహ్మణుండంత నాక్షణంబునను
తా బ్రహ్మరాక్షసత్వంబును నొంది

నంత ప్రోల్రా జంత నెంతయు నెఱిఁగి
యంతయుఁ బ్రియమున నాతని సుతుకుఁ
బంతంబుమీఱఁ దాఁ గొంత ద్రవ్యంబు
బంతసంబున నిచ్చి సాయముగాఁగ
మూఁడువేలును బ్రహ్మ మునిపుంగవులకు
నాడ ప్రాయశ్చిత్త మాతని కొఱకు
ముప్పది లక్షల మొగి సువర్ణంబు
తెప్పతేలఁగనిచ్చి యొప్పనచేసి
వారణాసికిఁ బంప వారును బోయి
వారని ధర్మంబు వరుసఁ గావింప
దూదికేశవుఁడును దుష్టదానంబు
లాదిగాఁగల్గు మహాపాతకములఁ
బాసి ముక్తుండయి పరలోక మేగె.

కాకతిప్రోల్రాజు ఘనవైభవమున
సాగించి రాజ్యము సామ్రాజ్య మవని
భోగించి యొకనాఁడు పౌరిని నా పరుస
వేదిలింగంబున కాదిషట్కాల
మాది పూజాపరుఁ డగుఁగాన నాఁటి
రాతిరి శివదర్శ*నార్థ మేతెంచి
మిత పరిజనులతో మిన్నక శివుని
నగరిలోఁ జొరఁబోయె నందఱ నునిచి
తగను దానొక్కఁడె తగ గర్భ గృహము
లోనికిఁ జనుదెంచి పూనినభక్తిఁ
గానక ద్వారంబుకడ నిద్రనున్న
తన కుమారుని రుద్రుఁ దాఁ జూచి మోహ
మెనయంగ నాతనికిని నిద్ర భంగ

మని మాటలాడక నటరాఁగ నతనిఁ
దన బొటమనవ్రేలు తాఁకిన నులికి
పడిలేచి మ్రుచ్చంచు పట్టి యారాజుఁ
బొడిచి వాఁడంతట భూవరుఁడనుచు
నడిచిపడుచు "జియ్యా నాది తప్పు"నుచుఁ
జిడిముడిపడుచును జేతికఠార
మది తీయఁబో రాజు మదిఁ దీయ మెసఁగ
నదవదపడకను మదిఁ గుమారకునిఁ
గదియ నక్కునఁ జేర్చి "కారణం బిదియ
తుడిగనున్నది నాకు మది వగ దగదు"
అని పుత్రు నూరార్చి యా కఠారంబుఁ
గనుఁగొని తీయంగఁ గాదని హితుల
బంధుల మంత్రులఁ బరివారములను
గ్రంథార్థసారులౌ బ్రాహ్మణవరుల
రావించి వారల సేవించి సుతుఁడు
*గావించినట్టి తన కారణం బంత
తన పూర్వమంతయుఁ దాఁచక చెప్పి
వినయంబుతో రుద్రవిభు డాయఁదిగిచి
రుద్రదేవుని రాజ్యభద్ర పీఠమున
ముద్రి కిచ్చియు పట్టభద్రుగాఁ జేసి
మూఁడు దినంబులు మొగి గుడిలోన
వేడుకతోనుండి విభుఁడు కైలాస
వాసుఁ డయ్యెను మదిఁ బ్రీతి యెసంగ
డెబ్బది మూడేండ్లు* తేకువ మీఱ
నిబ్బరంబుగ రాజ్యనీతిమార్గమునఁ
గాగిత ప్రోల్రాజు ఘనవైభవమ్ము
సాగంగఁ దా భూమి సామ్రాజ్యమేలె.

# రుద్రదేవుఁడు

రుద్రదేవుండంత రూఢిగాఁ బ్రజల
భద్రంబుగా రాజ్యపరిపాలనంబు
సేయుచు నిబ్బంగి శివమహోత్సవము
లాయుతంబుగ నైనవోలునఁ బ్రీతి
మైలారుదేవుకు మహనీయముగను
వేలార్లు ఖర్చించి వేయించి గుళ్ళ
నొడ్డపల్లిని గుడి నొనరంగఁగట్టి
*బుద్ధన గణపతి *సరసత నిలిపి
మొగిలిచెర్లను దగ నొగ మహాశక్తి
*దేవికి గుడిగట్టి...............
పూజనోత్సవములు పొలుపుగా నడిపి
రాజితంబుగఁ దన్ను రాజరాజనఁగ
రాజుల గెలిచియుఁ దేజంబుమీఱ
భోజుఁడై యోర్గంటి పురముఁ దానేలె
*తనకు మర్లగఁబడ్డఁ దాఁ గటకభల్లు
వెనుకొని కటకంబుఁ వెసఁగాల్చి యతని
తలద్రుంచి కటకంబుఁ దగవాని సుతుని
నలవడఁ బట్టంబు నప్పుడు గట్టి
వానిచే నెప్పటి వరుసను ధనము
దానొప్పఁ గొనివచ్చి తగ నోరుగంటి
శ్రీలుగా రాజ్యంబు సేయుచున్నంత
నజయుఁడై [1]యె(రు)కు దే*వన మర్లఁబడిన
వానిమీదట దండు పంపి రుద్రుండు
వాని సాధించియు వానిచేఁ గొన్ని

1. ఇది ప్రతా. చరి. లో లేదు.

యప్పనంబులు గొని యఁట [1]వెలనాటి
గొప్ప పృథ్వీశుల నొప్పించి వారి
యప్పనంబులుగొని యటఁ జని వారి
కొప్పిన గింగి భై*రవుల వరాహ
లాంఛనంబులఁ గొని మ్లేంఛుల గెలిచి
వాంఛతోఁ బురమును వడినేఁ గుదెంచి
తండ్రిఁ బొడ్చిన వగ తన మనమందు
మేండ్రింప దోషంబు తీండ్రింప నతఁడు
విద్వాంసులగువారి వేగ రావించి
*"సద్య(?)దోషంబు లేవిద్యలఁ బాయు
బుధ్యజేయులు మీరు విద్యలేర్పఱచి
మిథ్యకాకుండ నా *బుద్ధి కలరంగ
చోద్యతఁ జెప్పుఁ డు*పాధ్యాయులార !"
అని యిట్లు రుద్రదేవుని ప్రశ్నమునకుఁ
గనుఁగొని పండితుల్ కరమొప్ప ననిరి
*"కర్మ మనుభవమునఁగాని తెగ దెందుఁ
గర్మంబు దేహికిఁ గారణం బెందు
కర్మంబు దెగును పా*యంబొండు కలదు
కర్మ సంహారుఁ డాదికర్త శివుండు
నిర్మలుఁ గొలువక దుర్మల దుష్ట
కర్మ పురాతన కర్మేంధనములు
నిర్మూల దాహకు నిశ్చలుఁ గొలుచు
కర్మక్షయులు భక్తగణ్యులకెల్ల
వర్మంబు శివభక్తి వరుసతో" ననిన
"కర్మంబు లోపలఁ గడు జన హంత
కర్మంబు నే క్రియఁ గాల్చు నా కర్మ

1. "వలహాటపృథ్వీశ్వరులపై" నని ప్రతా. చరి.

ధర్మంబుఁ జెప్పరే నిర్మలులార!
మర్మంబు లేల నా మది కలరంగ
నిర్మల పథమున నెలవగునట్టి
ధర్మంబుఁ జెప్పరే ధర్మజ్ఞులార"
అని యడ్గు నాతని కనిరి సద్ద్విజులు
"విను రుద్రదేవర విశదంబుగాను
కర్మపదార్థముల్ గలవు పెక్కులుగఁ
గర్మంబు ముంచును గడు పెక్కు గతుల
ననుభవింపగఁజేయు నది తప్ప దెందు
నైనను దత్కాలమగు శాంతి వినుఁడు
దివ్యదేశంబుల దివ్యలింగముల
దివ్యనదులఁ గల (తీర్థ)ముల్ దెచ్చి
*పంచామృతంబులఁ బరఁగ నభిషేక
మెంచఁగా శివుఁ జేయ నేఁగు దురితంబు"
లనుచుఁ జెప్పిన రుద్రుఁ డతిభక్తి మ్రొక్కి
మనమునఁ దలపోసి మఱి కొంతవడికి
నూర్వురు బ్రాహ్మల వేర్వేర పిలిచి
సర్వసౌభాగ్యంబు సంప్రీతి నిచ్చి
కాశికిఁ బంపించఁ గాశివిశ్వేశు
వాసి గంగాంబులఁ జేసి మజ్జనము
రోసి పాపము లటుఁ బాసి చనంగఁ
జేసి నైవేద్యంబుఁ జేసి తర్పణముఁ
జేసిరి పితృ సమ*ర్పణముగా ద్విజులు.

మఱియును శ్రీశైల మల్లికార్జునుని
నఱిమిఱి దర్శించి యటఁ దులాపురుష
మరుదుగాఁ బది దూఁగి మగి డేఁగుదెంచి

దోష విముక్తి నిశ్శేషంబుగాఁగఁ
బోషించు బహుకుటుంబుల బ్రాహ్మణులను
మఱియుఁ బాపంబులు మడిసెడి కొఱకు
సరగునఁ జేసెను సరి శివాలయము
లేకశిలానగరీలలామమున
వీఁక దోషంబుల తా కు చెడునటు
లెనిమిదికోటుల నెన్నఁబడంగ
మునుకొని ముప్పదె*న్మిదిలక్ష (లైన)
ద్రవ్యంబు వెచ్చించి తగులింగములకు
నిత్య సహస్ర సం*ఖ్యల శివాలయము
కట్టించి గోపురా*లెత్తించి చాల
పెట్టించె ప్రాకార బృందముల్ చుట్టు
నయిదుకోటుల నెన్మి దమరంగ లక్ష
లయిన లెక్కకు స్వర్ణ మవలీల వ్రయము
గావించి తామించి [1]క్రతుచతుర్ముఖము
*ల (ందు) గణపేశ్వరులకు శివాలయము
లావలఁ గట్టించె నా యోరుగంట
నటఁ ద్రికూటంబుగా నా యన్మకొండ
నట యుత్తరంబున నవలీలగాను
*రుద్రేశ్వరుండన రూఢిఁ దనపేర
రుద్రేశు గుడికట్టి రూఢిఁ గోనేరు
భద్రయ్య గుట్టయుఁ బ్రహరి కోటయును
దోర(ణ)స్తంభముల్ తోడ్తోన నెత్తి
*యారయ నానగరి కతిభక్తి వెచ్చ
మునకు నెన్నదినాల్గు మొగి గ్రామములను
ననయంబు నిత్యోత్స*వానికి నిచ్చి

1. గతుచతుర్ముఖము.

సకల దేశంబులు సరవితో గెల్చి
ప్రకటమౌ[1] నోర్గల్లు పట్టణమునకు
వాడలు గట్టించి వాడలజాడ
వాడలు చెన్నొంద మేడలుగట్టి
మేడల మెలఁగెడి చేడెల కాంతు
లాడఁబర్వగ సాటి పోడుముల్ చూడ
వేడుకల్ మదిఁ దొలుకాడంగ రుద్ర
దేవుఁడుండెను మణి దేదీప్యమాన
మౌ రత్న సింహాస నాసీనుఁడగుచు
నుండంగ నంతట నొక కొన్ని దినము
లొండొండు చనిపోవుచుండంగ నంత
మరువుపెట్టుచుఁ గొంత మహదేవరాజుఁ
దమ్ముని నెంతయు నమ్మక రుద్రుఁ
డిమ్ముల నాతఁడు నెంతజేసినను
*వాని దుర్మంత్రముల్ వాని నడవళ్ళు
వాని తంత్రంబులు వరుసతో నెఱిఁగి
మంత్రుల నందఱ మానుగఁ బిలిచి
తంత్రముల్ చూడుఁడు తమ్ముని ననుచు
నాఁకఁ బెట్టించెఁ దామూఁకలఁ గూడి
జోకతో రాజ్యము సుముఖుడై యుండె
నంత రుద్రుండును నెంతయుఁ బుత్ర
వంతుండఁగానైతి నంత నేననుచుఁ
జింతచే నుండియు శ్రీశైలమునకు
నంత నా మఠపతు లగువారిఁ జేరి
చింత నెంతయుఁ దన చింతఁ జెప్పుచును
నంతయు వారికి హర్షమింపొందఁ

1. ముగ నేకశిల.

గొంత పర్వముచేసికొని వారిచేత
సంతసంబున వారి సకలోపదేశ
ముననుండి కొన్నాళ్ళు మూల విగ్రహము
కనుగొని లింగంబుఁ గడు ప్రేమతోడ
దర్శించి తా గంగ *స్నానంబుచేసె
హర్షించి యక్కడ నటఁ బదివేల
మతపతులందఱు మన్నింప సర్వ
మతపతులకు మ్రొక్కి మానుగా వారి
తత్ప్రసాదంబునఁ దగ నొక సుతుని
క్షిప్రంబుగాఁ గని *తేజంబు మీఱ
గణప్రసాదంబునఁ గలిగిన సుతుని
గణపతి నామంబు ఘనముగాఁ బెట్టె
తూర్పుదేశం బేఁగి తూర్పు రాజులను
నేర్పుగా సాధించి యోర్పుమీఱఁగను
బాండ్యదేశాధీశు ...............
.........................లాది
కొండబు లనువాని గండడఁగించి
చండ విక్రమకళాసార దుర్వార
*పాండిత్య ధనుకాళభ [1]ప్రతా(ప) రుద్రుఁ(?)
బాండ్యరాజ కుమారుఁ బట్టంబుగట్టి
కండగర్వ మణంచి కప్పముల్ గొనియె
నటఁజని రామేశ్వ*రంబున కరిగి
తటుకున నాతఁడు ధనుకోటి(?) మునిగె
నచట నెన్మిదితులా నవపురుషములు
పచరించి తూఁగియు భవుఁ గొల్చి రుద్రుఁ
డతులితగతిఁ దాను నటఁ దిర్గివచ్చి

1. ప్రతా. చరి. లో పేరులేదు.

*కాంతతోఁ దనమదిఁ *బ్రీతితో విమల
ఘాతతోఁ జయలక్ష్మిఁ గైకొని పురము
నాతఁడ(?) జొచ్చి రాజ్యము సేయుచుండె
తన తమ్ముఁ డగువాఁడు ధాత్రీవిభుండు
మహాదేవరరాజంత మతి చింత నంత
[1]సహజంబుగాఁ గొంత సైన్యంబుఁ గూర్చి
రుద్రదేవరరాజు రౌద్రత్వ మెసఁగ
*భద్రమూర్తినిఁ జంపి ప్రభుత తనకెక్క
[2]డెబ్బదెనిమిదేండ్లు నిబ్బరంబుగను
గబ్బున నేలె నా కాకతరుద్రుఁ

## మహాదేవరాజు

దన్నను జంపియు నా మహాదేవుఁ
డెన్నిక రాజ్యంబు నేలంగఁ దలప
సామంతు లెంతయు సకలంబు నెఱిఁగి
స్వామిద్రోహం బిది చర్చించిచూడ
వీఁడు రాజ్యమునకు విహితుండుగాఁడు
వీఁడు రాజ్యము సేయ వీనికి మనకుఁ
గూడదు పట్నంబు పాడుచేసెదము
నే మొల్ల మనఁ జాల నిష్ఠురపడుచుఁ
గామాభిలాషలు గాదనునంత
సిగ్గంది తనలోన నగ్గలంబుగను
బ్రుగ్గిబ్రుందుచుఁ దానె యెగ్గులఁ బొర్ల
రాణువ కనుఁగొని మేదినిమీఁద
నాణెంబు గాదు [3]నన్యాయంబు దీని

1. సాహాయంబుగ; 2. శా. శ. ౧౦౭౪ నుండి ౧౧౪౨ వఱకని ప్రతా. చరి.

కీయకొనమనుచుఁ దీయమెసగఁగ
వేయేల వీనిని గుట్టాడకుండ
భ్రాతృద్రోహిని వీనిఁబట్టి చంపినను
ఘాతలేదని బుద్ధి నేత లందఱును
ఒక్క కుత్తుకగాఁగ నొగిఁ బల్కినంతఁ
"ఇక్క గణపతికి *స్వరాజ్యమిచ్చి
*యువరాజ్య పట్టంబు నొగిఁదనకుఁ గట్టు
డవలఁ జూతురుగాని యందఱు నన్న"
నని పల్కినంతలో నందఱు నట్ల
సనిరి పట్టముగట్ట సకల సామంత
వితతి సంతోషించె వీడెల్లఁ బొంగె
మతిమీఱ నంతట మహాదేవరాజు
మూఁడేండ్ల రాజ్యంబు మొగిపాలనంబు
*[1]నాణ్యంబుగాఁజేసి యట దేవగిరికి
దండెత్త నెంతయుఁ దగ గణపతియు
మెండుగా మహాదేవ మేదినీ విభుఁడు
సకల సేనలుఁ దాను సంభ్రమంబునను
నొక [2]మూఁడుమాసంబులొగి యుద్ధమతుల
గతులఁ జేసిరి సారమతు లగ్గలింప
పతులు రాజ్య వివేకమతులు దా కాంక్ష
గతులచే గజయూథ తతులచే నొచ్చి
యతులిత హ (తి) చే మహాదేవవిభుఁడు
గతిఁబొందె నంతట గణపతిరాజు
అతి క్రోధ మానాగ్రహములు నెసంగ
పొసఁగజేసెను యుద్ధ మెసక మెసంగఁ
గసటులేనటు చంద్రకళలు నుప్పొంగ

1. శా. శ. ౧౦౫౨-౧౦౫౯ వరకని ప్రతా. చరి.; 2. "మాసద్వయం"బని ప్రతా. చరి.

పసచెడి పాఱంగ బలములతోడ
నసువులఁబాపెఁ దా మసలక రాజు
నెసగంగఁ జంపెను నసమంబుతోడ
వెస దేవగిరిరాజు....లపుడు
[1]పసగల కట్నాలు పద్మరాగములు
వెస నాణిముత్యాల వేల హారములు
తమతమ జనగూడ(?) తగు కానుకలున
నమరంగ రుద్రమ్మ యను కన్య నిచ్చి
గణపతిరాజుకుఁ గల్యాణ మపుడు
గణన కెక్కఁగఁ జేయ కదలిరా నంత
నేకశిలాపుర మేపారఁజొచ్చి
ప్రాకటంబుగఁ బట్టభద్రుఁడై యుండె.

## గణపతిదేవరాజు

అంతట నోర్గంటి కపుడును శైల
ప్రాంతంబు శిలలను బగులవేయించి
కోట కలరంబులు(?) కొత్తడంబులును
వాటంబుగా రాతికోటఁ బెట్టించె.
చేయగాఁ గడమైన శివమందిరములు
వేలార్లు ఖర్చించి వేగఁ బెట్టించి
యారీతి గణపతి యా మహారాజు
సార దయారస హారి మానసుఁడు
మీఱి ధర్మంబులు మితిమేఱ లేక
[3]పూరిరిచి (న్యాయంబు) భూపతులెల్ల
సారె సారెకు (తన్ను సన్నుతుల్) నేయ

1. పణని కట్నంబులు; 2. పట్టబంధుడై; 3. పూజించి.

సార పారావార సరస గంభీర
సారుఁడై కీర్తి విస్తారుఁడై యలరు.

తిక్కన సోమయాజి రాక

ఆరీతి గణపతి నటుఁజూచు వేడ్కఁ
దిక్కన సోముఁడు నక్క డేతెంచె
నొక్కొక్క పండితుల్(?) వక్కలాకులును
జక్కని తాంబూల (సమితుల తోడ)
నొక్క పెట్టునరాఁగ నక్కజంబుగను
దిక్కుదిక్కులనుండి* [1]వెలలి విద్యార్థు
లక్కడనక్క(డ) *కావ్య [2]శ్లోకార్థ
మొక్కొక్క విధమున నొగి వినిపింపఁ
జక్కన వినుచును [3]మిక్కిలందలము
నెక్కి తిక్కనసోముఁ డక్కడేతెంచె
నారీతిగా సోమయాజులరాక
వారక తా ఫణిహారు లేర్పఱుప
గణపతి మహరాజుగా రెదుర్కొనిరి
*పణవ శంఖ మామి (?) పటహ కాహళలు
వరుసతో వాద్య వి*రావంబులొలయ
భారతశాస్త్ర ప్ర*వీణాగ్రగణ్యుఁ
డారీతి వేదశాస్త్రాభ్యాసవిదుఁడు
చాల విద్యావిద్య(?) జాలంబులెల్ల
పాలు నీరేర్పఱుపఁ(గల) హంసుండు
నట్టి మహాత్ముని నా సోమయాజి
నెట్టన నెదురేగి నేర్పుగా రాజు
తెచ్చి యర్ఘాసన స్థితునిగాఁజేసి

1. వెలది విద్యార్థు; 2. శ్లోకార్థ; 3. మిక్కుదందలము.

మెచ్చి తాంబూలాదు లెచ్చుగా నిచ్చి
నవ్యసుగంధ మా*ల్యానుయుక్తుఁ(డుగ)
దివ్యవస్త్రచ్ఛన్నభవ్యుగాఁ జేసి
పూజించి యందఱఁ బూర్వోక్తముగను
యోజించి శాస్త్రంబు లొకకొన్ని వినుచుఁ
గొన్ని దినంబులు మన్నన నుండె
తిక్కన సోమయా*జులు నక్కజముగ
పెక్కులుగాఁ జెప్పె నొక్కొక్క యర్థ(?)
ద్వైత మద్వైత ముత్త(మ) జీవద్వైవ
మతి చిద్వివేకంబులగు ధర్మ మర్మ
మగు రాజనీతియు నటఁ బురాతనుల
కగు [1]భారతాఖ్యాన మా వీరవరులు
తగఁజేయు యుద్ధప్ర*కార పర్వములు
వినియు సంతోషించెఁ గనినట్లు చెప్ప
మనుచుచుండెను రాజ్యమహిమలఁ దనరి
యట నన్మకొండలో నతి బౌద్ధమతము
ఘటనగా వాదంబు కావలె ననుచు
బౌద్ధులు తమమతప్రావీణ్యశాస్త్ర
*వృద్ధులు, పాపసమృద్ధులు, వేద వి
రుద్ధులు వాదసమృద్ధులు జైన
బౌద్ధులఁ బిలిపించి పట్టి వాదించి
యోడించె శాస్త్రార్థ పోడిమిగాఁగ
వాడిమి నితిహాస వరశాస్త్ర వేద
పార ముఖస్థ సి*ద్ధాంత ప్రయుక్తి
నారీతి నోడించి యావసదులెల్లఁ
గూలఁ ద్రోయించియుఁ గూడ నాద్వైవ

1. భారతాది కథనమునుగూర్చిన యంశములు ప్రతా. చరి. లో లేవు.

ముల నామమంతయు మునుముట్ట నణఁచి
నామంబు లణఁచియు సీమ వెళ్ళఁగను
దోమలఁగాఁజేసి తోలె వెళ్ళఁగను
ముప్పదాఱైనట్టి మునిజైన వసతు
లొప్పగాఁ గూలద్రో*యించి నఱికించి
యందఱ జైనుల నటుఁ జంపి చెండి
చిందరవందర చేసి చక్కాడె
సోమయాజులవారు సురుచిరోద్దండ
భీమ పరాక్రమ బిరుదు లొప్పార
నంతఁ దిక్కన సోమయాజికి మెచ్చి
వింత వస్త్రంబులు వివిధ భూషణము
లత్యంత ప్రీతితో నప్పు డిచ్చుడును
సత్యసంధుండును, సత్యవర్తనుఁడు
నగు సోమయాజి దానా రాజుకనియె :
తగుమాట వినుమొండు ధర్మకార్యంబు
సూర్యవంశంబున సొబగొందునట్టి
యార్యపూజితవర్యుఁడా మన్మసిద్ధి
రాజు దానెల్లూరు రమణతో నేల
నక్కన బయ్యన లధిక బలిష్ఠు
లక్కడ సిద్ధిరా*జును బాఱఁద్రోలి
చక్కన రాజ్యంబు * దా నేలుచుండె
నొక్కఁ క్కానైనను జక్కన నీఁడు
[1]వారల దండించి వారి నెల్లూరు
వారి కిప్పించు మవారిత ప్రీతి
నన గణపతిరాజు లట్ల కాకనుచుఁ
జని సవాలక్షయు సద్రవ్యహేమ

1. గణపతిదేవుని నక్కన బయ్యనలను జయింపుమని తిక్కన యడిగినట్లుప్రతా. చరి.లో లేదు.

నిష్కముల్ వెచ్చించి నెఱమించు యజ్ఞ
శుష్కంబు పుటములు సొబఁగొంది మీఱు
యజ్ఞకుండలములు నతని కర్పింప
*తిగ్మాంశుతేజుఁడై తేజరిల్లుచును
నా గణపతిరాజు ననుమతి వడసి
వేగ రాఁబోవుచు, వేద వేదాంగ
పాఠక పరమార్థ భవ్యతత్త్వార్థ
*పఠన చిద్విజ్ఞాన బాదరాయణుఁడు
సదసద్వివేక లక్షణ రక్షణుండు
విదితశైవాగమ విద్వద్గరిష్ఠుఁ
డతులిత రాజస*భా మంత్రివరుఁడు
నైతగు మంత్రియై యా రాజునొద్ద
*నుండు శివదేవుని నుద్దండుఁ జూపి
దండిగా నాయన పాండిత్యశక్తి
నుద్దండ కొనియాడ రెండవ శివుఁడు
మండితయశుఁడని మాటికిఁ జెప్పి
మనుజమాత్రుఁడు గాఁడు మన కెంచిచూడ
ననుచు గణపతితో నా సర్వ రాజ్య
భారంబు నాతని భారంబు చేయు
గారవంబున నని కదలిపోవుటయు
నంత గణపతిరా జట శివదేవు
కంత మ్రొక్కియుఁ దాను నతని యనుమతి
భ్రాంతులై దిక్పతుల్ భయమంది చెదర
సంతసంబున భేరి సఱపించి మించి
యంత సేనలు చ(తురం)త యానములు
వింతవింతలు గాఁగ వెనువెంట నడువ
పొంతఁ బుణ్యస్త్రీలు పొందుగా నిలిచి

క్రంతల నివ్వాశిఁ గరమొప్పఁబట్టి
వెడలెను గణపతి విజయంబునకును
కుడియెడ్మ పేనలు కొలిచి యేతేర
వెలనాఁడు చేరియు వీడెల్లఁ గాల్చి
వెలనాటి రాజును వెసగెల్చి వాని
యప్పనంబులు గొని యటఁ జని రాజు
గుప్పన నెల్లూరు కూడ నేతెంచె
అక్కన బయ్యన నచట సాధించి
లెక్కసేయక వాని *నెఱబిరుదులను
తనకు యోగ్యంబులు తగఁగాక యున్న
ఘనుఁడు తేరాల [1]రుద్రనదేవు కిచ్చె
నెల్లూరి ప్రజలకు నేర్పు వాటిల్లఁ
జెల్లించె మన్మథ సిద్ధిరాజునకు
నెల్లూరి పట్టంబు నేర్పుగాఁ గట్టి
సల్లీల చివ్వేసు సమదుర్గములను(?)
[2]అరువదెనిమిదియు నట్టి పట్నముల
నరుదొంద సాధించి యా మన్మసిద్ధి
రాజు కిచ్చియుఁ దన తేజంబు దిశలఁ
బూజకెక్కఁగ ఘనరాజితయశుఁడు
ఘన తటాకంబుఁ దాఁ గట్టించె నచటఁ
*గొనకొని నెల్లూరఁ గొన్ని నెలలుండి
మనుమసిద్ధికి రాజ్య మహిమంబు దెలిపె
ఘనవేగ మడర గంగాపురంబునను
బెక్కు శివాలయ ప్రీతు లొనర్చి
గోపురంబులు నిల్పి గొబ్బున నచట

1. "రుద్రానదేవున కిచ్చె". ఇది ప్రతా. చరి. లో లేదు: 2. రెండువేలయేనూరు గ్రామంబు లని ప్రతా. చరి.

*నోపుతులాపురుష మొక యెనిమిదింటఁ
దూఁగి యచటికిని దూర్పు దిక్కునను
వేగ గణపురమన వెస గ్రామ మొకటి
కట్టించి దానికిఁ గడు వైభవముగఁ
గట్టించెఁ జెర్వుఁ దాఁ గడు చోద్యముగను
అంత నచ్చటినుండి యట నోరుగంటి
కంత నేతెంచెఁ దాఁ గడు చోద్యముగను
తన నగరికి వచ్చి తన నగరందుఁ
గనుఁగొన మేడలు ఘనముగాఁ గట్టె
ఘన వైభవాకార కనక సౌధములు
*వినయ సంభ్రమముగా పెస నిటికెకోట
చుట్టురాఁ బెట్టించి సుందరంబుగను
గట్టిగాఁ దనచుట్టు కాపుగా రాజు
వీథులు లోపల విలసిల్లఁజేసి
వీథుల జాడలు వెరవొప్ప లోనఁ
గరులు తేరులు నశ్వ*ములు పదాతులును
నరుదారఁ తనకోశ కలగంబుగాఁగఁ(?)
బరగంగఁ దిరుగంగ బగలును రేయి
కరకరితోడుతఁ గాచి యుండంగ
నక్షోహిణీబలం బటు తక్తిచేసి
యీాశింప నింద్రున కెఱుఁగరాకుండ
గణపతిరాజులు గణుతింపఁ బ్రజల
కణఁకువలేకుండ నా యోరుగంటఁ
బూజ్య సామ్రాజ్యుఁడై భువనంబు లెఱుఁగ
రాజ్యంబు నేయంగ *నపుడుండి పాండ్య
రాజులఁ గెల్చి తా రాజితంబుగను
భోజుఁడై కప్పముల్ పొసగంగఁ గొనియుఁ

దన యాజ్ఞలోనికిఁ తగ వారిఁ జేర్చి
పనివడి [1]యపుడు శ్రీపర్వత మేఁగి
కనుఁగొని శ్రీమల్లికార్జును మ్రొక్కి
యచట సువర్ణంబులగు పుష్పములను
నచలుఁడై పూజించె నదటఁ బన్నెండు
వేల పుష్పములను విధ్యుక్తముగను
లీల నాలింగంబు కేళీవిలోల
జాల చిత్తాబ్జ సల్లీలఁ దాఁ జేరి
పోలంగ నాప్రొద్దె పోయి యాపంచ
రామాల దేవి తన రామలుఁ దాను
కామానురాగుఁడై కడు షోడశాది
దానంబులును వేడ్క స్నానముల్ చేసి
*వచ్చుచో నెంతయు వడి "నడపగుండఁ"
డచ్చురా సాధింప....నం బొలికిని
సాధింపఁ బంపిన సరి నేఁగి వాఁడు
సాధించి తెచ్చిన సకల ద్రవ్యంబు
మోదించి పుచ్చుక మొగిమెచ్చి యిచ్చె
నాదిగా "నెలుగూరు" నాటినుండియును
సర్వమాన్యముగాఁగ సకల వస్తువులు
పృథ్వీశ్వరుండగు *గణపతీంద్రుండు
నడపగుండనికిచ్చె నాతఁడు ధర్మ
మెడపక చేయుచు నెంతొ వి(క్రాం)తి
[3]కాంతుఁడు చెర్వుఁ దా ఘనముగఁ గట్టె
సంతసంబున సప్త సంతానములును
గావించి మించి తాఁ గడు రహి కెక్కి

1. శ్రీపర్వతశైలము ; 2. పంచారామములని ప్రతా. చరి ; 3. అడపగుండయ్యనుగూర్చిన యీ వివరములు ప్రతా. చరి. లో లేవు.

సేవించెఁ గోవిద శ్రేణుల నెల్ల
నీప్సితార్థంబుల నెసఁగంగ నిచ్చె
నీప్సిత కాముల నెఱిఁగి దాఁ బ్రోచె
నాలుగు చెర్వులు నయమొప్పఁగట్టి
నాలుగు శివుగుళ్ళ నవ్యదివ్యముగఁ
గట్టించె నా మహా ఘనమైన విష్ణు
పట్టగు నొక గుడి పెట్టించె దాని
చుట్టు ప్రహారిఁ దాఁ బెట్టించె నతఁడు
నటు(ల) ధర్మంబులు నలవియే నరుల
కిటులు వదాన్యత లెందును గలవె ?

అట గణపతిరాజు నా పండితేంద్రు
కట [1]మన్మఁడైనట్టి యా మల్లికార్జు
నారాధ్యు లొద్దను నట దీక్షవడసి
సారానుభవలింగ సద్ద్వయంబునకు
నిత్యపూజావిధి నియమంబులకును
నత్యంతభక్తిఁ దా నటఁ [2]బదకొండు
*గ్రామంబు లిచ్చి తన గ్రామసీమలకు
వేమఱు నిత్యోత్స*వంబులు నమర
నన్నింట శివులకు నట కేశవులకు
నెన్నిక భవనంబు లన్నియుఁ గట్టి
నిత్యనైవేద్య సం*తత వైభవములు
నత్యంత ప్రీతితో నలరఁజేయుచును
నేకశిలాపుర మెనయ దానికిని
వీకగా నైరృత్య వీథి దిక్కునను
యోజనత్రయమున నొగిఁ దన పేర

1. పండితారాధ్యులనియే ప్రతా. చ. ; 2. రెండు గ్రామములని ప్రతా. చ.

నోఁజగా నొక తటా*కంబును బురము
గణపరమనఁగను గణపతిపేర
గణుతింపఁ గట్టించి కడఁకతోడుతను
ధర్మంబు లన్నియు దనరంగఁజేసి
కర్మంబు చెఱచి తా ధర్మానఁ బొదలి
గణపతి మహరాజుగా రుండునంతఁ
గడఁకతో నావేళ కడు నోరుగంటి
కట పశ్చిమాన యోజన పంచకంబు
కటదూరమాత్రాన నచ్చట నొక్క
[1]"పెదశివ నగర" మన్ పేరటి పురము
పెనుపొందఁగా వచ్చి పెద్ద తటాక
మక్కడ వేయించె నచటను గొన్ని
చొక్కంబుగా నూరు సొబఁగైన యట్టి
సామాన్య చెఱవులు చక్కంగఁ గట్టి
*వేమఱు నొక నూరు వెలయు గణపరము
లారూఢిగాఁగట్టి యట మూరురాయ
లారూఢి గండపెండేరముల్ బిరుదు
*లంగంబుగాఁగట్టి యట కటక భల్లు
భంగంబుగాఁ జేసి పట్టి యెప్పటివి
కప్పముల్ గొని వేగఁ గడు నేగుఁదెంచు
నప్పుడు గోదావ*రీ నదిలోనఁ
గొన్ని క్రతులు చేసి కోరి వేడుకల
నెన్నిక రాజ్యంబు నేలుచుండంగ
నొకనాఁడు నొక సిద్ధుఁ డొగివచ్చి తాను
బ్రకటితంబుగఁ జూచి పతికి నిట్లనియె
"విను రాజవర్య ! యో వీరాగ్రగణ్య !

1. ఈపేరు ప్రతా. చరి. లో కానరాదు.

యనుమకొండ మహాత్త్వ మది జెప్పఁదరమె ?
సిద్ధాశ్రమం బిది చెప్పెద వినుఁడు
ఇద్ధాత్రియందున నిన్నివేలేండ్రు
శ్రద్ధ ననుమకొండఁ *జేరి బిలమున
బుద్ధి నుండేము నీ భూమి సంచార
మేతెంచి వచ్చితి మీ మహాకాయ
మాతత శుద్ధియైనది యటుగాన
యోగసిద్ధుఁడఁ గాన యోగవాగముల
బాగు లెర్గుదు దాని ప్రబలంబుచేత
సకల దేశంబుల సంచరించితిని
అకలంకమతి మగి దన్మకొండకును
వచ్చితిఁ దద్యోగవాగ తాపంబు
హెచ్చుగా నున్నది హే గణపేంద్ర !
మచ్చిక నాకును మంచి ధేనువుల
యచ్చ గోవులపాలు నట నీరులేక
పట్టి తెప్పించి నా ప్రాణమ్ముఁ గావు
నెట్టన నీవంటి నిర్మలు లవనిఁ
బుట్టంగవలెనని బుద్ధి నెంచెదము
*పెట్టుఁబోతకు మనము పెట్టంగవలయు"
అట్టాడు సిద్ధున కవనిపాలుండు
పట్టిన ధైర్యంబు పదిలమేమఱక
*గట్టి మనమున నాలఁబట్టి తెప్పించి
నట్టుఁ ధారోష్ణంబులగు నూరు గోవు
లట్టె పిండించి తానా సిద్ధవరున
కొక్క బొట్టును జిక్కకుండంగఁ బోయ
నక్కజంబుగఁ ద్రావె నట ఘుట్టునంగఁ
జక్కఁగాఁ ద్రేనిచి యక్కజంబుగను

మిక్కుటంబగు ముదమెక్కఁగా ననియె
"గణపతి రాజేంద్ర! కరుణాకరేంద్ర!
కణఁక నీ చేసిన ఘనతోపచార
మునకు నా మది గడు మోదంబు నొందె"
*నన సిద్ధయోగికి నా గణపతీంద్రుఁ
డితఁడు సిద్ధుఁడు నగు నితఁడు దైవంబు
నతనికి యోగతా*పంబు వారింప
తనవద్ది చంద్రక*ళా పానరసము
ఘనవస్తు విదియని కడఁకతో నిచ్చి
దాని క్రమంబును దగఁ జెప్పె నంతఁ
గనసిద్ధుఁడంతఁ దాఁ గడఁకతో మెచ్చి
యతనికి 'నవధూత*రాయ' బిరుదంబు
మతిఁ దగ నిచ్చియు మన్నించి యతని
ననుమకొండకు రాజు నటఁ దోడితెచ్చి
కనుఁగొన బిలమహత్త్వంబులు చెప్పి
యాకొండ తూర్పున నట నొక్క బిలము
సోఁక, వాఁకిట నున్న సొంపగు బాయి
*జూపి నఱకించియుఁ జూపె నా బిలము
లోపల నొక దొన లోలోనఁ జూపి
"యిదియె కేదార తీర్థము దీని మహిమ
విదితంబుగాఁ జెప్ప వేల్పుల వశమె?
హిమపూరములు వారి యివి సేవచేయ
సమయుఁ బాతకములు సరసుఁడ వినుము
ఇది లింగమని చూపి యిదియు నేమఱకు
మది" నంచు బిలములో మది కుదుర్చేసి
బిలము వాకిలిఁ గప్పఁ బెట్టించుకొనియుఁ
గళవళంబులులేక కానరాకుండె

గణపతి మహరాజుగా రటువలెను
నణకువలేకయు నా తీర్థమాడెఁ
దీర్థసేవనుజేసి స్వార్థంబుగాను
బ్రార్థించెఁ గేదారపతి లింగమూర్తిఁ
దీర్థముల్ భువిఁగల తీర్థములనుచు
స్వార్థంబుగా గుడి చయ్యనఁగట్టి
తీర్థముల్ సాలించి తివిరి కేదార
దేవుడాఁపటఁ గఱు దేదీప్యమాన
*మవు గుడికట్టించి యచటను ననుమ
గిరినాథు నునిచియు సిరిసంపద (లతో)
శూర గణపతిరాజు కోరిక లలర
వర శివాలయములు* మేరలు లేక
నాడ కట్టించెను నాడకాడకును,
కూడ నిత్యోత్సవ క్రీడలఁ గూడి
యాడుచు వేడుకగూడ నుండుచును
నెడఁబడ కోర్గంటి యీశుఁ గొల్చుచును
వచ్చి పట్టముఁ జొచ్చి వైభవంబుగను
హెచ్చి ధర్మంబుల నెలమితో నిల్పి
యంతట సంతానవంత నెమ్మనము
కొంత బుట్టిన నటఁ గోవిద వరుల
యనుమతిఁ బద్మాక్షి నా యమ్మకొండఁ
గనుఁగొని యాదేవిఁ గాంచి మ్రొక్కుచును
నుండఁగ నాదేవి కొకనాఁడు పూజ
మండనంబుల స్వర్ణ మండనంబులను
బూజించు నంతన పొలుపుగానొక్క
తేజితోల్లసదీప్త దివ్యమోహినియుఁ
గాఁబోలు నను కన్య గణపతిరాజు

కాఁబోలు ననఁ గళాకౌశలత్వమునఁ
బుట్టె నెంతయుఁ గూర్మి బిడ్డ రాజునకు
పుట్టిన సుతకును బొలుపార నామ
*మట్టె యుమ్మక్కను నత్తిలకి(?)నామ
మొప్పఁగా నిడి పెంచుచున్నంతలోనఁ
జెప్పఁ జూపఁగరాని *సౌందర్య మహిమ
ముప్పతిల్లఁగఁ గళ లుప్పతిల్లఁగను
నొప్ప నానాటికి నొగి యౌవనంబు
గప్పుకో నొప్పులకుప్ప దా నున్న
నిట్టి తలోదరికెట్టి సత్పురుషుఁ
డెట్టు గల్గునో యని పట్టి చూచుచును
దన బంధు సంబంధ ధాత్రీవిభుండు
తన మనోహరముగఁ దాఁ జూచి విభుఁడు
చాళుక్య వంశాబ్ధి చంద్ర దిగంత
రాళుండు వీరభద్రయ్య రాజనఁగ
నతనిఁ దోడ్కొని వచ్చి యతనికి సకల
మతులిత గతి ద్రవ్యమంతయు నిచ్చి
తన కన్యకామణిఁ దగను నుమ్మక్కఁ
బనుగొని పెండ్లిఁ దాఁ బఱగంగఁ జేసి
తన పురంబునఁ గల తగువారి నెల్లఁ
గనుఁగొని బ్రాహ్మణ క్షత్రియులాది
యందఱఁ బిలిచి రాజప్పు డిట్లనియె
"అగ్రజులగు బ్రాహ్మ లందఱు మీకు
నాయకత్వంబిత్తు నయమునఁ గొనుఁడు
కాయకంబులు మాని కనుఁగొనుఁ" డనియు
"మీ బంధువర్గముల్ మీకును నెల్ల
బాబులు(?)నడిపించి పాటించి జీత

జీవితంబులుగాఁగఁ జేయింతు" ననిన
నావిని బ్రాహ్మణు లట క్షత్ర వైశ్య
లప్పు డిట్లనిరి తామా రాజుతోడ
"నేము క్షాత్రంబులు నిర్వహింపగను
నేముజాలము జాతి నేమముల్ గావు"
అని యొప్పకున్నచో నక్కడ నున్న
*వారి నానావర్ణ వరుసలవారి
బుద్ధిమంతులఁ జాల ప్రోడలౌ వారి
కుద్ధతి నాయక*త్వంబుల నిచ్చి
జీవితంబులు రాజ [1]సేవకులకును
జీవితంబుగఁ గృపచేసి యారాజు
వరుస "నానావర్ణ వరమండలీక
కరగండఁ" డనుపేర ఘన బిరు దమర
నఱువదెన్మిదియేండ్లు నట రాజ్య మహిమ
నిఱవొందగా రాజు నేలి యంతటను
తిక్కన చెప్పిన తెఱఁగున నపుడు
నొక్క చిత్తంబున నొగి శివదేవ
అయ్యకు రాజ్యభా*రంబంత చుట్టి
చయ్యన శివలోక సరణిఁ దాఁ జనియె
గణపతిమహారాజు ఘనధర్మ విదుఁడు
గణపరివృతుడైన కళకంఠుఁజేరె.

## రుద్రమదేవి

ఆరాజు దేవులు నా రుద్రదేవి
గారాము పెనిమిటి గారితోఁ బోవ
నుద్యోగమటుసేయ నున్నక్క చూచి

1. శిల్కల ందరికి.

సద్య భయంబని సరగున నపుడు
అయ్య శివదేవున కంతయుఁ జెప్పఁ
జయ్యన నాయయ్య సరగున రుద్ర
దేవినూరార్చియు దేవతా కథలఁ
బ్రావీణ్యమునఁ జూపి "పణతినీకగునె ?
వీరశైవాచార విమలులకిట్టి
దూరవిచార విస్ఫారతవలదె
జీవుఁడు శివునాజ్ఞ జనియించుచుండు
జీవుడడంగును శివునాజ్ఞనెపుడు
కాన నిచ్ఛాస్వతం*త్రత గల, శివుని
గానఁబోయిన జీవిఁ గానక యేడ్చు
మానిని జడమతి మానినిం బలెను
నూనిన జడతమోజ్ఞానాంధకార
మానము నసమాన మహదేవలింగ
సారమతి జ్ఞాన సవితృచే నడపు
మదిగాక రాజ్యమరాజకంబైనఁ
*గదియుదు ర్వీమతులు కాంక్షదైవార"
నని చెప్పినంతట నత్తన్వి విమల
మానితజ్ఞాన సమాధిచేఁ జొక్కి
యూని తత్త్వజ్ఞాన మాహచేఁ దెలిసి
మానిని బోధచే మాని తజ్జడత
నంతఁ దత్క్రియలన్ని యా మహారాజు
కంతఁదాఁ జేయించె గణపతి కపుడు
నా రుద్రదేవులు నగు వీరపత్ని
నేరుపుతోడుగ నెరపి భారంబు
పూని సింహాసన భోగంబులను భ
వాని యిచ్చిన ఖడ్గవర ఖేటకముల

యందుంచి ముద్రికయందుంచి భార
మందుంచి రాజ్యమ్ము నాశివదేవు
ననుమతిఁ బాలనమటఁ జేయుచుండి
కొఱమగ్గు లేకుండ ఘన రుద్రదేవి
నేయంగఁ గడమయై చెన్నొందుకోట
కాయకంబెఱుఁగుచుఁ గలుకోట కట్టి
తన భూమి ప్రజలకుఁ దమకును గాఁగ
గొనకొని తాభూమికోట గట్టించె
నా రెండు కోటల కతి మధ్యగాఁగ
నా రెండు కోటల [1]కలఁతిదూరమున
*గట్టిపుట్టకోట ఘనవై భవమునఁ
గట్టించి కోటకు గవనులు దీర్చి
గవనులు వేరుగాఁ గట్టించె దిడ్లు
గవురతఁ(?) గట్టించి కముఁగొనవారి
కక్కజంబుగఁ బరిఘలకును జలము
నొక్కొక్క కోటకు నొగి [2]నూరిదారి
తప్పించి వానికిఁ దగు బలంబులను
ద్వారపాలకులను దగ నేర్పఱించి
ద్వారభూములనుండఁదగ రేయిఁ బవలు
నందు బలంబుల.........డుగా నుంచి
కొంద ఱధికారులఁ గొమరొప్పనుంచి
భూమికోటకు గొను(?)* లెనిమిదియుండు
నా మహాకోటకు నట దిడ్లు వినుఁడు
పదహారు దిడ్లును బఱగంగనుంచి
మద హస్తి తురగముల్ మానుగానుంచి
*యందుఁ బుట్టకోటకవి నాల్గు గవను

1. రెండు కోటల కలతిదీర్ఘమున; 2. నూరు.

లందును దిడ్లును నట నెన్మిదుండఁ
గందువ కలుకోట గవనులు నాల్గు
చందంబులకు దిడ్లు సరగున నెనిమి
దట్టె కల్కోటకు నావరణమునఁ
బెట్టించి తంతెలు [1]పెద్దగాలోన
నలగంబు దిరుగగా నాప్త వర్గముల
నలరంగ నియమించి యటఁ గుటుంబములఁ
దన యిక్కె కోటలోఁ దగ నుండఁజేసి
తన యిక్కె కోటకుఁ దగ మొగసాల
రెండు చోటుల గొను(?) లండఁ బాయకను
మెండుగ గొనులకుండుబలంబు
చందంబు చెప్పెద విందుగాఁ జెవులఁ
గొమ్మకు నిద్దఱు కోట బురుజుల
కిమ్మైన నాయకులిట యేఁబదయ్యె
గవనికి నేనూఱు కాలు బలంబు
సవినయపరులగు సరసులు దిడ్డి
కరయంగ నూర్గురు నటఁ గాచియుంద్రు
నరయంగ వీరాంగ నాయకోత్తములు
శూరులు ధీరులు సురుచిరౌదార్య
వీరులు దిరుగరు వెపనాజిలోన
నిట్టి రాకొమరులు నెపుడు నా వీట
గట్టిగా రాజకా*ర్యములందు నుంద్రు
చేయించి కోటలు చెన్నుమీఱంగ
వేయించి బహువృక్ష వితతులుచుట్టు
రాను ఫలవృక్షములు రమ్యతరువులు
గా నుంచి కోటకుఁ గడలేని యశము

1. పెరుగా.

శ్రీ మహాగణపతి చేసిన యుక్తు
లా మహాదేవులు నడుపుచునుండు(?)
వనములు పెండ్లిడ్లు వరతటాకములు
ఘనవైభవంబున ఘనముగాఁ జేసి
తన కూఁతురుమ్మక్కతగఁ బుత్రవంతు
రాలగునట్లుగా రమణతో నెడ్లఁ
జాల నోమించెఁ దా సరి [1]యెడ్లనోము
అందుకుఁ బూర్ణంబులగు పల్పు పగ్గ
మందుల మునికోల యల స్వర్ణమయము
నొక్కొక్క యెద్దుకు నొనరంగ దక్షి
ణక్కజంబుగ వెయ్యి ననువగు మాడ
లొప్పుగా నిచ్చిన నొగి విప్రవరులు
అప్పు డాశీర్వాద మధికమ్ముఁ జేసి
రంతట నిలువేల్పులగు తమకైన
కాంత గాకతి దేవికడఁ జేరి యచట
స్వర్ణ ఘటంబులు సరసతఁ బెట్టి
స్వర్ణంపు మాడలు సరసత నైదు
లక్షల మాడలు లావుగా ఖర్చు
లక్షయంబుగ జాత*రలుచేసి మఱియు
*నొడ్డెపల్లి గణపతి కొగి నూఱుబంత్లు
బుడ్డన(?)కజ్జము *గుడపానకమ్ము
పప్పుల నెయ్యినిఁ బరిపక్వమైన
యొప్పగు మోదకా లొగి నివేదించి
మొగిలిచెర్లకు వచ్చి మొగి నేకదేవి
యగు నేకవీరను నర్థిఁ గొల్చుచును
నైదు దినంబులు నట నున్న యంతఁ

1. ఎడ్ల నోము" ప్రతా. చరి. లో లేదు.

గైదువుల్ పట్టెడి ఘననాయకులును
హరిహరదేవుఁడు నట నా మురారి
హరిదేవుఁ డనువారు నాయోరుగంట
మర్లబడి యున్నంత మరి సామమునను
నొర్లఁబడఁగాఁ జేసి యొగివారిఁ దనకు
లోనుగాఁజేసి తాలోపలి కరిగి
తనకు వశవర్తులై తగువారి ననిపి
హరిహరదేవుని నామురారిని
సరి పుత్రమిత్రుల సకల బంధువులఁ
జంపించి వారిండ్లు సరిదోచితెచ్చి
వెంపరలాడియు వెస నన్మకొండ
కరిగి సిద్ధేశ్వరు నట స్వర్ణపుష్ప
మరి మురిఁబూన్పంగ నట దినము వేయి
పద్మ సదృశములు పద్మసహస్ర
పద్మముల్ స్వర్ణాన భాసురంబుగను
జేయించి పూజించి చెలువములుగను
వేయింటి చొప్పున వెస ననుదినముఁ
బూజించి యోజించి భూపకుమారుఁ
డాజి ధురంధరుఁడగు సుతుఁగోరి
పద్మాక్షినగరికిఁ బాటించి దినముఁ
బద్మంబులను బూజ పాటింపఁ జేసి
నిత్యోత్సవములకు నెలమి జాతరకు
నత్యంత ప్రీతితో నట రెండువేల
మాడలు దయచేసి మానుగానపుడు
కూడ జాతరసేయఁ గొన్ని దినములు
విప్రభోజనములు వెస వ్రతమ్ములును
నప్రమత్తత సమా*రాధనల్ సేయ.

## దేవగిరిరాజుతోడి యుద్ధము

దేవగిరిరాజు లుద్రేకులై వచ్చి
కావరంబున నోరుగంటి మీఁదటను
రాణివతోఁ జుట్టిరా ముట్టడంబు
మానుగాఁజేసిన మఱి చలింపకయు
"క్షుద్రపుఁబనికి నిర్నిద్రులై వీరు
పద్రవమును జేయఁ బై వచ్చినారు
చిద్రూపుఁడైనట్టి సిద్ధేశు కరుణ
భద్ర లక్షణములు పఱగు మన"కని
రుద్రదేవులు మహా రౌద్రతనపుడు
భద్రేభముల నన్ని పాఱంగఁద్రోలి
పదిహేను దినము లార్భటులఁ బోరాడి
చదియంగ మూఁడులక్షల పదాతులను
గొనకొని యొకలక్ష గుఱ్ఱముల్ గూర్చి
*కదిసి దేవగిరివారు కాలూననట్లు
పొదవించి యున్నంత భూపాలు దేవి
పోసీక వెను(కగా)ఁ బోట్లాడి యపుడు
*కనుగొన దేవగిరికడగాఁగఁ దరిమి
శంఖముల్ మ్రోయించి *చెలఁగుచు నపుడు
పుంఖానుపుంఖముల్ పొదివి పోసీక
తాకినవారును దలఁకి భయమున
నాకగొనక రుద్రమాంబకు నపుడు
కోటి ద్రవ్యంబును గొమరొప్ప నిచ్చి
పాటించి యా దేవి పదక్రాంతులగుచుఁ
దమ భూమి జాడలకు దాఁ బోవునంతఁ
దమకు వారికి మేఱ తగునట్లు నచట
స్తంభముల్ నిలిపియు సరగున శాస

నంబుల వ్రాలను నటఁబెట్టఁజేసి
తన రాణువుల్ చచ్చి ధరమీదఁ బడినఁ
గనుఁగొని వారల ఘన చతురంగ
బలముల మఱలఁగఁ బన్నుగానిచ్చి
యలవడ నేఁబదియట లక్ష పొన్ను
పనువడ సామంతభటుల కొప్పించి
యనుమకొండకు వచ్చి యచట సిద్దేశుఁ
గనుఁగొని నిత్యోత్స*వంబులు నేసి
ఘనవైభవముతోడఁ గదలి యోర్గంటి
పురము సొచ్చియునుండ భూరి సామంత
వరులు రుద్రమదేవి వాసి మన్ననకుఁ
దమకుమారుల పేళ్ళు తగఁబెట్టి బ్రతుకు.
తమ సేనలన్నియుఁ దగ రుద్రదేవి
నంబ యంబ యటంచు నట పేరఁబిలువ
'అంబాల' యనియెడు నధికపురంబుఁ
గట్టించె రుద్రవ*రంబులు ఘనము
కట్టించి యష్టది*క్కుల జయస్తంభా
లొప్పఁగా నాటించి యొగి రాజ్యమేలు
నప్పుడు తన కూఁతురగునుమ్మకకును
గర్భచిన్నలు లెస్సగాఁ గనుపింప
దుర్భర పరవాది గర్భనిపాత
[1]నిర్భరు నాగమ*వితత మతాను
గర్భగ శివతత్త్వ గర్భసానంద
రతి, [2]యనాగత వర్తమతి [3]బురాణాతి
మతవిచోదిత [4]శుభమత నిర్వహుండు
అతులిత వేదశాస్త్రాగమవితత

1. వా నిర్భరు దాగమవిభత; 2. తనాగత; 3. బురాణేతి; 4. శుభద.

మతిచే ననుష్ఠింప గతిగల్గు సువిజి
తేంద్రియ పరవశుం డీశభక్తుండు
సాంద్రవిదో (?) భక్తజన మనో(హరుఁడు)
..............................
చంద్రుని శివదేవు *ఁజేరంగఁ బిలిచి
*యింద్రవైభవ గణపతీంద్రుని దేవి
కొందఱు చేడెల గుణవతి ప్రౌఢ
లందు సడిగను వారలందఱఁ బిలిచి
యిట్లని పలికెను నింపుతోడుతను
"ఎట్లొకో మా కూఁతురెమ్మిఁ జూడఁ గను
వాడి యున్నది వసి వాడిన పువ్వు
పోడిమి నానన పోడిమి చూఁడఁ
జూడ మాధురి స్రవసుధ అధరంబు(?)
వాడి వరువట్టులు వగదొట్టి శ్రమము
తడఁబడ మొగమును బడగునెన్నడుము
కడువడి బహుళమై కానంగనైన
మీనముల్ బేడిసమీలొకో యనఁగ
నాననంబున నుండు నక్షల నెపుడు
మూయుచుఁ దెఱచుచు మొగుచు చున్నదియుఁ
గాయంబు కృశమయ్యె ఘనమయ్యెఁ బిఱుఁదు
లావెక్కె యొఱపెక్కె యా పొక్కిలున్న
వాయూరు లానారు *వేమరుఁ జూడ
నేనారులందున నీనారిచూలు
గానమీయ.....................
...............కాంతువిచాన(?)
మానము సద్గర్భ మానమౌ దీని
కూనంబు గాదనుమాన మే"లనఁగ

సడిసన్నసతులును సత్పుత్రవతులు
నుడుగక కనిపెంచుచున్న సుందరులు
నిశ్చయింపఁగ లేక నెఱినున్న యపుడు
ఆశ్చర్య జలధినో.........డు
భావి కాలజ్ఞాన పారీణసూత్ర
భావితనిశ్చయ...వర్ధనుండు
నగు శివదేవుండు నా రుద్రదేవి
మగువ వీక్షించి సమ్మతి నిట్టులనియె
"గర్భాండ బ్రహ్మాండగములు సచ్చివుని
నిర్భరాజ్ఞామూల మీ నిఖిలజనము
గర్భగ గతులనుగాఁ జేయు నొలియ
దుర్భరంబుగఁ జేయు నిర్భర శివుఁడు
కారణ కార్యకర్తృత్వ మెఱుఁగక
కారణ నైమిత్త(?) కారణమడుగ
జాడలే భక్తుల...దెలకవనిఁ
గూరునే వినగ నిస్సార సం(సార)
....పారావార కూలంకషముల
*జేరంగఁ జూతురె సద్గణపతీంద్రు
వీరపత్నివి జ్ఞానవిశదంబు వలదె ?
కోరినఁ గల్గునె ? కోరెడివారి
ప్రారబ్ధ సంచిత పాపంబులుండఁ
గారణంబులులేక కలుగఁడున..."
(అని)చెప్పి మఱియును నపుడు నుమ్మక్కఁ
గనియు సంతోషించి కరమర్థిననియె
"అయిదువ ! నీకును నమరేంద్రసముఁడు
పయిదలి ! పుట్టును బరమేశ్వరాంశ
జనియించి మర్త్యుఁడై* చెలఁగునుగాని

కని......ంతగా శివుఁడతఁడు
తొమ్మిదినెలలకుఁ దోరంబుగాను
నెమ్మిఁబుట్టు సుతకు నెఱి శక్తియందుఁ
బమ్మిన ముత్యంబు భాతిగాసుతుఁడు
నమ్మము మనమున నఱమఱలేక
కొమ్మ నీమదిఁదల్పు......భక్తి
పుట్టిన యప్పుడె పూని నీసుతుఁడు
గట్టి సింహాసన మట్టె యెక్కెడిని
అంబుజానన ! సత్య"మని చెప్పునంత
వెంబడి సామంత వితత భృత్యులకు
సత్యంబుగాఁజెప్పి చని యోరుగంటి
నిత్యవైభవములు నెఱమించు వాం....
..........బులు దేదీప్య మానముగఁ
గేవలంబుగ వెసఁగేరి శృంగార
మలరంగఁజేసెను నమ్మహాదేవి
యలరంగ సద్గురు కపుడు దామ్రొక్కి
వెలయంగఁ దాంబూల వితతులు మంచి
గంధకస్తూరి కాగరు లేపనాది
బంధుర వస్త్ర సంప్రార్థితుంజేయ
శివదేవుఁడంతట జెన్నొందిఁ (రుద్ర)
దేవుల వీడ్కొని తెఱఁగొప్పవచ్చి
మందిరంబున నుండె మానుగానపుడు
అంత రుద్రమదేవు లాశివదేవు
నెంతయుఁ గొనియాడి యంతసామంత
(?) వంతలుకంత....(అం)తయుఁ జెప్పి
"మీకు రాజ్యంబున మీరాజు పుట్టి
సకల సామ్రాజ్యంబు సరి నేలఁగలఁడు"

అని పట్టమంతయు నపుడు శృంగార
మనిమిష వైభవమపుడు గాఁజేసి
యచటి విప్రులకును నత్యంతప్రీతి
రచనగా నేఁబదిలక్షల మాడ
లతని యోగంబుల కగునట్లుగాను
విపులమ్ముగాఁ బంచి వెలఁది తానంత
మరియు రాణువకును మంచివస్త్రములు
కోరిన వస్తువుల్ కొమ్మని యిచ్చి
పణవ మర్దళశంఖ పటహదుందుభులు
.... .... .... .... .... .... .... .... .... ....
ఆడుదురప్సరలగు సుందరులును
[1]పాడగ గంధర్వపాటల మీఱి
యీరీతి నుత్సవం బేపారఁజేసి
యా రీతి మాసములటఁ గొన్ని చనిన
నట గర్భదానాది...............
కుదితంబుగా [2]సుతుకొగిఁ జేసిరపుడు

## ప్రతాపరుద్ర జననము

దశమమాసంబును దగ పూర్ణమైన
నట (జను) శాలివాహన శకవర్ష
ములు [3]వెయ్యి నెన్నూరు*నగు నర్వదేండ్లు
నామీఁద వర్షముల్ నగు నాఱునేండ్లు
నామీఁద నందనయగు వత్సరంబు
నందలి చైత్రంబునగు మాసమందు
అందు శుక్ల(ము) పక్షమగు పంచమందు

1. పాడుదురు ; 2. సుతవకొని ; 3. వెయ్యిన్ని పదమూ డయిన ఆనం
మని ప్రతాపచరిత్ర.

పొందుగా రోహిణి పొసగుగురువార
*మటబ్రాహ్మి ముహూర్త (మట)గ్రహవితతి
కట సూర్య అంగారక(?) బృహస్పతులును
ఉచ్చ స్థానంబుల (నుండియుండంగ)
నచ్చట శనిగ్రహంబట నిజస్థాన
ముండఁగా నప్పుడు నుమ్మక్కదేవి
చండ పరాక్రము* శ్రీమత్ప్రతాపుఁ
డగు సుతుఁ గనియెను నంత నాలోనఁ
దగ రుద్రమాదేవి తగ పురుటింటి
కొగివచ్చి సుతుఁజూచి.........
........తెచ్చి సింహాసనంబు మీఁదటను
తటుకునఁ బొత్తులఁ దగ(ఁదా)నమర్చి
పవ్వళింపఁగఁబెట్టి యవ్వతానపుడు
నవ్వుచు నానంద*రసమగ్నయగుచు
నేకశిలానగరెల్ల జనములఁ
..........................
గల్గు వర్ణాశ్రమ కలితులనెల్ల
సలలిత సామంత సముదయంబులను
దొరల మన్నీలను దోరంపుభటుల
వారాది డెబ్బది వరనియోగముల
వారి రావించి (తా)*మునుకొని బాలు
[1]నిల మీకు రాజుతా నింపుగాఁ (గలిగె)
..........................
*గుడు నానందరసంబు గూరుకోలీల (?)
నోలలాడుచు బాలునొగిని దీవించి
బాలులలాటంబు పట్టికయందు

1. శిం.

శివదేవ సద్గురుఁడు.........
..........................
పుత్రోత్సవంబుఁదాఁ బుత్రునిఁగూర్చి
పాత్రమ పాత్రంబు పరికింపఁ బోక
వీరువారనకను వెలిబోసు లనక
కారు పాత్రులనక కామిను లనక
ఆబాలగోపాల మందఱ కపుడు
వేపారమంతయు విడిచి యందఱను
......................
మానిన శ్రీగంధ మాల్యాను లేప
నాను కస్తూరికా నవ్యసు [1]గంధి
లాంగులుగాఁ జేసి యందఱి కపుడు
సాంగంబుగా సంఖ్య సరినైదు కోట్ల
మాడలు పంచిరి మఱి లక్షగోవు
లాడ విప్రులకును గూడ దక్షిణ(గ)
..........................
వాడాదిపురము సిం*గారించి ప్రేమ
నా రుద్రమహాదేవి యతి రమ్యముగను
సారలక్షణ కళాచతురత మెఱయ
- సకలజనంబులు సంతోషముగను
అకలంక శోభితమగు మంటపమున
..........................
మకలంక మాణిక్యహార జాలికలఁ
దులఁదూగు తూగుటుయ్యేలఁ గట్టిరచట
వెలయంగ నబ్బాలు వెసకాఁపు గాఁగ
సూతికా గృహముకు చుట్టుగా నుండు

1. గంధవాంగుల.

నాత తాప్తజనులు నట మాంత్రికులును
..........................
సనిరి వృద్ధాంగనా సతులు నిత్యంబు
నా బాలుఁ గావఁగా నలువంద్ర నుంచి
నా బాలునకుఁ బురుడంతఁ దీరుటయు
పుణ్యాహములు చేసి భూకాంతకపుడు
.... .... .... .... .... .... .... .... ....
మంగళారతు లిచ్చి మహిమతోడుతను
సాంగంబుగా దేవసభకును నెల్ల
సంభావనల నిచ్చి సరి నపారముగ
నంభోజగర్భ స*న్నిభుఁ డగు గురుని
యాజ్ఞచే నామంబు.... ......... ....
ప్రజ్ఞా విచక్షణఁ బఱగు శివదేవు
నామకరణముకు నామ మేమనినఁ
బ్రేమతో నిట్లనెఁ బేరు రుద్రాంబ
దేవిదేవేరులు తెఱఁగొప్పఁ జెప్ప
రుద్ర మహాదేవి రూఢిగఁ బేరు
భద్రతఁ బెట్టిరి పఱగంగ రుద్రు
నామంబు..................
అంత నబ్బాలుండు ననుదిన వృద్ధి
మంతుండునై శుక్లమగు పక్షమునను
సురుచిరం బగు సుధాకరుఁ బోలి పెరుగు
నరవరు కొమరున కరుదరు దగుచుఁ
బనుగొన నిత్యంబుఁ బడిసె పోయుటకు
.........ను మాడలవి రెండువేలు
వెచ్చంబు సేయుచు వేగంబు నంత
*యచ్చరికె రుద్రదేవుల యంకమందు

కూర్చుండి యబ్బాలు కోరి యెవ్వరికిఁ
గూర్చి పిడికిట నీయఁ గొనరాదు ననక
గొనవచ్చుననక.... .... ....
కనుగొని యందఱి గ్రహియించిచూచు
అతడు నాయవ యెర్గునంతకు నిచ్చు
మతిమీఱ నెన్నంగ మఱి లక్ష్యసంఖ్య
లెన్నిక నెనిమిది*లక్షల నూరు
నై యుండు ఖర్చుకు ననగ.... ....
(తగి)యుండు లెక్కలు తగుదేవి యెఱుఁగ
నప్పుడు చాళుక్య లధిపుఁ డగునట్టి
మరియొక్క సుతుఁడు (నుమ్మక్క కుఁబుట్టె)
(పొరిగా)న నతనికిఁ బూనిక తోడ
నట్టి యన్నమ దేవుఁ డని నామమిడిరి
అంతట నొక కొన్ని యబ్దముల్ సనఁగ
నంత గర్భాష్టక మందు రాసుతుని
విహితోపనయన సద్విద్యాది కృతులు
నధ్యయనంబును నలవడఁగను ను
పాధ్యాయు లొద్దను బహు శాస్త్రములను
జౌషష్టివిద్యలు సంభవిల్లఁగను
భాసుర ఛప్పన్నభాషలు నేర్చె
దశవర్షముల(లోన) తగనన్ని చెప్ప
..............................
(కోరి)కెంతయు మతిగూఱి సద్భక్తి
పదునొకండవయేటఁ బటు విలువిద్య
లొదవ జితశ్రమమొక కొంతనొగిని
ధనురాది సాధనతతులతోఁ బోరు
వనువునేర్చియునట నట గజారోహ

మాదిగాఁ జతురంతయానమారోహ
మాదులు మ...రోహమజి క్షాత్రగతులు
నంత పన్నెండేండ్లు నగుట నబ్బాలు
వింతగాఁ గావ్యనా*టక వివర్ణములు (?)
పంతంబు మీఱఁగ బహు శబ్దశాస్త్ర
మంతయుఁ జెప్పిరి నా రాజసుతున
కంతయుఁ జెప్పిన నెంతో వేగముగ
పంతంబునఁ జదివె బాహు విక్రముఁడు
పదమూఁడు నేటను బహు శాస్త్రములను
......లను ఘనముగా నేర్చె
పదునాలుగేండ్లకుఁ బరరాష్ట్రి భాష
లదవద వడఁకను నన్ని దేశములు
నక్షర సంజ్ఞలు నను వొందనేర్చె
దక్షత నీతియు ధర్మ వర్తనము
భోజుఁడై ............[1]

1. ద్విపద గ్రంథ మింతటితో నాగిపోయినది.

# శ్రీ సిద్ధేశ్వర చరిత్రము

## [కాకతీయరాజుల చరిత్ర - ప్రతాపచరిత్ర]

(వ చ న ము)

## రుద్రమదేవి

(*[1]ఈవల మాతృక పుస్తకంలో బొత్తిగా తాట్యాకు శిథిలమైపోయింది. పోయిన చోట జాగా విడిచినాను.*)

[2]సిద్ధేశ్వరుని సహస్ర దళంబులఁ బూజించి, పద్మాక్షీదేవి నిత్య మహోత్సవంబు గావించుటయు, విప్ర భోజనంబు......సమేతుండై యేకశిలా నగరంబుపై విడియుటయు, వారలతో నెదిరించి యొక పక్షంబు ఘోర యుద్ధంబుఁజేసి మూఁడు లక్షల...బలంబు వెనుదిరిగి దేవగిరిఁ జొచ్చు పర్యంతము గొంపోయిన వారలు కోటిద్రవ్యంబు కానుకగాఁ బంపిన నా ద్రవ్యంబుకొని...జయ స్తంభంబులు వేయించి వారల తన యాజ్ఞకు లోనుజేసి, మరలి యేకశిలా నగరంబు...వర్గంబులు దమ కుమారులకా రుద్రదేవుల పేరు పెట్టుటయు, మరి యజ్జనంబులును దన్ను 'అంబా'యని...ంబు గట్టించుటయు, నిజనామంబున రుద్రవరంబులను గ్రామంబులు నానాదేశంబుల వేయు గ్రామం...జయ స్తంభంబు లెత్తించి మహామహిమతో రాజ్యంబు నేలు సమయంబున"

ముమ్మక్కదేవికి నెలలు...యా శుభవార్త యెఱింగించిన నాయయ్యె యిట్లనియె, "మీ ముమ్మక్కకు బాలుండు సర్వలక్షణ...త్యాగ రాధే యుండు, సత్య యుధిష్ఠిరుండునునగు నొక్క పుత్రుండుగావున నిది నిజంబు. అబ్బాలుండు ఇ...తొమ్మిది నెలలకు పుట్టినప్పుడె యబ్బాలుండు సింహాసనంబు యెక్కగలడు; యీ వచనంబు సత్యంబనిన యంతంత

1. ఇది తాళపత్రప్రతికి నకలు వ్రాసిన లేఖకుని వ్రాతకాఁబోలు ; 2. ఇక్కడనుండి వచనము. కథకొంత వెనుకనుండి యారంభమయినది. రచన ప్రతాప చరిత్రకు చాల సన్నిహితముగా సాగినది.



సిద్ధేశ్వరునిగుండము

మహా...తన సామంత వర్గంబున కెఱింగించిన, పురంబునంగల దేవాలయంబుల శృంగారింపజేసి, యెద్దేవ...పంచమహా వాద్యంబులును భోరు కలుగజేసి పురంబెల్లను శృంగారించి భూసుర(ల) బిలిచి...పంచి పెట్టించి, సామంత భటవర్గంబునకు చీని చీనాంబరంబులు మణి...(ఆ)భరణంబులు నొసంగి మీకు రాజు కలుగుచున్నాడని యె...వీడు కొలుపుటయు, యద్దేవి క్రమ క్రమంబున ముమ్మక్క గర్భ దానాదికములు సేయుచుండ దశమమాసంబున శాలివాహన శక వరుషంబులు నందన

ప్రతాపరుద్ర జననము

సంవత్సర చైత్ర శుద్ధ పంచమీ గురువారంబున రోహిణీ నక్షత్రంబున బ్రాహ్మీ ముహూర్తంబున, సూర్యాంగారక బృహస్పతులు వుచ్చస్థానంబున [1]శనేశ్వరుండు నిజస్థానంబున నుండునట్లుగా ముమ్మక్క దేవికి సుతుం డుదయించిన, రుద్రదేవులు యేతెంచి యబ్బాలుని శుద్ధోదకంబుల శరీరంబు గడిగి కొలువుకూటంబునకు గొనితెచ్చి సింహాసనంబున పొత్తులు పరిచి, యబ్బాలు నునిచి యేకశిలా నగరంబు ప్రజలను బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రాదులను ప్రధానుల సామంతులను మన్నీల దొరల భటవర్గంబు నునిచి యేకశిలానగరంబు ప్రజలను నాదిగా గలుగు డెబ్బది నియోగంబులవారిని రావించి యబ్బాలుని జూపి మీకు రాజుగలిగె నిదిగో ని(?)యబ్బాలుని జూపి(న)...సంతోషంబున నానందంబున నోలలాడి యబ్బాలునిదీవించిరి. రుద్రమ దేవులు శివదేవయ్యచేయబ్బాలునికి విభూతి ధరియింప జేయుటయు వోరుగంటి... పురంబున పీరువారనకను అబాలగోపాలంబు లందరికి అయిదుకోట్ల వరహాలు పంచిపెట్టించి చీనాంబరము లొసంగి, యా విప్రులకు...ల నొసంగి పురం బలంకరించి సమస్తదేవతావైభవంబులు సాగించి పుత్రోత్సవంబు సేయుటయు, ఆ రుద్రదేవులు సకల జనంబుల (సంతోషంబు గాంచి) యబ్బాలుని నొక దివ్యమందిరంబున నవరత్నఖచితంబైన యొక తొట్టెలో నునిచి పెం(చు)చుండె, ఆ బ్బాలునకు సూతికా గృహంబుచుట్టును ఆప్తుల...లను తలయ(?) బిడ్డలగన్న వృద్ధాంగనలును నిత్యంబును బాలునిం జూచుటకు నలుబండ్రను నుండునట్లుగా నేమించి

1. శనైశ్చరుండు అనుటకు.

విధ్యుక్తంబుగా పుణ్యాహంబు సేయించి అపారద్రవ్యంబు భూసురుల కొసగి శివదేవయ్యగారిని జూచి యబ్బాలునకు నామకరణంబు సేయుమనుటయు, ఆ యయ్య యిట్లనియె. ఈ బాలుండు నీపేరు మెచ్చుకొని వుండునట్లుగా నీ ధరాచక్రంబు మహిమతో పాలించునని ప్రతాప వీరరుద్రుడని నామ కరణంబు సేయుటయు అబ్బాలుండు దినదినప్రవర్ధమానుండై శుక్లపక్ష సుధాకరుండును బోలి పెరుగుచున్నయెడ.

ఆ ప్రతాపరుద్రునకు పీడాపరిహారార్థంబుగా నిత్యంబును మూడువేల వరహాలు పంచిపెట్టియు, అబ్బాలుండు అయిదు వరుషంబుల (రాగనే) రుద్రదేవులు తనయంక పీఠంబున గూర్చుండ జేయుటయు, ఆ ప్రతాప రుద్రుండు తన్ను నాశ్రయించు జనంబులకు, యుక్తాయుక్తంబులు దలంచక యేమియు నొసంగిన నదియు సత్యంబునం బోని చెల్లించె. అతండు యావ యెఱుంగక పంచిపెట్టిన గ్రామంబులు వెయ్యేన్నెనూరును, మూడుకోట్ల సువర్ణంబులయ్యె. అటు తరువాత ముమ్మక్క గర్భంబున నొకసుతుం డుద్భవించిన అన్నమదేవుం డను నామకరణంబు సేయుటయు, అంతట ప్రతాపరుద్రునకు గర్భాష్టకంబునను ఉపనయనంబు సేయించి పదియగు వరుషంబున పదక్రమంబును, పదునొకండవయేట ధనురాది సాధనం బులను.... పన్నెండవయేట నాటకాలంకారశాస్త్రంబుల నెఱిగించిన పదు మూడవయేటను రాజనీతి ప్రకారంబును, ధర్మాధర్మంబులను బోధింపజేసి

**ప్రతాపరుద్రుని పట్టాభిషేకము**

పదారవయేటను విశాలాక్షి మొదలగు రాజకన్యకలను పదార్గురను పెండ్లిజేసి, తదనంతరంబున శ్రీమత్ప్రతాప రుద్రుణ్ణి సింహాసనాసీనుని జేయవలయునని రుద్రమ దేవులు ఆయయ్యకు ఒప్పనజేసి, ఆ రుద్రమాదేవి ముప్పై యెనిమిది యేండ్లు రాజ్యంబు పాలించి తాను శివలోకంబున కరుగుటయు, ఆ ప్రతాప రుద్ర మహారాజు పట్టాభిషిక్తుండై యున్నయెడ కాశేశ్వర నివాసులైన రామారణ్య శ్రీపాదులును, మహేంద్ర శ్రీపాదులును మొదలైన వారలు అనేక మునులు నేతెంచిన, వారికి సాష్టాంగ దండప్రణామంబులజేసి వారల బూజించి వారలచే దీవనలు గైకొని వారి యభీష్టం బేమి యని యడిగిన

వారు తమకు పరుసవేదిలింగంబు సేవించుట మాకు అభీష్టంబు.........కా యని యమ్మనుల దోడ్కొని శంభులింగంబు నగరికిం దోడ్కొనిపోవ నుద్యోగించిన బహుజనుల గూర్చుకొని యా దేవుని కావలివారలు........ నగరు జొచ్చు సమయంబున, శ్రీమత్ప్రతాపరుద్రుండు విని దేవీదత్తంబైన ఖడ్గఖేటంబులు యిరుగేలంబూని తన సమీపంబున వున్న అ...... గూడి ఆ [1]బందిపోటుల దుష్టనాయకు దునుముటయు, మఱియొక్క నాడు అప్పురి దుష్టనాయకులు కొందఱు గూడి ఆకుల చంద్రయ్య......... [2]విరును దడిన (?) సర్వధనంబులు అపహరించి ఆవిప్రునిం బొడిచి పోయిన అతండు మూర్ఛాగతుండై యున్న, ఆ భూపాలుండు విని యా దేవుండు.........బ్రహ్మ(హ)త్య తగులునని మహాభయంబంది, చింతించుచున్నయెడ ఆ విప్రునికాంత పతివ్రత గావున లక్ష్మీదేవి వర ప్రసాదంబున తనపెనిమిటికి హానికాకుండ బ్రతికించుకొనుటయు ఆ వార్త యా భూపాలుండు ఎఱింగి విప్రదంపతుల రావించి పూజించి, ఏని చీనాం బరంబులున్ను ఒకగ్రామంబు నొసంగి యనుపుటయు వారలు యాగ్రామం బున లక్ష్మీదేవిని ప్రతిష్ఠించి అప్పురంబును 'సిరిపురం'బను గ్రామంబు పేరు పెట్టుకొనుటయు, యారుద్రుండు సంతోష చిత్తుండై కొలువు కూటం బున సింహాసనా సీనుండై తన బంధువరుల రావించి సోమదేవరాజు నాటి నుండి వంశపారంపర్యముగావున్న దొరలను సరదార్లమన్నీల ప్రగ్గడియల మరియు పురంబునంగల వేద వేదాంగ పారగులగు విప్రులను, బుధజను లను చతురులగువారలు మొదలుగాగల వియోగంబులవారిని రావించి విహితాసనంబుల గూర్చుండ నేమించి గంధ కస్తూరి పరిమళ తాంబూ లంబులు నొసంగి శ్రీ మత్ప్రతాపరుద్రుండు వారలతో నిట్లనియె.

## ప్రతాపరుద్రుని రాజ్యపాలనము

"వింటిరె మొన్నటి యాశ్చర్యంబు దేవునిపై బందిబడిరి. యా... (విప్రు)...నిపై బంది బడిరి, రాజ్యంబనాయకంబై యున్నది. ఇందుల

1. బందిపట్టున దుష్టనాయకుబడును ముటయు ; 2. "యను విప్రునియిల్లు పొచ్చి" ప్రతా. చరి.

కార్యంబు తెలంగెఱింగింప వలయుననుటయు వారలందఱు నేకగ్రీవంబుగా ని (......?) ట్లనిరి.

"నీవు సాక్షాత్తు రుద్రుడవుగాని మర్త్య మాత్రుండవె ? నీవు యేరీతింజేసిన యదియ మాకు సమ్మతం"బనిన, యారాజు గణపతిమహా రాజు నానా వర్ణంబులవారికి నాయకత్వంబులు యిచ్చుటంజేసి బహు నాయ కంబై యున్నది. కనుక నొక్కమాయను......వెలమ జాతులుగాని యితరజాతులు నాయకత్వంబున కర్హులుగారని రాజు ఇట్లనియె "మాన ధనులును విశ్వాసపాత్రులును......గాంభీర్య సముద్రులును, వివేక దక్ష లును, పాపభీరులును స్వామి హితోపచారులుననగు సచివులు పద్మనాయ కులు, వారలు (నాయకత్వంబునకు) దగుదురని సభికులకు శీమత్ప్రతాప రుద్రుండు యెఱుగం బల్కిన సభాసదులు ఆరాజనీతి వివేకంబునకు సంతసించి యంత మాకు సమ్మతంబు చేయుమనుటయు ఆ ప్రతాపరుద్రుండు పద్మనాయ కులంబిలిపించి నాయకత్వంబులకు...వారిని యేర్పఱచె, నొక్కొక్క కొత్త డంబునకు నొక్కొక్కని సర్వసంపన్ననిగా యేరి వారలకు ధనకనక వస్తువాహనాం (దోశికల నునిచి) చీని చీనాంబరంబులు నొసంగి, మఱియు ఛత్ర చామరంబులును, ఆలవట్టంబులును, సాహసకృత్యంబులుగా బిరుదు లొసంగి, డెబ్బదియేడు (గోత్రం)బులకు డెబ్బది యేడ్గురును, యిట్లు బహుమానంబు చేసి వారలను యేకశిలానగరంబునకు శిలాప్రాకారంబున డెబ్బదియేడ్గురు పద్మనాయకుల నుండజేసి, వారి బంధువుల నుపనాయ కులంజేసి, పుట్టకోట కొత్తడంబుల వుండునట్లుగాజేసి మరియు డెబ్బది యేడ్గురు నాయకులకుతన రాజ్యంబులోని భాగంబు పంచిపెట్టి, వొక్క భాగంబు బంధువులకున్ను, వొక్కభాగంబు తన మూలబలంబుల కొసంగి, వొక్కభాగంబు విప్రుల కొసంగి, తన వశంబయిన రాజ్యంబు భండా రంబునకు జెల్లంజేసి రాజ్యంబున చోర బాధాదికంబులు లేకుండునట్లుగా, మహామహిమతో రాజ్యంబు పాలింపుచుండగా, సప్త సంతానంబు లుద్ధరించి హేమాద్రికల్పోక్త ప్రకారంబున దానంబులు చేసి ప్రతి వరుషంబున పంద్రెండు తులాపురుషంబులు దూగి కోటి సువర్ణంబులు దానంబు

నేయుచు దిగ్విజయంబు నేయుటకునై సకలసేనల రావించి ప్రయాణభేరి వేయించి కటక బల్లహునిపై గదలి వాని సాధించి వానిసుతుని పట్టంబు గట్టి, యెప్పటియట్ల వానిచేత మూడు కోట్ల సువర్ణంబులు అప్పనంబులు గొని సేనాయుక్తంబుగా తన వెంటరా నియమించి,

దిగ్విజయము

అచట పాండ్యదేశాధీశ్వరుని సాధించి వాని సుతుని పట్టంబుగట్టి వాని తనవెంట రా నియమించి యెప్పటియట్ల అప్పనంబులు గొని దక్షిణాభి ముఖుండై సముద్ర తీరంబునకుం జని గోదావరుత్తరించి, రామేశ్వరంబు పర్యంతంబుగల పురంబులు తనవశంబు చేసుకొని రెండువేల వోడల రావించి, అందుకు తగిన వర్తకుల నియమించి, నానాదేశంబులకు వ్యవహారంబులు నేయంబనిచి, అందుల ద్రవ్యంబు తన బండారంబునకు రాజేసి, రామేశ్వరు నేవించి, అచట పెక్కుదానంబులు చేసి నాలుగు తులాభారంబులు దూగి, తామ్రపర్ణినివున్న సమయంబున, విజయనగరంబు నుండి నరసింహరాయలు అమూల్యాభరణ చీని చీనాంబరంబుఌ కానుకగా. దెచ్చి సమర్పించిన సంతోషించి యతన్ని గౌరవించి యా నరపతిరాయలు తన మేనల్లుడగు నృసింహదేవుణ్ణి దళవాయింజేసి, పన్నెండులక్షల పదాతి వర్గంబు కానుకగా బెట్టిన, సంతోషించి రాయలు విజయనగరంబు నకు మర్లుటయు, అ...ట ప్రతాపరుద్రుండు, ఆడుమండలంబేలు ముకుందా దేవి నోడించి యెనభైనాలుగువేలు సువర్ణకమలంబులు అప్పనంబులు గొని దాని తన వెంట రానియమించి, కొంకణ టంకణ మళయాళ బాహ్లిక దేశంబుల గెలిచి వారిచే పది వేయిలక్షలు అప్పనంబులు పుచ్చుకొని, వారు మూడులక్షల గుఱ్ఱంబులతో తన్నుగొలువ నియమించి, గుజరాష్ట్రి దేశా ధీశ్వరుల నోడించి, వారిచేత నప్పనంబులు గొని, మరియు తక్కినరాజుల గెలచుకొని తన యాజ్ఞ(కు)లోనుజేసి, వారిచే అప్పనంబులు పుచ్చుకొని వారి సేనాయుక్తంబుగా తనవెంట రమ్మనుచు, అంతట పూర్వ దక్షిణ పశ్చిమ భూములు తన యాజ్ఞ(కు)లోను జేసుకొని సంతోషించి, భాగీరథిజేరి, గంగా యమునా సరస్వతిని, కృతస్నానుండై పెక్కు దానంబులుచేసి, యెనిమిది తులాపురుషంబులు తూగి, ప్రయాగ కేతెంచి, ఆ పట్టణంబు తనవశంబు

చేసుకొని, యా [1]పురంబునగల మాధవదేవు వైభవంబునకు, అపురంబిచ్చి సేవించి,......మణికర్ణికయందు మునిగి విశ్వనాధుని సేవించి, కాశీ నగరంబు విశ్వనాథునకొసంగి, అచ్చట యిరువై తులాపురుషంబులుతూగి, కోటి సువర్ణంబులు దానంబులుచేసి, వున్నంత నిజభుజ పాలితంబైన దుర్గంబులకొలది, యెరిగించెద.

అట తాళసహస్ర చక్ర[2]కోటాధీశ్వర బిరుదున్ను, ......సింహాసనా ధీశ్వర బిరుదున్ను చాటించి మరియు గయకుంజని యాసులతానిం...... అచ్చట అహోజనంబులచేత మాతామహులకున్ను, పితామహులకున్ను విహితకృత్యంబులు సేయించి......మంత్ర కూటంబునకు ప్రవేశించి విధ్యుక్త ప్రకారంబుగా పంద్రెండు క్రతువులు సేయించి కాళేశ్వరంబున కేతెంచి,......లు దూగి, కోటి సువర్ణంబులు దానంబులుచేసి రెండువేల విప్రులకు పెండ్లిండ్లునేసి, సకల దానంబులుగావించి వేయు......ప్రతిష్ఠలు సేయించి యేకశిలానగరంబున కీశాన్యభాగంబున ప్రతాపగిరియను దుర్గంబు కట్టించి......మేశ్వరు వైభవంబున కొసంగి, యెనిమిది తులా పురు షంబులు దూగి, షోడశ మహా(దానములు) రామేశ్వరు వైభవంబున కొసంగి, యెనిమిది తులాపురుషంబులుతూగి షోడశ మహాదానంబులు చేసి.........తన తమ్ముండైన అన్నమ దేవుండు రాజ్యభారంబు పన్నెండు వరుషంబులు పాలించి ప్రతాపరుద్రునకు యోజన......... పరిజనంబుల గారవించి సంతోష చిత్తుండునై...వచ్చి తదనంతరంబున సింహాసనాసీనుండై కూర్చుండి తనవెంటవచ్చిన నానా దేశంబులవార్ని నిజ నివాసంబులకుం బనిచి...కాకతి మహాదేవికి సాష్టాంగ నమస్కారంబులు

పుత్రజననము

నేసి......విశాలక్షీయందు విరూపాక్షుండును వీర భద్రుండును నను నిరువురు తనయులు [3]గల్గుటయు మహావైభవంబున ఏకశిలా......నగరంబు అలకాపురి సింహాసనంబై యుండు. యీ దుర్గంబునంగల నానా వర్ణంబుల సంఖ్య జెప్పెద.

1. మీ పురంబు 2. కోటధీశ్వర ; 3. గొంచ్చుటయు.

## నానావర్ణముల సంఖ్య

వేదవేదాంగ పారగులగు విప్రుల గృహంబులు పద్దెనిమిదివేలు, రాజద్వారంబు...దీర్చు గణికల యిండ్లు రెండువేలు, రణరంగ చతురులైన క్షత్రియ నికేతనంబులు రెండువేలు, సకల సామగ్రిగల వైశ్య గృహంబులు ముప్పైఫ్రవేలు, యిందుకు ప్రసిద్ధులు కోటికి పడగెత్తిన వైశ్యులు మున్నూట యిరువై యిండ్లవారు, నాల్గవ జాతియై విలసిల్లు పద్మనాయకులు డెబ్బైఏడుగురు, మరియు కాచవర్ణంబు వారల గృహంబులు పంచలోహ ప్రముఖులైనవారి యిండ్లు లక్షయేభై వేలు, కాళ (?) అనవరతంబు సంపూర్ణంబైన గొల్లయిండ్లు యెనిమిదివేలు, కాపులయిండ్లు నాలుగువేలు గౌండ్ల తెలుకులయిండ్లు...యిండ్లు మూడువేల నేనూరు, [1]బెస్త యిండ్లు పదహారువేలు, తెనుగుయిండ్లు ఆరువేల నన్నూరు...యిండ్లు నాల్గువేలు, బుకాయిండ్లు ఆరువేల మున్నూరు, పెరికె కరిణల యిండ్లు యెనిమిదివేల యేనూరు, ముచ్చె యిండ్లు పదమూడువేలు, కక్షారకుల (?) యిండ్లు యాబదివేలు, అగణ్య వస్తువాహన శోభితంబు(లై)న వేశ్యా గృహంబులు ఆరువేలు, ప్రవాసులైన వార్కి వండిపెట్టే వంటలక్కల యిండ్లు అయిదువేలు, బలిజ భవనంబులు నాల్గువేలు మరియు నితర పరిచారికా గృహంబులు లెక్కకు నెన్న కొలదిగాదు.

## దేవాలయములు

శివాలయంబులు అయిదువేల యేనూరు, విష్ణుస్థానంబులు వెయ్యెన్నెన్నూరు, మైలారు దుర్గ, భైరవులాదిగా గణపతి వీరభద్ర నివాసంబులు నాల్గువేల నేనూరు, యిందుల ప్రసిద్ధ స్థానాల భేరీలు యేనూట యేబదియును, నిస్సాణంబులు రెండువేల యేనూరు...పంచమహాశబ్దంబులు మ్రోయుచుండు, గుడులమీది పసిడికుండలు అయిదువేల యేనూరు, దేవతాస్థానాల దీపాలకు నూనె దినంబును కొలపాటి యిరువైయైదుపుట్లు.

1. బెస్తాయిండ్లు పాధారువేలు

నగరి దీపాలకున్నూ నిత్య బ్రాహ్మణ సంతర్పణకున్నూ, ఘనసార చందన పరిమళ ద్రవ్యాదులకు నిత్యంబును పదివేల వరహాలు నగరిలో భాగీరథి జలంబులచేతను గౌతమీ జలంబులచేతను శివుణ్ణి పూజసేతురు, యోజన విస్తారంబైన నానావస్తు శోభితంబైన అంగళ్ళు మున్నూరు, పురంబునకు చుట్టు వీరభట నివాసంబులు మున్నూరు, గూడెంబులు యేనూరు, యిట్లు యింద్రపుర సమానంబైన యేక శిలానగరంబునకు యీశ్వరుండైన కాకతిరుద్రుని కొలిచి యున్న నానాదేశాధిపతులు అనుసరింతురు. పద్మ నాయకులు డెబ్భైయేడ్గురు, మల్లికార్జునభట్టు మొదలైన బ్రాహ్మణ విద్వాంసులు బంగారు పల్లకినెక్కి చనుదెంచువారు నూటయేబదియును, సమస్త కళాప్రవీణులైన పరిహాసకులు వరదారామనాధు....లోకబాచయ్య మొదలైనవారలు నలుబంద్రును, శంకరరాజు కేదారరాజు మొదలైన సాహసవిక్రమార్కులు వుత్తమ క్షత్రియులు యేనూరు, దివ్యకాంతలబోలి నవరత్న ఖచితంబైన పల్లకీ నెక్కి వచ్చు వారాంగనలు కొలువను చనుదెంచువారు సిరిగిరిమల్లు, కాశేశ్వరపు గంగు, కమలనేత్రి, చిత్తారువారి ప్రతిమ, వీరు మొదలైన దివ్యస్త్రీలు యిన్నూరు. యిక ఆ బిరుదుపాత్రలు, భరతకథల అబ్బాదేవి, సర్వమండల చక్రవర్తి, చిలుకల పలుకుల త్రిపురారి, వీరు మొదలైన బిరుద పాత్రలు [1]యెనభైనూర్లు, భాస్కరుడు మున్నుగాగల కవీశ్వరులు యిన్నూరు, గుండం భట్టు, ప్రతాపభట్టు మొదలైన వేదవేదాంగ పారగులు, పురోహితులు నూర్వురును, వందిమాగధ స్తోత్రపాఠకులు యిన్నూరును, మరియు నానా వర్ణాధ్యక్షులైన నానాదేశాధిపతులు పద్మనాయకులు మదగజంబులనెక్కి మౌక్తిక ఛత్ర చామరంబుల విలసిల్లుచు బిరుదుటెక్కెంబులున్ను ఆలవట్టంబులున్ను బిరుదు కాహళంబులున్ను, వీరభట భయంకరార్భటులున్ను పరభూపతులకు భయంకరమగునట్లుగా సకల సేనాసమేతులైనవారు, శ్రీరంగమ దేవుండును.... ....రుద్రదేవుండును పినకూచి రుద్రదేవుండును నిడుదవోలు చండాదేవుం

(ఆస్థానజనము)

[1] యనభనూరు.

డును, [1]యిందులూరి అన్నమదేవుండును, వారు మొదలుగాగల డెబ్బై యేడుగురు పద్మనాయకుల జెప్పెద.

విశ్వనాథుని రాములెంక, జిట్టివారి రాములెంక, గోగులమల్లులెంక, కోడూరి మల్లులెంక వీరు మొదలైన లెంకనాయకులు, మూడులక్షల పదాతి వర్గంబుతో పురంబులు గూడెంబులు గాచుచుండెడి పెద్దతలారి యగు [2]నిశ్శంక వల్లభుండును, మఱియు నానాదేశాధిపతులును, రాయబారులును, గజంబులకు పెద్దయయిన మహంకాళియను దొరయును, అశ్వంబులకు పెద్దయయిన సాహిణి మారయ్యయును, నవలక్ష ధనుర్ధరులకు పెద్దయయిన కొలిపాక సీనయ్యయు, మనుబోతులకు పల్లాలుగట్టి యెక్కి వచ్చేవారు నూర్వురును, నానావిద్యల వారు కొలువు సేయంగాను, పైడిబెత్తంబుల బారునూకుచు, పైడి కుప్పెల జల్లులవారు అయిదువేలు గలిగి పేరోలగంబున గూర్చుండి, దేశాధిపతుల విన్నపంబు లంగీకరింపుచు రాయబారుల మనువుల పాలింపుచు, రాజ్య [3]పరిపాలనంబు సేయుచు, శివదేవయ్యయు, శరభాంకుండును, మల్లికార్జునుండును, పాలకుర్తి సూరప్ప మొదలైన ప్రధానవర్గంబుతో ముచ్చటలాడుచున్న సమయంబున.

ప్రతాపరుద్రుని దినచర్య

ఈశ్వరస్థానంబులు అయిదువేలు, విష్ణుస్థానంబులు వెయ్యిన్ని మున్నూరు, దుర్గ గణపతి క్షేత్రంబులు దేవతాస్థానంబులు నాల్గువేల మున్నూరు, యివి యాదిగాగల్గు దేవతాస్థానాల అధికారులు పచ్చలపల్లకీ లెక్కి చనుదెంచి దేవతాస్థానంబులు చెల్లెనను వాక్యంబులు విని, సింహాసనంబు దిగి, అంతఃపురంబునకుం జని భోజనశాల కేతెంచి బంధువులు దానును (దేశాధి)పతులు, తన తమ్ముండైన అన్నమదేవుండును, డెబ్బది యేడుగురు పద్మనాయకులును, పొక్కపంక్తి గూర్చుండి నానావిధ పదార్థంబులతో వేయినేనూటితో గూడా` భోజనంబులు (...) పాదాలొత్తుచుండ, దాసీదాసజనంబులు మూడువేల యేనూరు గలిగి, ప్రతాపరుద్రుండు, ఉలాయ వ్యాఘ్ర భల్లుక యుద్ధంబులను, జట్టి మల్లుర పెనుగులాటలను, సరస నాటకా

1. రాజతమ్ముఁడు అని ప్రతా. చరి. ; 2. రాయబారములును; 3. ప్రతిపాలనంబు.

లంకార శబ్దశాస్త్రంబుల వాదనలను హాసవచో విశారదులైన పరిహాస(కుల) వాక్యంబులను పుణ్యకథాశ్రవణంబులను, వారాంగనా నృత్యగీత వినోదం బులను, యిదియాదిగా చిత్రవినోదంబుల ప్రొద్దుపుచ్చుచు, సాయంకాలం బగుటయు నగరువెళ్ళి వచ్చుసమయంబున కాకతిరుద్రుని యవసరంబునకు వచ్చు కరదీపికలు మూడువేల యేనూరు నలుదిక్కుల గొల్చిరా నిజ పరివార [1]సమేతంబుగా స్వయంభూమూర్తియగు జ్యోతిర్మయంబగు శంభు లింగంబున్న నగరుకుంజని, శంభులీలావిలాసంబులు చదువుచు ప్రదక్షిణ త్రయంబు గావించి, శంభులింగంబునకు సాష్టాంగ దండప్రణామంబు సేవింపుచు కొనియాడి ఒక్కయామంబు ఆరాధించి, యచ్చటు వాసి నగరుకేతెంచి, సకలజనంబుల నుచిత(స్థానం)బులకు బనిచి, పెద్దతలారి యగు నిశ్శంక వల్లభుండు పరివారసమేతంబుతో రెండు ఘడియలు కొలుపుసేయ, అతని వీడుకొలిపి అభ్యంతర వర్తియై యుండును.

ఈ భంగి రాజ్యభోగ మనుభవించుచు, దేవబ్రాహ్మణ పూజలును, తటాక వననిర్మాణములును, అగణ్య పుణ్యకృత్యంబులు సలుపుచునున్నంత శ్రీమత్ప్రతాపరుద్రునకు చెల్లిన భూములు పూర్వదక్షిణ పశ్చిమంబుల సముద్రంబు మేఱగా చెల్లింపుచుండె. యేడో చక్రవర్తియునై పదియేడో రాజునై సేయుచుండె. అందుల అప్పనంబులు యిచ్చు దేశంబులు; కటక వల్లభుండు లోనుగాగల చిల్లరరాజులు ప్రతివరుషంబు యిచ్చు అప్ప నంబులు యిరువైనాల్గుకోట్లు, తన నిజభుజపాలితంబైన రాజ్యంబువలన వచ్చు రొఖ్ఖధనంబు యిరువైకోట్లు, యిదిగాక అగ్రహారంబులు బ్రాహ్మ ణులకు చెల్లుచుండె. దేవతా వైభవంబులకు రెండువేల గ్రామంబులు చెల్లుచుండె. యిదిగాక తన భండారంబునకు వచ్చు నలభైనాలుగు కోట్లకు ప్రతివరుషంబునకు వ్రయంబు : నిత్యవైభవంబునకు గంధ కర్పూర కాశ్మీర జవాది పరిమళ (ద్రవ్యం)బులకు పంక్తి భోజనంబులకు, నగరి దీపాల [2]వెలుంగులకున్ను, నానాదేశంబులనుండివచ్చు విద్యార్థులకు పంచిపెట్టిన(ది)

1. సమేతంబై ; 2. వెలంబులకున్ను.

ప్రతివరుషంబును మూడుకోట్లు అరువై లక్షలు, పురంబుగాచు నిశ్శంకవల్లభుని జీతంబు భట సహితంబుగా ప్రతివరుషంబును యెనభై యెనిమిది లక్షల యిరువై వేలు, అన్న సత్రంబు లెక్క వొక్కొక్క సత్రంబునకు పెయ్యేసి చొప్పున నూరు సత్రంబులు, ద్విజులకు యేడాదికి వొక్కకోటి ముప్పై లక్షలు, నగరిమొగసాల గొలుచు నవలక్ష ధనుర్ధరులకు యేడాదికి మూడుకోట్ల యెనభై లక్షలు రాజు మద గజంబులకు వృత్తమాశ్వంబులకై జీతంబుల వారికి రెండుకోట్ల యాభై లక్షలు, యేకశిలా నగరంబునగల దేవతా వైభవంబులకు వొక్కటియు, నగరిలో రాజగృహంబుల గట్టు పనివారికి ప్రతి వరుషంబును నొక్కటియు, వారణాసి విశ్వేశ్వరునకు, శ్రీశైల మల్లికార్జునునకు, శ్రీ వెంకటేశ్వరునకు, శ్రీ రంగనాయకులకున్ను, ఏకామ్రేశ్వరునకు, రామేశ్వరునకు. గోకర్ణేశ్వరునకు మొదలుకొని దివ్యదేశ నివాసమూర్తులకు వర్షంబునకు మూడుకోట్లు తన భండారంబున రెండుకోట్లు చెల్లుచుండె.

రాజ్యవైభవము

ఇట్లు విక్రమాదిత్య చందంబున మహా మహిమతో రాజ్యంబు పాలింపుచు, సకల భోగంబులు పరివార సమేతంబుగా ననుభవింపుచు రాజ్యంబేలు సమయంబున నతండు యేలిన దేశంబులు దైవికంబులుగా అత్యాశ్చర్య కరంబులై ఆనందకరంబుగా శోభిల్లునని, సకల జనంబులు కొనియాడు చుండుదురు. ఆ చరితంబులు తొల్లింటి యట్లు వారికై నాచే విన్న దుర్లభంబు గావున, శ్రీమత్ప్రతాపరుద్రుండు సాక్షాత్కారంబుగా రుద్రుండ, మర్త్యమాత్రుండుగాడు. అతని చరితంబులు ఆదిపురాణంబులట్ల సకలానంద కరంబులై యుండు, అది యెట్లనిన

శ్రీమత్ప్రతాపరుద్రుండు యొక పుణ్యాగ్రహణ కాలంబునందు మౌద్గల్యంబునకుం జని, గుండంబున తీర్థంబులాడి, యచట రామేశ్వరు సేవించి పెక్కు దానంబులు చేసి మరియు ప్రతాపరుద్రుండు పదునొకండు హిరణ్యధేనువులం జేసి, యొక్కొక్క ధేనువునకు లక్షలక్ష సువర్ణ టంకంబులు దక్షిణ యొసంగి, వేద వేదాంగ ప్రచండులైన విప్రోత్తములకు దానంబులిచ్చిన ఆ దానంబులు అందనేరని విప్రోత్తములు చండాలుల

వాకిటికిం జనిపోంగా చండాలులతోకొన్ని కుయుక్తి వాక్యంబులు పలికిన రాజుచేత తమకు ప్రాణహానియని యెఱుంగక యా దానంబు పట్టినబ్రాహ్మల అరికట్టుకొని ఆసువర్ణధేనువులు సజీవంబయ్యెనేని తరలదోలుకోపొండనియు నిర్జీవధేనువులయ్యెనేని మా సొమ్ములనియు బ్రాహ్మలతో వాదించిన యీవార్త ప్రతాపరుద్రుల కెఱింగించిన బహు విధంబుల రామేశ్వరు నారాధించిన యా రామేశ్వరు(డు) ప్రత్యక్షంబయ్యె. సువర్ణధేనువులు రాజు మొదలుకొని సకల జనంబులు చూచుచుండ యా ధేనువులు నడచుచుండె. అంత రాజు చండాలుల నఱికించియు రాజు యేకశిలా నగరంబునకు ప్రవేశించె.

హిరణ్యధేను దానము

మఱియు ఒకనాడు ప్రతాపరుద్రుండు కొలువు చాలించి సకల జనంబుల వీడుకొలిపి శివదేవయ్యయును తానును, అంతఃపురంబునకుం జనుదేఱ యారాజు పట్టపుదేవియగు విశాలాక్షి శివదేవయ్యగారిం జూచి పరపురుషుండుగదాయని మఱుగు కేగుటయు, అంత ప్రతాపరుద్రుండు శివదేవయ్యగారిని నిజమందిరంబున కనిపి రాజు మజ్జన భోజనాదులు దీర్చి నవరత్న ఖచితంబైన యొక్క పీఠంబున గూర్చుండి తన పట్టపుదేవి యగు విశాలాక్షి కిట్లనియె. "శివదేవయ్యనుజూచి పరపురుషుండని తొలగిపోయితివి. ఆయయ్య యీశ్వరుండుగాని మనుజమాత్రుండు గాదు యీయయ్యం బూజించి సుగతి గాంచు" మని యెఱుంగ బలుకుటయు యీ వాక్యంబు విశాలాక్షిదేవి తన చిత్తంబున పాదుకొలిపి శివదేవయ్య యెదుట తా నిలువనోడి పతి వాక్యంబులు మనంబున నిలిపి శివదేవయ్య గారి రూపంబుగా నొక్క సువర్ణప్రతిమ గావించి, వొక సువర్ణ వేదిపై నునిచి, షోడశోపచారంబుల బూజించుచుండె. అంత నొక్కనాడు మాసశివరాత్రి యగుటయు, యా ప్రతాపరుద్రుండును శివదేవయ్య(యు) నుపవసించి స్నానాది కృత్యంబులం దీర్చి, శంభులింగంబు నగరికిం జని, యద్దేవునిం జూచి యచట జాగరణంబు నేయుచున్న సమయంబున, శివదేవయ్య సుగంధంబైన త్రేన్పు గఱ్ఱున త్రేన్చినం జూచి ప్రతాపరుద్రుం డాశ్చర్యచిత్తుండై

శివదేవయ్య ప్రభావము

"మహాత్మ, మాతోడనే వుపవసించితివి ఈ వేగి నంతయు నేమియు గుడుచుటలేదు సుగంధంబైన త్రేన్పు త్రేన్చితివి కారణంబేమి ?" యని యడుగుటయు శివదేవుండును ప్రతాపరుద్రున కిట్లనియె"....యందు వసియించిన ఆరగించితి"ననిన ఆశ్చర్యపడి నగరికిం జని విశాలాక్షీ దేవిని అడ్గిన, తానును సువర్ణప్రతిమను చేయించి శివదేవయ్య యని నైవేద్యంబు....సమర్పించితిననిన, రాజుఆశ్చర్యపడి శివదేవయ్యగారి మహాత్మ్యంబు గొనియాడి, యిటు మహామహుండైన శివదేవయ్య గురుండును, సఖుండును, మంత్రియునై తనకు మహామహిమ చేకూర్చుచుండె

అందొక్కనాడు ప్రతాపరుద్రుండు కొలువై కూర్చున్న సమయంబున ప్రసంగోచితమ్మున జ్యోతిషంబు తమ సొమ్మని పంచాణంవారు వాదించుటయు యిందె పరీక్షించెదమని పోతోజు కన్నయ్య యనువాడు యొక్క మూహూర్తంబున పాషాణంబుపై లోహసలాక దిగ మొత్తించుటయు, ప్రతాపరుద్రుండు అతణ్ణి మెచ్చి వక గ్రామంబును శుభాశనంబును నిత్యంబును నడపం జేసి(న) అది విని అనుమకొండ రుద్రేశ్వరు నర్చకుండైన రుద్రజియ్యయను శివబ్రాహ్మణుండేతెంచి రాజుసన్నిధి నిల్చియిట్లనియె

విద్యావినోదములు

"పరీక్ష జూపినంతనె జ్యోతిషంబు పంచాణం భక్తులకు రానేర్చునె ? సజ్జ్యోతిషంబు తమదని వ్యతీపాత ప్రవేశంబున జిల్లేడుకొమ్మ విఱిచిన రక్తంబుగారుటయు యదిగని రాజుసంతోషించి వక్క గ్రామంబును పల్లకియు కృపచేసి నిల్పిన, యావార్త భూసురు లెఱింగి కటకటా యితరజాతి ప్రజ్ఞ మెచ్చె నిగ్రహానుగ్రహాలు అయిన విప్రజనంబుల మాహాత్మ్యంబులు యెఱుగరాదయ్యె యని రాజు సముఖంబున కేతెంచి యిట్లనిరి. "జ్యోతిషంబు వేదాంగంబౌట నీ వెఱుంగుదువు ? వేద వేదాంగంబులు ద్విజాతులకు గాని యితరజాతుల కెట్లు సిద్ధించు ? పరీక్ష జూపినది నిజంబుగాదు ఆపదవేళ (?)యెఱింగి యీ ధేనువునందు క్షీరంబు పిదుకుదురేని జ్యోతిషంబు వారికి" మ్మని వక్క గొడ్డుటావును జూపుటయు అది గని మునుపు పరీక్ష యిచ్చినవారలు తొలంగిపోయినం జూచి విప్రజనంబులలో వెలగతూర్తి సోమయ్య యనువారు యేతెంచి అమృత

వేళ యెఱింగి ఆ గొడ్డుటావుని పిదికితే కుంచెడుపాలు కురిసిన ఆప్రతాప రుద్రుం డతులితప్రియుండై యావిప్రుండు గోరిన యట్లు గోదావరితీరంబున 'కుశతర్పణంబను' గ్రామంబు అగ్రహారంబుగా నొసంగుటయు

మఱియు నొక్కనాడు (దక్షిణదేశంనబునుండి) సుదర్శనమిత్రుండు గజారూఢుండై నూర్వురు విద్వాంసులు గొలువ ఏకశిలా నగరంబున కేతెంచి ప్రతాపరుద్రుని కొలువుకూటంబున...... దా వాదభిక్షకు యేతెంచిన వాడనని పలుకుటయు యా విద్వాంసులు వాదముఖంబున సుదర్శన మిత్రుని వమ్ము పఱచిన యతండు గెలువనేరక చిక్కి కారుమాటలనైన గెలిచె (దననిత) లంచి యద్దినంబుకృష్ణచతుర్దశి యగుటయు సుదర్శనమిత్రుండిట్లనియె. "రేపు అమావాస్య నష్ట చంద్రుండు. ఇది నిజంబు మీరలందఱుకాదను"డనుటయు

మల్లికార్జునభట్ల ప్రభావము

...నగరి విద్వాంసులు నవ్వి "వోయి సహస్రధారల వుపమించనేర్చుటం జేసి సుదర్శనమిత్రుండని పేరుపెట్టుకొని వేదశాస్త్ర ముఖంబుల నిలువ లేక పోయి....తివి. అట్లయినను ఆమాట అప్రతిష్ఠం"బనిన అందఱు "రేపు నష్ట చంద్రుడుగాడు సంపూర్ణచంద్రుడు యిది నిజంబు" అని విప్రులు సభ వెడలి పోవుటయు....(శాక)వెల్లి మల్లికార్జునభట్లు అనుమకొండకేగి అచ్చట స్నానసంధ్యాది కృత్యంబులు దీర్చి భద్రకాళిగుడిలోకి వచ్చి యద్దేవి నారా ధించి పదకొండు శ్లోకంబుల స్తుతించెను.) ...నారూఢుండై యున్న యద్దేవి ప్రత్యక్షంబై "లేలెమ్ము వత్స! నీవాక్యంబు జనంబులకు ప్రతిష్ఠించెద" నని వరంబొసంగుటయు, యతండు (భద్రేశ్వరిచే) వరంబు గైకొని యేకశిలానగరంబున కేతెంచి తనవారల కెఱింగించిన అమావాస్య కృత్యంబులు పగలే తీర్చి(రి). అంత అస్తమయంబగుటయు తూర్పు దిక్కున చంద్రోదయంబై క్రమంబున చంద్రుని గతి చందంబున మహానిశి మ(ధ్యాకాశగతంబగు)చు చంద్రమండలంబు ద్విగుణీకృతంబై సర్వ జనంబులకు నానందంబుగా చంద్రుండు వెన్నెల గాయందొడంగిన జూచి సుదర్శన (మిత్రుండు) యేకశిలానగరంబు విద్వాంసుల పాదంబులకెరంగి "నాధి మానుషప్రజ్ఞ మీకును, మాకును (హస్తిమ శకాంతరంబు) గాదె,

నా యపరాధంబు క్షమింపు"డని పలుకుటయు, వారలు సుదర్శనమిత్రుని గారవించుటయు, సుదర్శనమిత్రుని గారవించి యాత(ని) ప్రతాపరుద్రుండు (మల్లికా)ర్జున భట్ల బ్రహ్మరథం బెక్కించి యా వోరుగంటి విప్రులకు పదిలక్షల వరహాలు సమర్పించుటయు సుదర్శనమిత్రుని గారవించి లక్ష వరహాలు (యిచ్చి) పంపుటయు.

మఱియు నొక్కనాడు సంతూరను గ్రామంబున కృష్ణమాచార్యుల తమ్ముండు అనంతాచార్యులు రజకస్త్రీతోడం గూడంగా ఆ రజకుండు ఆ యిద్దరి పొడిచితే మృతంబయిరి. అప్పుడి విప్రులు యిది(?) శూద్రపీనుగతో గూడ సమసిరి గనుక యా విప్రులు మోయకుండిరి. అదివిని కృష్ణమాచార్యులు తన మదిని విచారించి వాసుదేవమూర్తిని కీర్తించిన, ఆ శవంబు తనంతతానే కాష్టంబునకు నడచుటయు, యిది విని సకల జనంబులు విప్రులు యేతెంచి కృష్ణమాచార్యుల పాదంబులకు ప్రణమిల్లి మా యపరాధంబులు క్షమియింపుమనుటయు యా వార్త ప్రతాపరుద్రుండు చారులచే నెఱింగి కృష్ణమాచార్యుల రావించి పూజించి యేకశిలానగరి నాలుగవ భాగంబున యేబది గ్రామంబుల కధికారంబు, యొక్కయూరు అగ్రహారంబుగా నొసంగి యనుపుటయు, కృష్ణమాచార్యులు సంతూరున ప్రవేశించి కల్లతనంబు పుట్టుటం జేసి కల్లూరను గ్రామంబు గట్టి కోటపెట్టుటయు మూడు వర్షంబులు అధికారంబు చేసిన గ్రామంబుల కల్గు పదార్థంబు వెచ్చించి తామ్రపత్రికలు నేయించి యా పత్రికలమీద తాను రచించిన చాతుర్లక్ష గ్రంథంబు లిఖియించి అది శకటంబుపై పన్నుకొని శ్రీరంగంబునకు కొనిపోవ నుద్యోగించిన కొందరు ధూర్తులు కూడి యా రాజసముఖంబునకు బోయి "కృష్ణమాచార్యులకు మీరు అధికారం బిచ్చిన గ్రామంబు(ల) ఆ పదార్థంబువెచ్చించి తామ్రపత్రికలు నేయించి శ్రీరంగంబునకుం గొనిపోవుచున్నాడు" అని యెఱింగించిన ప్రతాపరుద్రుండు "అతండు మహాత్ముండు అతనికి యేది యిష్టంబో నాకు అదియె యిష్టం"బని యూఱకుండుటయు ఆ వార్త యిష్టజనులచే కృష్ణమాచార్యులు విని, పూజకపోయిన మూర్ఖత్వం

కృష్ణమాచార్యుల ప్రభావము

బని రాజసముఖంబునకు యేతెంచి, యాథై గ్రామంబుల పదార్థంబున వరుష త్రయంబునకు లెక్కలు వినిపించె. అప్పుడు మూడులక్షల వరహాలు ఆయమనిన, కృష్ణమాచార్యులు తన మనంబున వాసుదేవునారాధించి, వొక వచనంబు రచియించిన (మెచ్చి) యేకశిలానగరంబున కనకవృష్టి గురి యుటయు, యిదిగని ప్రతాపరుద్రుండును ఆ పరిజనంబులును కృష్ణమాచార్యుల బూజించిన వారిచే వీడ్కొని కృష్ణమాచార్యులు శ్రీరంగంబున కరుగుటయు.

మఱియొక్కనాడు తిక్కనసోమయాజుల వరప్రసాద(ంబు)చే(త) కుమ్మరమొల్ల రామాయణంబను వచనకావ్యంబు (?) రచియించి ప్రతాపరుద్రునకు అంకితంబుగా నేయు సమయంబున, నా రాజసమ్ముఖంబున వున్న విద్వాంసులు విని యిది శూద్రకవిత్వంబు యిది నిషిద్ధంబని నిరాకరించిన, యా రాజు సర్వజ్ఞుండు గావున [1]వారిని మెచ్చి రాజబ్రాహ్మణ కృతంబైన కావ్యంబు కావలెనని(న) యా విద్వాంసులు భాస్కరుని పిలిపించిన అతండు రచియించిన శ్రీమద్రామాయణంబు విను సమయంబున, అచటికి

రామాయణములు

మొల్ల యేతెంచి రామాయణంబు మున్ను రచియించి యున్నానని యచట నొకపద్యంబు చిత్రంబుగా చదువుటయు, యారాజు సర్వజ్ఞుండు గావున దానిప్రజ్ఞకు మెచ్చి విప్రజనంబుల మనంబులు నొచ్చునోయని మొల్లను బిలిపించి పల్లకియును నగరిని నిత్య జీవితంబును కట్టడజేసి, తనయెదుట నుండనీక తనదేవి విశాలాక్షి సమ్ముఖంబున నుండజేయుటయు, యావార్త విని శాఖవెల్లి మల్లికార్జునభట్లు నిరోష్ఠ్య రామాయణంబు రచించుటయు,

తదనంతరంబున రంగనాథుని బిలువనంపిన నతండు దక్షిణ దేశంబునుండి ఆందోళికపై నెక్కి చనుదెంచునప్పుడు త్రిపురాంతక విజయ గోపురంబులు నూచి అవి యేమి యని యడిగిన యా శిబికలు (?) త్రిపురాంతక గోపురంబు అని పల్కుటయు, యా శివభవనంబు జూడ నొల్లక మైనపుజడ్లు కప్పించుకొనియె. అప్పుడు రంగనాథుని [1]నేత్రబులు

1. వాన్ని.

కానరాక జాత్యంధు పగిది చలింపలేక రంగనాథుండు మగుడి శ్రీరంగంబు నకుంబోయి, యద్దేవుని ప్రసన్నుని జేసుకొని నేత్రంబులు పోయెనని మొఱ యిడుటయు అద్దేవుండు కరుణించి త్రిపురాంతకదేవు

రంగనాథుడు

వేడుకొనుమనుటయు, రంగనాథుండు మళ్ళి త్రిపురాంతకంబున కేతెంచి యద్దేవునకు నమస్కరించి తన[1]యెత్తు కృతులు సమర్పింతునని వ్రతంబునేసి భక్తిమయంబగు నొక రగడ చెప్పిన నద్దేవుండు ప్రసన్నుండయి రంగనాథునకు (ని)లువు కన్ను లొసంగుటయు, రంగనాథుండు [2]పాలకుర్తికింజని సోమనాథునిచే శివదీక్షం గైకొని యాయయ్య వద్ద శైవ రహస్యంబులు తెలుసుకొనుచుండె.

అంత నక్కడ ప్రతాపరుద్రుండు రంగనాథుని ప్రభావంబు విని ఆశ్చర్యంబు నొందింతన మంత్రియగు పాలకుర్తి సూరయ్య ప్రతాపరుద్రున కిట్లనియె. "పాలకుర్తి సోమనాథుండు రచియించిన శివకథలుదేవర రేపు శంభుని సేవింపబోయినప్పుడు సుఖస్థితి కూర్చుండి వినియెద" వనిన, మఱునాడు ఆరాధ్య చరిత్ర వినుచుండగాను, కొందఱు ధూర్తజనులు "పాలకుర్తిసోమనాథుండు చెప్పినవి నూతనంబులు గాని యాద్యంతరంబులుగావు" అని నిరాకరించిన యా ప్రతాపరుద్రుండు ఊరకుండి తన నివాసంబునకుం జనియె. అచట శివభక్తులు సిగ్గుపడి పాలకుర్తికిం జని సోమనాథున కెఱింగించిన యా సోమనాథుండు శైవులుగాని వారల జూడకుండుటంజేసి యొక్క బండిపై గుడారంబు పన్నించి యందుమీద

పాలకుర్తి సోమనాథుని ప్రభావము

దాను గూర్చుండి, లింగముద్రల యెడ్ల గట్టించి, యేకామ్ర గురుండును రంగనాథుండు మొదలుగాగల శిష్యగణంబులు తన్ను గొలువ, యేకశిలానగరంబునకుం జనుదెంచి యాబండి గట్టిన యెడ్లు గవని చొఱకున్న నెఱింగి గవనిపై అడ్డ దూలంబున జేసిన (భవి) ప్రతిమయు రెండు యేనుగులుంటం దెలిసి తొలగుమని పలుకుటయు, అది తునిసి యిరుగడులం బడుటయు, అంత యేకశిలానగరంబున శిష్యుడైన యిందులూరి యన్నమదేవు నివాసంబున

1. యతు; 2. పాలకుర్తి యని వ్రాయబడినది.

నుండుటయు, యావార్త ప్రతాపరుద్రుండు యెరింగి విస్మయం బొంది (న) కొందరు ధూర్తులు సహింపజాలక శిలలు దెగిపడుట మంత్ర విద్యగాని వాక్యసిద్ధి గాదనిన యతని వద్దకుంబోయి యాగుట్టు దెలిసి యిపుడే వత్తు మని రాజుచే ననుజ్ఞగైకొని యా సోమనాథుని వద్దకుం జనిన, యతండు అన్యమతస్థులం జూడకుండుటంజేసి, ద్వారపాలకులచేత నివారితులై మగిడి పురవీథి కేతెంచి గుంపులుగూడి "కటకటా! వేదశాస్త్ర సంపన్నులం జూడ రాదట! చండాలుండైనను [1]శైవుండయ్యేనేని మాట్లాడ చూడ వచ్చునట యట్లకాక" యని (య) తన్ని హాస్యంబుచేసి యాప్రొద్దె పురంబు వెడల నడుపవలయునని తలంచి అప్పురిలోపల గ్రాసార్థులై తిరుగు అంగహీనుల మొండి ముక్కిడి మొఱ్ఱివాండ్లను, అంధులను, బధిరులను, మూగలను మరియు రోతజనముల రావించి మీరుపోయి యాసోమనాథుని హాస్యంబుచేసి వచ్చితిరేని, మీకు అన్నంబు వస్త్రంబు నిచ్చెదమని యొడంబఱచి వారలకు లింగధారణ, విభూతి రుద్రాక్ష...అతని ప్రభావంబునజేసి అంగహీనులకు అంగంబులును, అంధులకున్ను కన్నులు, బధిరులకు వీనులు, మూగలకు వాక్యంబులున్ను....అత్యంత సంతోషంబున ఆ అయ్యకు నమస్కరించి బహువిధంబుల గొనియాడి యా సోమనాథుని(చే) ననుజ్ఞాతులై పురవీథికే తెంచుటయుజూచి యా సోమనాథుని మహిమ గొనియాడిరి. ఆధూర్తులు లజ్జ గొనిరి. ఆ ప్రతాపరుద్రునకు సోమనాథుం డిట్లనియె "నా యొక్క వ్రతంబు చేపట్టి నడువు" మనిన, ఆ వ్రతంబు భంగపడకుండా నడుపుమనిన, శివుండు ప్రత్యక్షంబవునని యెరింగించిన, ఆ రాజు.... యెట్టి వ్రతంబు పట్టుమందువని యడిగిన ఆ రాజును జూచి శివదేవయ్య "భాగీరథి జలంబుల అభిషేకంబు గావించికాని కుడువరాదని వ్రతంబు.... ...." యెరింగించిన యట్లకాక యని నిజవాసంబునకు జనుదెంచి నిత్యంబు భాగీరథి జలంబులు దెచ్చునట్లుగా మూ...ని ప్రభావంబునం జేసి అంగవా(?)నిత్యంబును భాగీరథి జలంబులు దెప్పించి శంభుని లింగంబున కభిషేకంబు నేయుచుండె నంత......యి అత్యంత సంతోషంబున ఆయయ్య దృఢభక్తిం జూడగోరి యేడుదినంబులు

1. పేర్పుండగు.

భాగీరథి జలంబులు రాకుండిన...ప్రళయ కాలమేఘ(ము)పంపంబున నుఱుములు మెఱుములు మహావాయువుచే భాగీరథి జలంబులు వెచ్చు...కావంగ్ల వారు రాక వానచేత నొక్కొక్క మూల నొదిగిరి. ఇక్కడ ప్రతాపరుద్రుండు...ఖడ్గఖేటకంబులును మైదపుజిడ్డు పట్టించుకొని పరిజనంబులు తన్ను కొల్వ వచ్చుచుండ కోటచెఱువు వీథిలోపల నచట మహావాయువులచే (ఖడ్గ) ఖేట కంబు లెగసిపోయిన మేఘంబులు నురుములు పిడుగులును వాయువు వానయు గూడ నొక్క యుద్ధవిడి వచ్చిన నోర్వలేక, చెదరి పరిజనంబులు నేలపై బడిరి. ఆ రాజు చలింపక ధైర్యంబుతోడ, వానల స్రుక్కక, బుద్ధి చలింపక, భక్తిమఱవక, వేసరక, శంభుని నగరి(కి) బోవ శక్యంబుగాక పెద్ద యెలుగెత్తి "శంభులింగా! మహాదేవా! నీలకంఠా! మృత్యుంజయా! కైలాసవాస యని పిలుచుటయు యాక్షణంబున నందివాహనారూఢుండై (శివుండు), ప్రమథగణంబులు గొలువ ప్రత్యక్షంబయ్యె. అంతనిర్మేఘంబై సూర్యమండలంబు గానంబడిన, యప్పుడు ప్రతాపరుద్రుండు శంభులింగంబునకు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి బహువిధంబు నుతియించిన యద్దేవుండు మెచ్చి "నీకు వరంబిచ్చెద యడుగు"మనుటయు, శ్రీమత్ప్రతాప రుద్రుండు ముకుళిత హస్తుండై "దేవా తనకు వ్రతభంగంబుగాకుండునట్లుగా కృపసేయు"మనుటయు, యంతయు మెచ్చి "పురంబునకు వుత్తరభాగంబున క్రోసు పర్యంతరంబున భాగీరథీ జలంబుల బుగ్గ గజతుండ సమానంబై మీకు కానవచ్చు, నీవ్రతంబు చెల్లుచుండును నీవు గంగాగర్భంబున వెడలి ది(వ్య) విమానారూఢుండవై కైలాసంబునకు వచ్చెద" వని వరంబొసంగిన శివుండు ప్రత్యక్షంబైన చోటనే శివాలయంబు గట్టించి ప్రతాపరుద్రుండు మంత్రి సమేతుడై పంచమహా వాద్యంబులతో బోరుకలుగ మహావైభవంబుతో పురంబు వెలువడి యొక్క రమ్యప్రదేశంబున నిలచియు ఘోష పెట్టుచున్న సమయంబున గగనంబునం బై చంద్ర ప్రకాశంబైన భాగీరథీజలంబుల బుగ్గ యెగసివచ్చుటయు, నజ్జలంబులు ప్రతాపరుద్రుండు చూచి అత్యంత భరిత సంతోషంబున సర్వజనంబులును తాను స్నానంబుచేసి అక్కడ శివాలయంబు గట్టించి యొక్క తులాపురుషంబు దూగి కోటిసువర్ణంబులు

దానంబుచేసి, మరి యజ్ఞలంబులు హేమకుంభంబుల నునిచి మదగజంబులపై నిడుకొని మహా వైభవంబుతో శంభునగరుకు యేతెంచి, అభిషేకంబు గావించి నైవేద్యంబు సమర్పించి బంధు హిత సామంతపంక్తి గూర్చుండి భుజియించిరి.

శ్రీమత్ప్రతాపరుద్రుండు రెండవ దేవేంద్రుండై సకల విభూతి సంపన్నుండై యున్న సమయంబున పాలకుర్తి సోమనాథుండు యీ దేశంబున మాత్రవతంబు చెల్లదు దక్షిణ దేశంబునకుం బోయెదననిన ప్రతాపరుద్రుండు [1]"గొట్టి పర" ను గ్రామంబు నగ్రహారంబుగా నొసంగుటయు ఆయయ్య యనుమతంబున రంగనాథున్ని తనవద్ద నుంచుకొనుటయు, యిట్లపారంబుగా దైవికంబగు చరిత్రంబు చెల్లించుచుండె.

గొట్టిపరు అగ్రహారము

ఈ క్రమంబున ప్రతాపరుద్రుండు రాజ్యంబు నేయంగాను తన యాజ్ఞకు మరలబడ్డ పశ్చిమ దేశాధీశ్వరులగు తురుష్కులపై దళంబుల బంపె. వారి నోడించి యా పారశీరాజును యేకశిలా నగరంబున [2]గిరువు బెట్టుటయు ఆ సమయంబున దేవగిరినున్న రామదేవరాయలు పారశీరాజు తమ్మునిం గలయుటయు యేకశిలా నగరంబున గిరువువేసిన పారశీరాజు మృతిబొందిన, యతని యనుజుండు జమాను మలుకా ఫకీరు వేషంబున ఏకశిలా నగరంబునకు...చేత సాధ్యంబు గాకుండుటం జేసి తన యన్నసతికి సుతులకున్ను తాను ఎరుకజేసుకొని వారిని ఫకీరువేషంబున పురంబు వెడలి(ంచి)...వాండ్లనునిచి రామదేవరాయలును తానున్ను జమాను మలుక ఢిల్లీకి బోయి సులతానిం జూచి ఏకశిలా నగరంబు బలంబు తెలుంగుకొలందియు చెప్ప...కార్యంబూహించి ఏకశిలా నగరంబు సాధింపదలచిరి.

జమాను మలక

అప్పుడు సులతానితో గూడిన రాజులు పశ్చిమదేశాధీశ్వరుండు లక్ష గుఱ్ఱంబులను రెండు లక్షల పదాతివర్గంబును, బదరిదేశాధీశ్వరుండు లక్ష గుఱ్ఱంబులును, మూడు లక్షల పదాతివర్గంబును, మహారాష్ట్ర దేశా

1. ఈపేరు ప్రతా. చరి.లో లేదు; 2. గిరి వేయించుట ప్రతా. చరి.

ఢీశ్వరుండు లక్ష గుఱ్ఱంబులును, రెండు లక్షల పదాతివర్గంబును, కటక వల్లభుండు యాభై వేల గజంబులును, యెనిమిది లక్షల పదాతి వర్గంబును, తక్కిన చిల్లర రాజులు రెండు లక్షల గుఱ్ఱంబులును రెండు లక్షల పదాతి వర్గంబు యీచొప్పున దళంబులు కూర్చుకొని రావర్లవద్ద విడియుటయు ఢిల్లీశ్వరుండు మల్లిఖనేఖానుని దళవాయిజేసి రెండు లక్షల యాభై వేల గుఱ్ఱంబులును, పదేను లక్షల పదాతివర్గంబును గూర్చి, ఏకశిలా నగరంబుకు యీశాన్య భాగంబున మౌద్గల్యంబున విడియుటయు, యిట్లు ప్రతాపరుద్రుండు చారులచే విని నరపతిరాయల కెరింగించిన అతడు ముప్పై రెండు లక్షల పదాతి వర్గంబులతో దక్షిణ దిగ్భాగమున [1]వెల్పుగొని నరపతిరాయలు విడియుటయు ఏకశిలానగరంబునగల తన మూలబలంబు డెబ్బదియేప్పురు పద్మనాయకులున్ను రాజు తమ్ముండు అన్నమదేవుండును మలికినెఖానుని బలంబుల మీదికి పంపుపెట్టి పనుపుటయు...కటక వల్లభుని మీదికి నరపతిరాయలను పంపుటయు, సులతాని బలంబుల మీదికి తన మూల బలంబులతో వెడలి...యుద్ధంబునేయు సమయంబున [2]లిలినేఖానుండు సమసిన హతశేషులు ఢిల్లి మార్గంబు పట్టి పారుటయు, అన్నమదేవుండు నేయు యుద్ధంబున మలికి విరిగి పారుటయు, రామదేవరాయల తల దునిమిన బలంబులు పారిపోవుటయు, కటకవల్లభుని సైన్యంబుతో యుద్ధముచేసి గజంబు లంపుచు వెయ్యి గజంబుల పట్టుకొనునపుడు కటకవల్లభుండు విరిగి పారుటయు యిట్లు హతశేషమైన వారలు ఢిల్లికిం జనిరి...

ఢిల్లీసుల్తానుతో యుద్ధము

బలంబులంగూర్చి బిసురుఖానుని దళవాయింజేసి పంపిన యుత్తరాన విడియుటయు, చిల్లరరాజులు యెప్పటియట్ల బలంబు కూర్చుకొని పశ్చిమంబున విడియుటయు, కటకవల్లభుడు బలంబుల గూర్చుకొని మౌద్గల్యంబున విడియుటయు కటకవల్లభునితో నరపతిరాయలు సంగరంబు నేసి నాల్గువేల గజంబులం దునిమె...కటకవల్లభుని తల ద్రుంచుటయు చావంగా చిక్కిన బలంబు తొలంగిపోవుటయు, చిల్లర రాజులున్ను పారిపోవుటయు, సింధు

1. వేల్పు గొండ స్థానముగానని 'ప్రతాప చరిత్ర'; 2. మంఘుఖానుం డని ప్రతా. చరి.

కటకంబు....పట్టించుకొని మగుడ బలంబులు గూర్చుకొని యెప్పటియట్ల మౌద్గల్యంబున విడియుటయు యిట సులతాని బలంబులు మూడు లక్షల గుఱ్ఱంబులును పదిలక్షల పదాతి వర్గంబును ఏకశిలా నగరంబునకు ఉత్తర దిక్కున విడియుటయు కటకవల్లభుండు యిట్ల బలంబులం గూర్చు కొని పడమట రాచర్లకాడ విడియుటయు యెప్పటియట్ల మూడు దిక్కులవారు సంగరంబు సేసి తిరుగుటయు, కటకవల్లభుండు ముకుందసుందరుండనువాని పట్టంబు గట్టి(న) ముకుందసుందరుం డొకనాడు ఏకశిలాపురంబు చూడ వచ్చుటయు ఏకశిలానగరంబు చొచ్చి అన్నివీధులు చూచి రాజద్వారంబు చూచుసమయంబున అతన్ని యెరిగిన దొరలు యతండు కటకవల్లభుండు అని ప్రతాపరుద్రున కెరింగించిన ప్రతాపరుద్రుండు యా ముకుందసుందరుని బట్టించి గిరవు వేయించుటయు అప్పురివైశ్యుండు కోటిపల్లి విశ్వనాథుం డనువాడు ప్రతాపరుద్రునకు మూడుకోట్లద్రవ్యంబు నిచ్చి యా ముకుంద సుందరుని విడిపించుటయు, అంత కటకవల్లభుండు...తన వేలంబు చేరి నరపతి రాయలతో సంగరంబు సేసి విరుగుటయు, వుల్లుఖానుండు సంగరంబు చేసి విరిగి పారుటయు...గుండంబులోనున్న హేమగోపురంబులు చూచెద మని గుండంబు కట్ట దీసివేయుటయు యా జలంబులు పాకాల...గ్రమ్మిన, చెర్వుకట్ట త్రవ్వించి యా జలంబులు పోయినవెనుక యా గుండంబులో మహోత్పాతంబులు గనుపట్టిన కటకవల్లభుండు...గజగజ వణంకుచు, తన పురంబునకుం జనియె.

తిరిగి బలంబులు గూర్చుకొని యేకశిలానగరంబునకు యెప్పటియట్ల వచ్చి....కడమ రెండు మొనలవారు యెప్పటియట్ల విడియుటయు, కటక వల్లభునిపై నరపతిరాయలున్ను, జమాను మలుకా చిల్లరరాజులున్ను విడి యుటయు వారి అన్నమదేవుండు డెబ్బదియేడ్గురు పద్మనాయకులున్ను, సుల తాని బలంబులకు దళవాయియైన వుల్లుఖానునిమీదికి ప్రతాపరుద్రుండును తన మూలబలంబులు నవలక్ష ధనుర్ధరులు తలపడి ఘోరయుద్ధంబు సేసిన విరిగి పారుటయు, యీ విధంబున యేడుమార్లు పోరిపోరి సాధింపనేరక చింతా క్రాంతులై సులతాని బలంబులకు దళవాయియైన వుల్లుఖానుండు సంధి సేయం

దలచి, కార్యంబూహించి యితరజాతి నాయకులు తమజాతి నాయకత్వంబు తీసుట (?) యెగ్గుగా దలంచి...యాభై లక్షల వరహాలు యియ్యజేసుకొని ఏకశిలానగరంబునకు వచ్చి ప్రతాపరుద్రుని సన్నిధికి వచ్చి స్వామి హితవరులంబోలి యీ దినంబు ..రణరంగంబునకు యనుజ్ఞయిడి, అయిదు లక్షల పదాతివర్గంబును యెన్నికనిప్పుటయు, అంతట వుల్లుఖానుండు మూడు......తేరాల [1]బుచ్చారెడ్డిని పిలిపించుకొని సంధిచేసుకొని తక్షణ మందె పద్దెనిమిదిలక్షల వరహాలు యిచ్చి కడమ కార్యాంతరంబున యియ్య జేసుకొని...

రాజసముఖంబునకు స్పర్శవేదిలింగంబు పూజాస్థ్లవచ్చి "శంభులింగంబునందు స్పర్శజేసిన లోహంబు యెప్పడి యా...యంబగు తేజంబు నిలువదయ్యె"నని విన్నవించుటయు ప్రతాపరుద్రుండు విని వెరగుపడి దేవరా ప్రసాదంబు తనకు తొలగుటయు....నకు సన్నద్ధుండై అనుమకొండ సిద్ధేశ్వరు నారాధించి, యట చని పద్మాక్షి బూజించి యద్దేవి పూర్వదత్తంబులైన ఖడ్గఖేటంబులు సన్నిధియందు పెట్టి నమస్కరించుటయు ఖడ్గంబు సర్పాకారంబై పద్మాక్షీదేవి వదన గహ్వరంబు దూరిపోవుటయు, యాఖేటకంబు అంగరాగంబు చందమున...నుద్దీప్తమగుటయు, అవిజూచి శివదేవయ్యాయు, శాఖవల్లి మల్లికార్జునుండు మొదలుగాగల పెద్దలు ప్రతాపరుద్రుని కిట్లనిరి. "[2]పద్మాక్షియు తొల్లి మాధవవర్మకు యిచ్చినప్పుడు జూపిన ఆజ్ఞాపించిన వివరము, మీ సింహాసనంబున సహస్ర వరుషంబుల వుండునని మహాశక్తియ...ఆనతిచ్చెను. నేటివరకు సహస్ర వరుషంబులు దీరిపోయెను" అని యానతిచ్చి "యింక మానుష శక్తియకాని తొల్లింటి యిట్ల దైవశక్తి లేదు"యని యెరింగించిన ప్రతాపరుద్రుండు చింతాక్రాంతుడై పద్మాక్షిదేవిని బహువిధంబుల నుతియించి సకలజనంబులతో నిజనివాసంబునకు యేతెంచి పరుస వేదిలింగంబునకు సాష్టాంగ దండప్రణామంబు లాచరించె.

తదనంతరంబ మరునాడు కయ్యంబున కాయత్తపడి కటక వల్లభునిపై నరపతి రాయలున్ను జమానులు ఖానుమీద పద్మనాయకులున్ను

1. భోజారెడ్డి యని ప్రతా. చరిత్ర; 2. పద్మావతియు.

నవలక్ష ధనుర్ధరులున్ను సింధురాజును గూర్చి పశ్చిమంబునకు బంపె. సులతాని బలంబులమీదికి ప్రతాపరుద్రుండు తన పద్మనాయకులున్ను, అయిదు లక్షలున్ను, బూచారెడ్డి మూడు లక్షలున్నుఁ తక్కినరాజులు యీ బలంబులున్ను, కన్నోజీరాజు రెండులక్షలగుఱ్ఱంబులున్ను...జు యెనుభై నూరుయేనుగులు తన ఖాసామదంయేనుగులు యిన్నూరు తన్ను గొలిచిరా శ్రీమత్ప్రతాపరుద్రుండు వైభవంబున యేకశిలానగరంబున శోభిల్లి యుద్ధంబునకుం జనుదెంచి యుద్ధంబు సేయు సమయంబున, యితరజాతి నాయకులు కొంత యుద్ధంబుజేసి సమయుటయు, వారింజూచి తేరాల బుచ్చారెడ్డి యుద్ధంబు చాలించి కడకుం జనియె. మరియు తక్కినరాజులు కయ్యంబుచేసి కొత్త బలంబులం జంపిన అపుడు కన్నోజిరాజు కొన్ని గుఱ్ఱంబులను జంపి తాము సమయుటయు, వీరపాండ్యరాజు ఘోర యుద్ధంబు జేసి బలంబులు ...గులపో...యుటయు, యిట్లు సర్వసేనలున్ను సమసిన.

రుధిరోద్గారినామ సంవత్సర ఆశ్వీజ బహుళ విదియా గురువారం నాడు మదగజా రూఢుండై యున్న శ్రీమత్ప్రతాపరుద్రుని ఆయకంబు చేసికొని, తమ మావటిని యెక్కించి గజారూఢుడై చనుదేర వుల్లుఖానుండు ...దానును శిబిరంబు ప్రవేశించినంత "ప్రతాపరుద్రుండు పట్టుబడియె"నని యీ వార్త యేకశిలా నగరంబు జనులు యెఱింగి...గావగచి, ప్రతాపరుద్రున్ని కలయుదమని తలంచి, చనుదెంచిరి. ప్రతాపరుద్రుండు పట్టువడెనని అన్నమ దేవుండు విని దెబ్బదియేడ్గురు పద్మనాయకులు శోకరోషంబులు పెనగొన జమాను మలుక నెదిరించి ఘోర యుద్ధంబుసేసి జమానుమలుఖాను తల ద్రుంచుటయు, జమానుములక తమ్ముండు సిద్ధిఖానుండు హతశేషంబులం గల్పుకొని వుల్లుఖానుని గలియుటయు, వుల్లూఖానుండు సిద్ధిఖానుండు నిద్దరు ...ప్రతాపరుద్రుని ఢిల్లీశ్వరు సమ్ముఖంబునకు బంపు యత్నరీబు వూహించుచున్నంత రాత్రియగుటయు, యితర జాతినాయకులు తమకునొ...లక్ష వరహాలు యిమ్మని వుల్లుఖానుని అడిగిన యితర జాతి నాయకులతో మున్ను

(ప్రతాపరుద్రుని చెఱ)

1. అమానుమాలకా.

మీకు యిచ్చిన యిరువదియైదు లక్షలు మగుడ యిమ్మని అడ్గుటయు, యీ వార్త ప్రతాపరుద్రుండు సర్వంబు విని తహతహపడి తాను రణభిక్షకై తెచ్చిన యందులోపల యిరువదేను (లక్షలు)......యయిన వుల్లూఖానునికి యిప్పించి యితరజాతి నాయకుల విడిపించినవారు సిగ్గుపడి ప్రతాపరుద్రుని యీ వితరణంబు తలంచి...తేరాల బుచ్చారెడ్డి విచారించుకొని తమ బలం బులం గూర్చుకొని ప్రతాపరుద్రుని విడిపించుకొను వారమని శపథంబులు ...దెంచుటయు. సులతాని దళంబులు లక్ష గుఱ్ఱంబులు యెనిమిదిలక్షల పదాతివర్గంబును [1]వెనుకనువేచి ఢిల్లిమార్గంబు బట్టి పోవుటయు...(చే)రువ యితర జాతి నాయకులు బుచ్చారెడ్డి మొదలుకొని సులతాని బలంబుల పోనీయక అరికట్టుకొని యుద్ధంబు చేసి యేభై వేల గుర్రంబులను మూడు లక్షల పదాల వర్గంబును దునిమి, యితరజాతి నాయకులు నిరవశేషంబుగా మడిసి(రి).

సులతాని దళంబులు కయ్యంబున అలసి గోదావరి గర్భంబున విడియుటయు, ఆ ప్రతాపరుంద్రుండు మజ్జన భోజనాదులు దీర్చి కూర్చుండు సమయంబున ప్రజలు ప్రతాపుని సముఖంబున...వచ్చిన వారు కరదీపికలు వేయిన్నేనూరు, ఛత్రచామరంబులవారు, వూడిగంబులవారు వేయిన్నేనూరు పరిహాసకులు నలుబంద్రును శాకవెల్లి మల్లికార్జునుడు మొదలుకొని విద్వాం సులు నూరును, గుండంభట్టు మొదలుకొని పురోహితులు నూర్వురును, ఉత్తమ క్షత్రియులు రాజ సంబంధులు యేనూరును, అపార ధన సమేతు లైన వైశ్యులు యిన్నూరును నాటకశాలలు యెనిమిదియు, జట్టి మల్లులు నూర్వురును, చికిత్సకులు నూర్వురును,-జ్యోతిష ప్రజ్ఞావంతులు యిరువ యిన్ని, రజక క్షౌరకులు వేయిన్ని, సకల నియోగంబులవారు యేడు నూర్లును, రాజుయొక్క ఉత్తమాశ్వంబులు యేనూరును, గజంబులు యెని మిది నూర్లును, శివదేవయ్య, శరభాంకుండును. మల్లికార్జునుండు, రంగ నాథుండు మొదలుగాగల వారును యిన్నూరుగురును, ప్రతిమాసంబు తులా పురుషంబునకు మూడు కోట్లును, సకల నియోగంబుల వారును, రాజు

1. వెక్కువను.

సముఖంబునకు వచ్చిన యారాజు అందరి సర్వస్థితి గారవించి శివదేవయ్యం జూచి. "ఆ హితాగ్నులు తేనయితి"రని యడిగిన, నాయయ్య మనము యీ దేశంబునకు అతి త్వరితంబుగ మరల గలవారమని యానతిచ్చుటయు, అందు యొక్క విప్రుండు ప్రతాపరుద్రీయంబను కావ్యంబుచెప్పి ఆరాజునకు అంకితంబుగా జేయుటయు, యారాజు శలాకపరీక్షచే

విద్యానాథుఁడు

నచట చదివించుటయు, సర్వజ్ఞుండు...యా విప్రునకు ప్రతాపరుద్రుండు అంగుళీయకంబు నిచ్చి యతనిని విద్యానాథుం డని యేనుగు నెక్కించి చాటించుటయు ఆ విద్యానాథుండు రాజుచే సెలవంది యేకశిలా నగరంబునకు నేతెంచి, ఆవుంగరం వ్యవహారుల ముందరబెట్టి యిందుకు తగిన ద్రవ్యంబు యిమ్మని యడిగిన యా వర్తకులు చూచి యిది యమూల్యంబు యిందుకు తగిన ద్రవ్యంబు యివ్వలేమనిన, యా విద్యానాధుండు వేసరి మీరు ఒసంగి నదియే మాకు పదిలక్షలని పలికిన యా విప్రువి వాక్యంబు ప్రతిష్ఠించి యా వుంగరంబునకు పదిలక్ష లొసంగుటయు

యిక్కడ నరపతిరాయలు ప్రతాపరుద్రుండు పట్టుబడుట విని తనకు నడ్డంబైయున్న కటకవల్లభుని జంపి సులతాని బలంబులం ద్రుంచి ప్రతాప రుద్రుని మగుడ దెచ్చెదనని తలచి కటక బల్లహుని గజంబులు గెలువ శక్యంబులు గాకుండుటంజేసి, అశ్వత్థామ మతంబు దలచి బలంబుల నాయత్త పరచి రాత్రి సుఖసుప్తులైన కటక బల్లహుని బలంబులపై బడి పొడిచియు నఱకియు పెక్కు భంగుల కయ్యంబు చేసి నాలుగువేల గజంబుల దునిమి మూడువేల గజంబుల పట్టుకొని పన్నిద్దరు రాజకుమారుల ద్రుంచి(న) కటక బల్లహుని బలంబులు విరిగి పారుటయు, అప్పుడునరపతి రాయలు అదియె గెలుపు జేసుకొని సులతాని బలంబులం గూడి యుద్ధంబు చేసి యాభై వేల గుఱ్ఱంబుల, లక్ష పదాతుల ద్రుంచుటయు,సులతాని బలంబులం బోనీయక అరికట్టుకొనుటయు, అప్పుడు వుల్లూఖానుండు మనంబునవిచారించి రాజును మరల విడిపించికొనిన కార్యహాని యని చింతించి నిలిచి కయ్యంబు చేసితిమేని ప్రాణహాని యనుటయు రాజును ఢిల్లీ పురంబునకు పంపవలెనని దలంచి, యొక్క గూఢమార్గంబున యిరువదివేల గుఱ్ఱంబుల సహాయంబు

చేసి ఢిల్లీపురంబునకు ప్రతాపరుద్రుని పరివార సమేతంబుగా బంపుటయు, ఆ సమయంబున కటకవల్లభుండు అయిదువేల గజంబులం గూర్చుకొని వుల్లాఖానునిం గలియుటయు.

మరి యన్నమదేవుండు డెబ్బదియేడ్గురు పద్మనాయకులు నరపతి రాయలం గల్పుకొని సులతాని దళంబుల చుట్టివేసుకొని ప్రతాపరుద్రుని మున్నున కొనిపోవుట యెరింగి, అరికట్టుకొని యొక్కనాటిరాత్రి కటక బల్లహుని బలంబులపై బడి, సర్వబలంబులంగూర్చి నాలుగువేలం దునిమి, శిబిరంబుజొచ్చి కటకవల్లభుని తల్లద్రుంచుటయు, మగుడి నరపతిరాయలు అన్నమదేవుండు విద్యానగరంబు సేరుటయు, కటకబల్లహుని ప్రధానులు నరపతిరాయలు, అన్నమదేవునింగారి సముఖంబునకు పోయి, యేకశిలా నగరంబున వున్న రామచంద్రదేవుని తమకు యియ్యజేసికొని, కటకంబునకు పట్టంబు గట్టుకొని, ఏకశిలానగరంబు చేరుటయు(?)

యా ప్రతాపరుద్రుండు పట్టుబడి వచ్చుచున్నవార్త ఢిల్లీశ్వరుండు చారులచే నెఱింగి, మూడు యోజనంబులమేర యెదురుగాబోయి, మహా వైభవంబుతో తన పురంబునకు దోడ్కొనిపోయి, బహువిధంబుల సత్కారంబుల గావించుటయు, సింహాసనంబున గూర్చుండజేసి యొక్క యర్ఘ్య పీఠమందు గూర్చుండి మాటలాడుచున్న సమయంబున ప్రతాపరుద్రున్ని వుండంజేసి సులతాను తమ తల్లికి యెఱుంగం జేసిన యా మానిని ప్రయాగ

ప్రతాపరుద్రుని ఢిల్లీసుల్తాను గౌరవించుట

మాధవసేవాపరిణత యగుటంజేసి తన కొమారుండైన సులతాని నూరడించి ప్రతాపరుద్రుండును (నీవును) మహనీయశయ్యల సుఖసుప్తులైన యిద్దర తారతమ్యంబులు నాకు నెరుంగవచ్చు నేను చూచెద"నని పలికిన అట్లుకాక యని యా రాత్రి యొక్కమేడపై యిద్దరు పవ్వళించిన సులతానితల్లి యేతెంచి చూచునప్పుడు వారల యిద్దరియందు హరిహరాత్మకమైన తేజంబు గనిపించి యత్తేజంబులు యిద్దరియందు యేకంబై యంతరిక్షంబున నడగి పోవుటయు, యజ్జనని చింతించి వారల బోధితులజేసి "మీరు హరి హరాత్మకమైన తేజంబులు. మీలోమీరు వైరంబులు చాలింపుడు మీయిద్దరికి

తొల్లిటియట్ల మహామహిమలు చెల్ల" వని బోధించి పలుకుటయు, సులతానియు (?) మేలుకాంచి, ప్రతాపరుద్రునివెంట వచ్చిన విప్రులకున్ను, తక్కిన రాజులకున్ను, మూడుకోట్ల ద్రవ్యంబు పంచిపెట్టించి ప్రతాపరుద్రునకు నానావస్తువులు సమర్పించి వినయపూర్వకముగ నిట్లనియె.

"ఏను నీకు నపరాధంబు జేసితినని నీవు మనంబున నుంచక యేకశిలా నగరంబునకు ప్రవేశించి సింహాసనంబున గూర్చుండితినన్న శుభవర్తమానంబు పంపవలయు నిదియె నా విన్నపం"బనిన ప్రతాపరుద్రుం డిట్లనియె "డెబ్బదియారేండ్లు రాజ్యభోగంబు లనుభవించితి యింక జాలును. యేను మణికర్ణికయందు స్నానంబు సేయుచు, విశ్వనాథు నారాధించి, వారణాసియందు నిల్చెద, రాజ్యభోగంబుల సహస్ర గుణితభోగంబులు అక్కడనునికి నానందం"బనిన సులతానియు ననేక విధంబులుగా నొడంబరచి ఏకశిలా నగరంబునకు.... సింహాసనంబున గూర్చుండి మగుడ కాశికి జనుదెమ్మని యిరువైవేలు గుఱ్ఱంబులు సహాయంబుగా నియమించి ప్రతాపరుద్రుణ్ణి గజారూఢునిజేసి సులతాని యొక్క యోజనంబు ప్రతాపునివెంట పాదచారియై నడచిన యొడంబడి యట్లకాక యని సులతానిని నిల్పి కాశికిం జని ప్రతాప దేవేంద్రుండు మణికర్ణికంగ్రుంకి, విశ్వనాయకుల నారాధించి, యచట యెనిమిది తులాపురుషంబులం దూగి కోటి సువర్ణంబులు దానంబులు యిచ్చి, యేకశిలా నగరంబునకుం జనుదెంచుచు, గోదావరిచేరి, కాశేశ్వరంబున నిలిచి అచట తీర్థంబులాడి కాశేశ్వరు ముక్తీశ్వరుని గొలిచి యేకశిలా నగరంబునకు పయనంబవు సమయంబున

ప్రతాపరుద్రుడు కాశేశ్వరంబునకు వచ్చుట

శివదేవయ్య ప్రతాపరుద్రుని యేకాంతమునకుం బిలిచి "యింకా పనిద్మేది దినంబులకు నీవు కైలాస నివాసుండవు కాగలవు యిది గౌతమీ గంగాగర్భము, యిందుల జీవంబువిడిచి దివ్యదేహంబుదాల్చి కైలాసంబునకు వచ్చెదవని శివుండు నీకు వరంబొసంగె. యిచ్చటనే యుండి యేకశిలానగరంబు ప్రజల రాబనుపు" మనుటయు నట్లకాక యని రాజు తన పట్టపుదేవులను, రాణివాసంబులంగల కాంతలను, కుమారులను, బంధువు

లను, బండారంబులును, సకల ద్రవ్యంబులును, ఆహితాగ్నులును తెమ్మని అనిపిన అతి త్వరితంబున యేకశిలా నగరంబునంగల కోటలను మేడ లును....లంబును సర్వ బండారంబును మూడు దినంబులకు ప్రతాపరుద్రుని సముఖంబునకు అందరు వచ్చుటయు, అట నరపతిరాయలు అన్నమ దేవుండు డెబ్బదియేడ్గురు పద్మనాయకులున్ను సులతాని దళంబుల నిరవ శేషంబుగా దునిమి జమానుఖానుని దేశంబునకరిగి యాతనితో యుద్ధంబు నేసి, వారికోటలద్రవ్యి ఆసీమలు పాడుచేసి వారలచే ప్రతాపరుద్రుండును కాశేశ్వరంబుకేగుట విని వారు అందరున్ను ప్రతాపరుద్రుని సముఖంబునకే గినవారల కౌగలించికొని "తొల్లి మా పెద్దలయట్ల పరాక్రమంబు నేసితివి నీకు ప్రతాపంబు చెల్లు"నని ప్రతాప బిరుదున్ను ఒసంగి తన కన్నియయైన రుద్రమదేవులనిచ్చి ఐదుకోట్ల సువర్ణంబులు యిచ్చి కృష్ణ మేరగా దక్షిణదేశంబు అరణంబిచ్చి అనుపుటయు,

రామదేవరాయలకు...అన్నమదేవుని కూతురు ముమ్మక్క దేవిని యతనికి వివాహంబుజేసి మూడుకోట్ల సువర్ణంబులు యిచ్చి కటకంబునకుం బంపి: ప్రతాపరుద్రుండు తన తమ్ముడైన యన్నమదేవునిం బిలిచి "నీవు యీ రాజ్యంబునకు పట్టాభిషిక్తుండవై రాజ్యంబు పాలించుమనుటయు" యన్నమదేవుం డిట్లనియె "యీ రాజ్యంబు సకల భూపతులు గొలువ నీవు పాలించిన వెనుకను అట్టి ప్రతాపంబు నాకు చెల్ల" దని (శివదేవయ్యను జూచిన) నాయయ్య "మీ సింహాసనంబు మీ సంతతికిలేదు ఆశలుడుగుం" డనిన యూరకుండిరి.

ప్రతాపరుద్రుండు తన్ను గొలువ...అతని సుతుని అతని దేశంబు నకు పట్టంబుగట్టి రెండుకోట్ల ద్రవ్యంబును యాభైవేల గుర్రంబులనిచ్చి అనుపుమనుటయు,...గజంబులు యిచ్చి కోటి ద్రవ్యంబు యిచ్చి మేనత్త కూతురు కాకితదేవిని అతనికిచ్చి అనుపుటయు తదనంతరంబున నరపతి రాయల బిలిచి "యీ సింహాసనంబును మీరు స్వామిహితంబునం గొలిచి తిరి మీరు మీకు నేనిచ్చిన దేశంబులకునేగి...కొందరు రాయమన్నీలై స్వతంత్రులై యుండిరి. తనకు సహాయంబై వచ్చి(న) సులతాని దళంబు

లకు పదివేల వరహాలు...ముప్పై లక్షలు పంచిపెట్టి అనుపుటయు తన మూల బలంబు నవలక్ష ధనుర్ధరులు కయ్యంబున మడిసిన వారల నెన్నిక జేసి నాల్గుకోట్ల సువర్ణంబులు వారికి నిచ్చి అన్నమదేవున కప్పగించి తదనంతరంబున మిగిలిన ద్రవ్యంబు ఆహితాగ్ని బ్రాహ్మలకు పంచిపెట్టి రాజ్య భారంబు అన్నమదేవుని వశంబుచేసి మిగిలిన ద్రవ్యంబు యిచ్చె.

తాను గోదావరిని తీర్థంబులాడి దుకూలవస్త్ర....బులు దాల్చి విభూతి రుద్రాక్ష మాలికాలంకృతుండై గోదావరి గర్భంబున కూర్చుండి శంభు లింగంబు తన హృదయంబున ధ్యానంబుచేసి దేవియగు విశాలక్షిం జూచి శివదేవయ్య యిట్లనియె "నీవు పెద్దకాలంబు జీవించితివి...నీకు యిష్టంబైన వరంబొసంగెద వేడుము "అనిన ఆయమ్మ నమస్కరించి "మహాత్మా తనకు పతి జీవితంబు హె....నాకు చేయు"మనిన ఆయయ్య

ప్రతాపరుద్రుని నిర్యాణము

యట్లని యొసంగిన రుధిరోద్గారినామ సంవత్సర మాఘ శుద్ధ సప్తమి...ప్రతాపరుద్రుండు నిజదేహంబు విడిచి దివ్య దేహంబు దాల్చి దివ్య విమానా రూఢుండై ఆరాజు కాంత విశాలాక్షియు పతితోడనే దేహంబు విడిచి దివ్య విమానం బెక్కి ఆ పుణ్యదంపతులు ఆ విమానంబు సర్వజనులు చూచుచుండ కైలాస నివాసంబున కేగిరి.

అన్నమదేవుండు ప్రతాపరుద్రునికి విహితకార్యంబులు దీర్చి వైరాగ్యంబు దాల్చియుండె. ప్రతాపరుద్రుని సుపుత్రుండైన వీరభద్రయ్యను పట్టంబు కట్టి తానును విరూపాక్షుండు ఈశాన్యభాగంబున వింధ్యదేశంబులకై చనిరి. శివదేవయ్యగారు శ్రీశైలంబునకుం జనిరి. వీరభద్రయ్య పట్టాభిషిక్తుండై రాజ్యంబుసేయు సమయంబున అక్కడ ఢిల్లీసుల్తాను ఉల్లూ

వీరభద్రయ్య పట్టాభిషేకము

ఖానుడు సిద్ధిఖానుడు మడియుట, తమ దేశంబుల దోచుట, నరపతిరాయలుఇంత చేసెనా యని రౌద్రాకారుండై ప్రయాణ భేరి వేయించి మూడు లక్షల గుఱ్ఱంబులను పదిలక్షల పదాతివర్గంబును, గూర్చుకొని విజయనగరంబుపై చనుదెంచు నపుడు వీరభద్రయ్య సులతానితో విహితపర్చుకొని కొంచెం

బుగా రాజ్యంబు లోనుచేసుకొని యేలుచుండె. విజయనగరంబున నుండి నరపతిరాయలు వచ్చి సులతానివారి బలంబులు రానివ్వక ఆవల కృష్ణ మేరగా రానివ్వక గండ్లుగాచి ముప్పది లక్షల పదాతివర్గంబుతో సులతాని వారి బలంబులతో యుద్ధంబులు సేయుచు గనుములు గట్టి గరవణంబులు రానీక యిట్లు పెక్కు భంగుల చీకాకుసేయుచు పంద్రెండు వరుషంబులు పోరిన సులతానియు వారి పేరు తివియక నచట బెదదకోటయను పురంబు కావించుకొని యుండె. క్రమక్రమంబున కొంచెంబుగా యయిన నరపతి రాయలతో పోరంజాలక తన భూములు తనకు లోనుగాక మరలబడుట విని ఢిల్లీకి పోక నరపతిరాయలతో గూడి సంధిచేసుకుని నరపతిరాయలకు అప్పనంబులు నడుపుటయు యిటీవల యేకశిలానగరంబు ఢిల్లీ సులతాని వారు తన (ఆజ్ఞకు లోనుగా జేసుకొని దేవాలయంబులు పడగొట్టించుచు బహు విధంబుల బాధించుటయు వీరభద్రుడది సహింపక సులతాని భృత్యు లందఱిం దునిమించి తాను సమస్త జనంబుతో పురంబు వెడలి కొండవీటి నున్న రాయల గలసెను.)



అనుబంధము - 1.

# శిలాలేఖనము

[ కీ. శే. శ్రీ మానవల్లి రామకృష్ణకవి, M. A. గారు 1924 సెప్టెంబరు భారతియందు "కొన్ని కాకతీయ శాసనములు" ప్రకటించినారు. వానినుండియే యిది గ్రహింపఁబడినది. శ్రీ కవిగారు తాము స్వయముగా వ్రాసికొన్న నకలును మెకంజీదొరవారి పండితు లొకరు వ్రాసికొన్న ప్రతితో సరిచూచి ప్రకటించినట్లు వ్రాసినారు.

సిద్ధేశ్వరమ కొండమీది మఠమున నివసించిన శైవారాధ్యుఁ డెవరో కాకతీయ రాజ్యవైభవమును శిలోట్టంకితము గావింప యత్నమొనర్చి తుదిపఱకు పూర్తిగావింపక యీ శిలాలేఖనములు నడుమనే విడిచివేసియుండువనియు, నిట్టి శిలోట్టంకిత ప్రశస్తి కావ్య నాటకములు పెక్కులు కలవనియు వచించి కవిగారు ధారానగరమున భోజరాజకీర్తిని వర్ణించు ప్రాకృత శిలాలేఖనమును, మదనమహాకవి రచిత పారిజాతమంజరి యను నాటికను, విగ్రహరాజు ప్రతాపమును వర్ణించు హరికేళి నాటకమును నుదాహరణములుగాఁ జూపిరి.

ఈ శిలాలేఖనమునందలి యక్షరములు గణపతిదేవ రుద్రదేవ ప్రభువులనాటి వానివలె నున్నవనియు శ్రీ కవిగారు వ్రాసియున్నారు.

ఈ శాసన కవికాంధ్రదేశమన్నను నాంధ్రప్రజలన్నను, నేకశిలానగరమన్నను గాఢమయిన యభిమానానురాగములున్నట్లు శాసనము స్పష్టము చేయుచున్నది. ఇందలి వర్ణనలు రసాలవాలములయి యాంధ్ర ప్రబంధవర్ణనలకు దీటుగానుండి హాలచక్రవర్తి ప్రాకృతగాథలను తలంపునకుఁ దెచ్చుచున్నవి. ]

శ్రీ ॥ 1. ఆంధ్రా స్సంతి గరీయాంసః కాంచనప్రాయశాలయః । యథా హాటక శైలస్య కటకా రత్నశాలినః ॥ కేదారా యత్ర

2. శాలీనాం తరంగితజలాంతరాః । కృష్ణాంగచ్ఛాయహరితా యథా జలనిధే స్తటాః ॥ శాలికా రక్షిణీ హస్త తాళైః కంకణనాద

3. తః । త్రాసితాః కిల గచ్ఛంతి యద్గిత్యా సద్గిరా జితాః ॥ రసాల పాల హింతాల తాల కేతక కర్తనే । కాంతారే యత్ర కాంతానాం జా

4. తః శృంగారసంగరః ॥ రసాల హాలా గంధేన హసనాంగీకృతా దృశః । అళీనాం యత్ర హాహాంతా లక్షయంతి న గేహినీః ॥

5. సంతానకాంతారలతా గంధగ్రంథిలచేతసః । యత్రాలయాః కర్ణికార విగ్గంధేన నిరంతరాః ॥ హాలికస్త్రీ కటాక్షాణాం కాంత్యా

6. గళితచేతనాః । నసీదంతి కృతిం యత్ర కేచిత్కు-హకనందనాః ॥ గతాని హాలికస్త్రీణాం లక్షయంతి నిజైర్గతైః । నేత్రాంత నేత్రైర్హ్రాస్యంతి హరిణ్య శ్చ య

7. దంతరే ॥ కేదార సస్యకాంతీనాం సంక్రాంతానాం తతః సరః । చలేన నీరనిచయా యదీయా జాయితే క్షతాః ॥ శంఖ కంకణ జాలస్య లల

8. నా కరసంగినః । కశేన యత్ర నాదేన కలహంసాః శతం జితాః ॥ లక్ష్యంతే యత్ర నిచితాః లక్షశః శాలిరాశయః । గేహాంగణే యథా కాలే తటి (త్కూ-)

9. ంతి ధరా ఘనాః ॥ ఖలాః శాలీసతాం యాంతి యత్ర కంటక రక్షితాః । కటంకరీయ నికట నిరాఘాట కటస్థలాః ॥ కదళీ కాననే యత్ర హారిత చ్ఛ

10. ద్మ హారిణీ । కీరా నిరంతరం యాంతి నిజజాతీయశంకయా ॥ హలా హలంత్యః సతతం యత్రత్యోత్సాహకారతః । నిర్దిశంతి నిరాతంకం నర్తన నాయ శిఖండి

11. నః ॥ యత్ర కాంచనసంకాశా రసాలానాం రజః కణాః । టంక ఘృష్టస్య తరణేః యథా కే(కో ?)శాశ్చకాసతి ॥ కషణకస్త్రీ కేశహస్తే హస్తనాళిక సంయతిః । నహ(ఖ ?)రా (గ్రైః ?)

12. యత్ర ధత్తే శంకాతంకం శిఖిండిని ॥ నగరాణి గరీయాంసి నారీరమ్యాణి లక్షశః । స్థానీయానాం సహస్రాణి యత్రత్యా న్యతిశేరతే ॥ ననందనం చైత్రరథం న

13. చ యత్ర నిరీక్ష్యతే । కాంతారం నందనం కృత్యం కృత్వా చైత్ర రథా హ్వయాః(యమ్ ?)॥ కరిణః కరిణీసక్తిం యత్ర సంశ్రిత తారకాః । సకళత్రాః శంకయంతే గాత్ర

14. హీనా గజాననాః ॥ నిచయై రాస(న ?)తానీలైః శతశః స్యందనా ఘనాః । నదంతః కింకిణీజాలైః యథా కాంతై స్తడిద్గణైః॥ తటాకా యత్ర శతశః సారి

15. ణ్యశ్చ సహస్రశః । పరిన్నాథాన్ దర్శయంతి తేషాంచ కిల గేహినీః ॥ ఆదిత్య ఘృష్టిసంకాశా దృశ్యంతే యత్ర గృష్టయః । క్షీరం దదత్యః కృత్యా

16. నాం త్రిజగత్యఘనాశికాః ॥ ఏకాస్త్యేకశిలాఖ్యాత్ర నగరీ యా గరీయసీ । సాగ రాంతాం ధరాం కృత్స్నాం కాంతా కాంతం నిరీక్ష్య(క్ష ?)తే ॥ కళాగిరః కృశాంగీనాం

17. రశనాః కింకిణీఘనాః । యంత్రాంగదాని చాంఘ్రీణాం నిర్వాహాన్యై కిల శ్రియః ॥ చంద్రశాలాసంశ్రితానాం చంద్రాస్యానాం నిరంతరైః ।

18. యత్రాస్య చంద్రై గ్గగనే చంద్రజ్ఞానం నశంక్యతే ॥ యత్ర రథ్యాంగణ గతా ఘనసారస్య రాశయః । దృశ్యంతే చంద్రికా సంఘా యథా....

19. ణః ॥ ఇంద్రనీలై శ్చంద్రకాంతై స్తథా యత్ర నిరంతరైః । అంధకారా శ్చంద్రికా

శ్చ దర్శయంతి కదా గృహాః ॥ కాంతా ఈక్షంతి యత్కాంతాః కాంతానాం హృద

యం దృశా । కాంతా యాఘాతి యత్కాంతా కాంతానాం హృదయం దృశా॥
కళిందకన్యాలహరీ సంఘరింఖాణహారిణః । కటాక్ష యత్ర నారీణాం దృ
ష్టయంతి వరింజనాః (?) ॥ హాలారయేణ తరళా యత్రారాశ దృశా దృశః ।

బద్ధరేఖా దర్శయంతి రతినాథకరస్థితాః ॥ అధరా యత్ర నారీణాం సక
లా నధరీకృతాః । ఆఖ్యాంతి నళినశ్రేణీః కటాక్షైశ్చ కటక్షతాః ॥
తర్జయంతి యత్ర నార్యః (రీ ?) కరకంకణకంకణీః । ఆక్రీడ దీర్ఘికా
హంసీ(ః ?)గతి తస్కరతాం గతాః । కణకారతి కిరణ సంకీర్ణా న్నహారి దంకణమ్ (?)॥ అంక

ణాయంతి సంగీతం కతశోఘం యదంగణాః । కర్ణ కల్హార కణికా హేలాశశి

కరోహి నః ॥ యత్రాశినస్త్రాసయంతే కాంతాకటక ఝంకృతైః । కటాక్ష
కాంతికళయా హాసచంద్రైః కళంకితైః ॥ న హాసయంతి నాదానాం
రూస్తాయణనేక్షణాః (?) । కనీనికాకళంకిన్యా కాంతిచంద్రికయాస్త్రియః ॥
ఉల్లోళయంతి యత్రత్యా శ్చంద్రికాహారిణః ఖగాన్ । లలాటేనార్ధ
చంద్రేణ కృత్స్నచంద్రై స్తదాననైః ॥ యదంగనాః కళాసక్తిం వజానంతి
విజా జితాః (?) । నాసాలంకారకాంతి...నక్షత్ర....

అనుబంధము - 2

# రంగనాథుని రగడ

(చూ. పుట 161)

ఇందు బ్రాకెట్టులలోని భాగములు శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి M. A., B. O. L. గారి "వీరశైవాంధ్రవాఙ్మయము" లో నొసఁగఁబడిన పాఠమాధారముగాఁ గూర్పఁబడినవి.

ఈ రగడభేదమునకు "ద్విరదగతి" యని పేరు. ఇందొక్కొక్క పాదమునకు నాలుగేసి యయిదుమాత్రల గణములుండును. ఆ గణములు నగ, నలల, భల, సల, త, ర లని యనంతుఁడు. (చూ. ఛందోదర్పణము ఆ: 3. ప. 58) యతి ఒకటి మూఁడు గణముల మొదటి యక్షరములకుఁ జెల్లును. (చూ. అప్పకవీయము ఆ. 4 ప. 298) ప్రాసనియమము కలదు.

ఈ రగడ లక్షణమును అనంతుఁడు నప్పకవియుఁ జెరియొకరీతిగాఁ జెప్పిరి. వానిని వివరించుట యిట ప్రస్తుతముకాదని విడువఁ బడియె.

—సంపాదకుడు

శ్రీపార్వతీశుఁ జూడక
పాపాత్ముఁడ నగుచుబోవఁ బథమునఁ బక్షుల్
దీపించు దృష్టి తొలఁగిన
శ్రీపతి నడుగంగఁ జెప్పె శివుఁ గర్తనుగాన్,

శ్రీశైల వల్లభుని శిఖరంబుఁ బొడగంటి
కాశీపురాధీశు గౌరీశుఁ బొడగంటి
(సర్వలోకేశ్వరు సర్వేశుఁ బొడగంటి
సర్వసంరక్షకుని సర్వంబుఁ బొడగంటి
పరమాత్ము నీశానుఁ బరమేశుఁ బొడగంటి
పరమయోగీంద్ర హృత్పదనిలయుఁ బొడగంటి)
మహినొప్పు శ్రీశైల మహిమ నేఁ బొడగంటి
బహువేదశాస్త్రముల్ ప్రణుతిసేయుటఁ గంటి
భూలోక కైలాస పురమనగఁ గనుగొంటి
ఫాలాక్షుఁ డిచ్చోటు పాయకుండుటఁ గంటి

ధృతిఁ దూర్పు మొగసాలఁ ద్రిపురాంతకముఁ గంటి
పర్వతలింగంబు ప్రాణేశుఁడని కంటి
పర్వతేశ్వరు హృదయ పద్మనిలయునిఁ గంటి
భక్తు లప్రతిహత ప్రతిభమతులని కంటి
భక్తులకుఁ బ్రత్యర్థిపరులు లేరని కంటి
భక్తు లాపదలచేఁ బట్టువడరని కంటి
శివభక్తి దూషకులు చిరపాపులని కంటి
శివభక్తి దూషకులు చెడిపోదురని కంటి
త్రిభువనము భక్తులకుఁ దృణకణంబని కంటి
సభలందు భక్తులకు జయవాదమని కంటి
గౌరీశునే సర్వకర్తగాఁ బొడగంటి
కారుణ్యమున శివుఁడు కునిపించెనని కంటి
బహుపాపములు నన్నుఁ బట్టి విడుచుటఁ గంటి
నయముగా నయనములు నా కీయఁ బొడగంటి
భయభక్తులను భర్గు పాదములు పొడగంటి
ఇది పుణ్యమని కంటి నిది గణ్యమని కంటి
నిది యోగమని కంటి నిది భోగమని కంటి
నిది ధర్మమని కంటి నిది మర్మమని కంటి
నిది నిత్యమని కంటి నిది సత్యమని కంటి
(కడఁగి సంసారంబు కడగంటినని కంటి
కడఁగి శ్రీగిరి చెన్న కారణ్యమది కంటి
ఘనుఁడు రంగన దూషకర గండఁడని కంటి
జనకల్పతరులలో జయశాలియని కంటి
తవిలి రంగనమంత్రి ధన్యకృతియని కంటి
భువిలోనఁ బ్రోలాంబ పుణ్యవతియని కంటిఁ)
నింక శ్రీగిరిఁ జేర నేఁ గందునని కంటి
శంకరుని కృపవడయు సమయ మిదియని కంటి
నింక నాయెత్తు కృతులిత్తు నని పొడగంటి
నింకఁ గృతిచెప్ప నాకేమి భరమని కంటి
వడిఁ గృతుల్ నాయెత్తు వచ్చునని పొడగంటి
(మృడుఁ డింక నా కృతుల్ మెచ్చునని పొడగంటి)

తనర శ్రీరంగకవి దాతయని పొడగంటి

..............................

భువిలోపలఁ బ్రసిద్ధ పుణ్యుఁడని పొడగంటి

(శివభక్తి దీప్తి కాచంద్రార్కమని కంటి

శ్రీగిరీశునకు నర్పింతునని పొడగంటి

శ్రీగిరీశ్వరుని కృప చెన్నలరునని కంటి)

# పద సూచిక

SRI SIDDHESWARA CHARITRAMU

[Kakateeya Rajula Charitra - Pratapa Charitra]

BY KASE SARVAPPA

*Edited by*

K. Lakshmi Ranjanam, M. A.,
Professor & Head of the Telugu Department, Osmania University.

*Published by*
THE ANDHRA WRITERS' ASSOCIATION, HYDERABAD.

Rs. 6